# అంకితము

విశ్వవిఖ్యాతి నందిన రాజకీయ ప్రజ్ఞాశాలియు
శాంతిసౌజన్య హృదయులు, ఆధ్యాత్మిక చింతనాపరులు,
దేశభక్తులు, భారతలోకసభాధ్యక్షులునగు

శ్రీమాన్

**మాడభూషి అనంతశయనంఅయ్యంగార్ వారికి**

భక్తి

ప్రేమలతో

# సమర్పణము

—: ♦ – ♦ :—

కవిరాజ్ డా॥ శ్రీనివాసపురం శేషాచార్లు (శుభశ్రీ)
వైద్యశ్రీ శ్రీనివాసపురం రామాచార్యులు (రమ్యశ్రీ)
శ్రీ లక్ష్మీనారాయణ్ (రమాకాంత్)

# పీఠిక

"Loyalty is a quality of the soul rather than a mere physical or mental gesture.

Loyalty compels a man in a great crisis to forgo personal advantage, gain, and preferment, for the benefit of his chief and his country."

దేశముల స్వతంత్రయుగ చరిత్రలలో రాజభక్తి దేశభక్తికి పర్యాయపదమై యుండును. దేశములందు మహాసామ్రాజ్య నిర్మాతలను, విశాలరాజ్యపాలకులను, విజేతలను పెంపొందించు పరాశక్తి రాజభక్తి. అది మానవుని జీవితపుష్పమునకుఁ బరార్థచింత, స్వార్థరాహిత్యము అను సుగంధముల నలవఱచు వాహిక. అది మానవుని జీవితమును ఉచ్ఛలితము చేయు నుత్తమగుణములలో నొకటి.

అట్టి సుగుణముచే సువాసితజీవనులైనవారు మహత్తరమగు ఆంధ్రజాతియం దెందఱో పుట్టిరి. అందుఁ గొందఱి చరిత్రలు 'ఆంధ్ర రాజభక్తులు' అను పేర ఇందుఁ గ్రథితములైనవి.

ఆంధ్రతాబీజములను మన బాలుర హృదయక్షేత్రములందు విత్తుట కిట్టి గ్రంథములు కొంతవఱకు ఉపకరించునని గ్రంథకర్త యుద్దేశము.

ఈ గ్రంథకర్తచేత సంపాదితమైన 'ఆంధ్రభూమి' పత్రికను ఆదినుంచి అండగా నిలిచినవారు, కావ్యగీతిప్రియులు, ఈ గ్రంథకర్తకు హృదయమిచ్చిన మిత్రులు ఐన శ్రీ చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్ గారికి ఈ చిన్న గ్రంథము అంకిత మీయఁబడినది.

# విశ్వనాథనాయఁడు

గోడసి నింపుకొన్నది అరుంతుదభీషణమౌ ప్రతిజ్ఞ, ఓ
హో ! దయమాలినావటె, మహోగ్రతపస్సున గన్నతండ్రిపై
నీదు కటారి విక్రమము నేర్పునటించుటె ! స్వామికార్యసం
పాదనకై వరించితివి బాంధవనాశముసైన వీరుఁడా !

—ఊటుకూరు సత్యానారాయణరావు

విజయనగరసామ్రాజ్య నియంతయైన కృష్ణదేవరాయలు ఒకనాఁడు తన రాజధానీనగరమున ముత్యాలగద్దెపై నాసీనుఁడై పెద్దకొలువు తీరి యుండెను. మంత్రులు, సామంతులు, సేనాపతులు, పురోహితులు, కవులు, గాయకులు చేరి చుట్టును బలిసి కూర్చుండియుండిరి.

అప్పుడొక పురుషవ్యక్తి చిన్న బాలుని ఒకనిని వెంటబెట్టుకొని వాడుబాఱిన వదనముతోఁ గొలువుకూటము ప్రవేశించెను. ఆతఁడు నేరుగా నడచిపోయి చక్రవర్తికి వంగి వంగి సలాములు చేసెను. పిమ్మట నాతఁడు మడిచేతులతో రాయల యెదుట నిలబడియుండెను.

కృష్ణదేవరాయలు అతనిని చూచి ఆశ్చర్యముపొంది “ఏమి ? చంద్రశేఖరా! మధురపాండ్యరాజ్యమును విడచి, రాజ్యచిహ్నములను త్యజించి ఇట్లు వచ్చితివేమి? వెంటనొక్క-పరిచారకుని ఐన తీసికొని రాలేదేమి? వాడియున్న నీ మొగము ఏదో అశుభమును సూచించుచున్నది. అది ఎట్టిది?” అని ప్రశ్నించెను.

ప్రథః

# అభిప్రాయం

శ్రీనివాసపురం సోదరులచే భాషాంతరీకరింపబడుచున్న విజయనగర చారిత్రిక నవలలందలి "జగన్మోహిని" అను నవలయందే ఈ భాషాంతరీకర్తలను గురించి, యిట్టి నవలలను తెలుగునకు తీసుకొనిరావలసిన అవశ్యకతనుగురించి నా అభిప్రాయమును తెలిపి యున్నాను. ఈ "శాంతివాది" విజయనగర చరిత్రమీద వీరు మనకందిస్తున్న రెండవనవల.

కృష్ణదేవరాయలు విజయనగర రాజులందరిలో నాయకమణివంటివాడు. రాయలజీవితంలో అదృష్టం అనే ముత్తెములు చిలుకరించినది. భాగ్యదేవత బంగరు పంట పండించినది. ఇతడొక ఉదారుడైన చక్రవర్తి. నవ్యనవనీత సమమైన నిండు మనముగలవాడు. ఇతనివంటి ఉదారప్రభువులా చరిత్రలోనే కొందరున్ననూ వారికే ప్రశస్తి రాలేదు. అందుకొరకే గాబోలును, రాయలా నాటినుండి ఆంధ్రజాతి కొక ఆరాధ్య దైవమైనాడు.

'శాంతివాది' ఆ రాజన్యుని ఉత్తమ చరిత్రమందలి యొక ప్రధానఘట్టము. రాయలు, వారి పూర్వులగు హరిహర, బుక్కరాయలు, విద్యారణ్యులవారూ, మన సంస్కృతికి చేసిన బహుళ ప్రచారం విస్తృతం అంతేకాక, మనకు గొప్ప దని చెప్పదగిన యీ మహానగరం క్రీ. శ 1336 సం॥ విద్యారణ్య మునీశ్వరుని పేర హరిహర బుక్కరాయాదులచే

నిర్మింపబడి, మొదటి బుక్కరాయల కాలమున విజయనగరమను పేర వ్యవహరింపబడి యప్రతిమ వీరరాజ్యవరేణ్యులగు కృష్ణరాయాదుల యంసద్వయంబుల సకల సంపత్సౌభాగ్య సంశోభితమై యలరారి, యించు మించు రెండు శతాబ్దములవరకు దినదిన ప్రవర్ధమానముగ మహాసామ్రాజ్య లక్ష్మీనిలయమై యొప్పి చివరకు పక్షములు తెగిన పక్షివలె దిక్కులేనిదై విగ్రహారాధన ద్వేష మతాభిలాషులు, ముష్కరులు అయిన తురుష్కుల కబంధహస్తములలో చిక్కువడి పూర్వ వైభవ సంపదలను గోల్పోయి విధ్వంసమై నేడొక పెద్ద శ్మశాన వాటికవలె నున్నదందురు. ఈ జీర్ణ విజయనగర దృశ్యాలను స్వయముగా వెళ్ళి దర్శించి రావాలని నా చిరకాల వాంఛితము. కాని - అశక్తత వల్ల యీ నాటివరకు వెళ్ళలేక పోతున్నాను.

శ్రీనివాసపురం సోదరుల రచనా విధానము రమణీయముగ నున్నది. వీరిరచనను గురించి ఎక్కువగా నేను పాఠకులకు చెప్పవలసిన దేమియును లేదు. మన తెలుగు వారికి వీరు సుపరిచితులే. మనవాళ్ళు అందరూ వీరిచే భాషాంతరీకరింబడుచున్న సంపూర్ణ విజయనగర చరిత్రమును చదువగలరని ఆశిస్తున్నాను.

మద్రాసు,
30-12-62

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి.

# తొ లి ప లు కు లు

సుమారు రెండున్నర శతాబ్దములవరకు మహోన్నతవైభవ రాశియై వర్థిల్లి, వాసిగాంచి నాగరికతా శిఖరాన్నధిరోహించిన విజయనగర సామ్రాజ్య వినాశానికి మహమ్మదీయ సుల్తానులతో కృష్ణదేవరాయలు వ్యవహరించిన విధానమే చాలవరకూ కారణమన్నది చరిత్రచదివిన చాలమందికి తెలుసు. రాయలు క్రిందటి వైరాన్ని మరచి, ప్రతీకార వాంఛను పడగొట్టనీక ప్రజల ఆశ - ఆకాంక్షల ప్రకారం బిజాపుర సుల్తానులను స్నేహవాత్సల్యంతో చూచివుంటే 'రక్కసతంగడి' యుద్ధం సంభవించి వుండేది కాదేమో!—

రాయలావేశపరుడు. ఆవేశంలో యుక్తాయుక్తము నెరుగక తొందరపడి ఏదో ఒక కార్యం చేయడం, తెలిసి పశ్చాత్తాపపడడం యాతని జీవితంలో సాధారణముగ జరిగిన విషయములు! ఈయన ప్రవృత్తి చాల విచిత్రమైనది. కొన్ని సమయములలో తిమ్మరుసు సైతమీతని నర్థము చేసుకోలేక తికమక పడుచుండెడివాడు. అమాత్యశేఖరుని పలుకు పాలించక ఆపదలో చిక్కుకున్న ఘట్టములీయన చరిత్రలో చాల గలవు ఇవన్నియు చక్కదిద్దుకుని రాజ్య క్షేమానికై తాను బ్రతికి, రాయలను బ్రతికించుకొనవలసిన మహాభాగం, బాధ్యత తిమ్మరుసుమీద పడినది. ఈ భారం, బాధ్యత చాల దక్షతతో ఆయన మోయగలిగినాడు ప్రస్తుత నవల ముందలి

కథాంశంగూడా చాలవరకూ యీ విషయమునకు సంబంధించినదే.

శాంతిసందేశ మివ్వడానికి వచ్చిన 'శాంతివాది' పలుకులను నిర్లక్ష్యపరచి అతనిని ఖైదుచేసి చివరకొకరోజు అడవిలో శత్రువులచేత జిక్కి చావనున్న సమయంలో — క్రితం ఎవరినైతే తను దోషిగా భావించి ఖైదుచేశాడో — ఆ 'శాంతివాది' చేతనే ప్రాణాలు రక్షింపబడటం యీ నవల యందలి ప్రశస్త్యాంశము. ఈనవలలో వచ్చు 'షంషేర్ ఖాన్' పాత్ర తప్ప, తక్కిన వృత్తాంతమంతయు చారిత్రకాధారముల ననుసరించి వ్రాయబడినదేనని మూలకర్తగారు తమ మున్నుడిలో తెలుపుకొని వున్నారు.

ఈ నవలపై తమ అమూల్యాభిప్రాయ మొసగిన శ్రీ జి. సుబ్రహ్మణ్యం గుర్నేనాథశాస్త్రిగారికి మా హృదయపూర్వకాభివందనములు. ఈనవలను అచిరకాలంలో అందంగా ముద్రించి అందుబాటుకందజేసిన 'శ్రీనివాస ప్రింటింగ్ ప్రెస్' అధినేతలకు మా కృతజ్ఞతలు. ఇంకనుదొరలిన ముద్రణాస్ఖాలిత్యములను ద్వితీయ ముద్రణ భాగ్యమబ్బినేని సవరించుకోగలమని విన్నవించుచు నీ మున్నుడి ముగించుచున్నారము.

భాషాంతరీకరణ కర్తలు,
— "రమ్యశ్రీ"
— "శుభశ్రీ"
— "రమాకాంత్"

1-1-1962

# 1

రాజధానిలో మహానవమి సంబరము—

సార్వభౌమ శ్రీకృష్ణదేవరాయలు యిప్పుడు 'విజయ మందిరం'లో విశేషమైన సభ చేయనున్నాడు. సామ్రాజ్యపు నలుమూలలనుంచి సామంతులు, మాండలీకులు, పెద్ద-చిన్న పాళేగార్లు తమ తమ సమస్త సేనాబలాలతో రాజధానికి ఆగమనం చేశారు. శ్రీరంగపట్టణం, మల్లై చెన్నూరు, ఘన గిరి, ములువై, గుత్తి, కొండనవోల్, సిద్ధవట్టం, సిద్ధాపురం, నాగమంగళం, ములువాడు, రాయదుర్గం మొదలైన పదు నెనిమిది రాజ్యాల మాండలీకులూ; కళస, మంగుళూరు, బారకూరు ప్రభువులూ; ఇంకా దక్షిణాపథపు అనేక చిన్న-పెద్ద సంస్థానీకులూ సార్వభౌముల విశేషామంత్రణపుమేరకు రాజధానికి వచ్చి చేరారు.

సామాన్యంగా సామంతులు, మాండలీకులు రాజ బొక్కసానికి చెల్లించవలసిన రాజాదాయాన్ని, కప్పములను-కానుకలను నవరాత్రివేళకు తెచ్చి సమర్పించడం క్రిందటి నుంచివచ్చిన పద్ధతి. ఈ రాజాదాయాన్ని ఆ యా సంస్థానీక, మాండలీకులే వచ్చి అప్పగించాలన్న నియమ మేమీ లేక పోయినా, నవరాత్రివైభవాన్ని చూడడానికి సామంతులు, మాండలీకులు రాజధానికి వస్తూవుండేవాళ్ళు. ఈమాండ లీయులు నవరాత్రోత్సవానికి అందరికీ తమ తమ చతురంగ

సేనాబలసమేతంగా రాజధానికి రావడానికి విశేషమైన ఆమంత్రణలు పంపించారు. ఈ ఆమంత్రణపు టర్థం రాయలు మళ్ళీ యెవరిమీదనో యుద్ధసన్నాహాలు చేస్తున్నాడని. ఈ పిలుపు కేవలం సౌజన్యమైన పిలుపు కాకుండా రాయల కఠినాజ్ఞయే అయింది. దీన్ని తిరస్కరించే గుండెధైర్యం కాని, ఉపేక్షాభావం కాని యెవరికుంటుంది? కృష్ణదేవరాయల పేరెత్తితే చాలు వైరులు తల్లడిల్లిపోతారు. 'అరిరాయ భయంకరు' డని రాయల బిరుదు. ఇలావుండగా సామంతులు రాయల ఆజ్ఞను ధిక్కరించి నడవడానికి సాధ్యమా? అందరు రాయల ఆనతిమేరకు తమ తమ చతురంగబలాలతో రాజధానికి చేరుకున్నారు.

అందరికీ ఆశ్చర్యం—రాయ లీమారు యెవరిమీద యుద్ధసన్నద్ధుడౌతున్నాడని. ఎందువల్లనంటే, ఈవేళప్పుడే రాయల పరాక్రమానికి దక్షిణాపథపు రాజు లనేకులు బెదరి, తాముగా నేనో లేక అపజయంబొందో మొత్తానికి శరణు జొచ్చారు. విజయనగరరాజుల ప్రబలవిరోధియైన ఉత్కళ గజపతి కటకపురియుద్ధంలో అపజయంబొంది, రాయలకు శరణాగతుడయ్యాడు. తన కుమార్తె అయిన జగన్మోహినిని కృష్ణదేవరాయలకు పెళ్ళిచేసియిచ్చి, బాంధవ్యపురస్కరంగా ఉత్కళదేశపు మాండలీకు డయ్యాడు. ఇక్కడ దక్షిణాపథంలో శ్రీరంగపట్టణం, శివసముద్రాల రాజులు ఓటమి బొంది, రాయలప్రభుత్వాన్ని ఒప్పుకున్నారు. విజయనగర సామ్రాజ్యం ఉత్తరంలో కృష్ణానదీతీరం మొదలుకొని సింహళ ద్వీపంవరకు, పూర్వ పశ్చిమసముద్రాలను [illegible]

మైన హిందూసామ్రాజ్యంగా వెలిగింది. ఉత్తరమున బహామనీసుల్తానులు కృష్ణదేవరాయల పేరువింటే వణికేస్థితికి వచ్చారు. పశ్చిమాన పోర్చుగీసులు, సింహళపురాజు పడన భువనైకబాహు రాయలతో స్నేహాకాంక్షను పొందారు.

రాయలకాలంలో పదిసంవత్సరాలపాటు సంతతమైన శ్రమ, బలిదాన, ధనవ్యయాలతో భిన్నమైపోయిన సామ్రాజ్యాన్ని మళ్ళీ సంస్కరించి, శత్రుభయాన్ని నిర్మూలంచేసి, రాజ్యపాలనను ఒక విధానానికి తీసుకురావడమైనది. సామ్రాజ్యపు దిగంతాలలో చాలా యేళ్ళనుండి ఆవరించియున్న యుద్ధపు కారుమబ్బులు ఉత్కళ విజయంతో చలించి, దేశంలో శాంతి సుభిక్షాల వెన్నెల వెలిగింది. ప్రజానీకపు టాశయాకాంక్షల సంకేతంగా రాజధానిలో మహోన్నతము, దివ్యము, భవ్యము అయిన 'విజయమందిరం' ప్రభవించింది. అది శత్రువిజయ సంకేతంమాత్రమే గాక, ప్రజల శాంతి, సుఖ సంపత్సమృద్ధులకు ద్యోతకమూ అయినది.

ఇలావుండగా వాళ్ళ యుద్ధపుమాట !

ప్రజలకు యుద్ధపుమాటను తలచుకోవడానికికూడా భయంగావుంది. యుద్ధంమూలంగా కొన్నివిధాల బాధలకు, మృత్యువుకు బలి అయిపోగా మిగిలిన ప్రజలకు యుద్ధమంటే జుగుప్స జనించసాగింది. యుద్ధమంటే తమ సమస్త సంపదను దోచుకోనుట, బంధుబాంధవుల హత్య, తమ ప్రశాంత జీవితపు సుఖసంపదల బలి అని వాళ్ళ భావన. అందువల్లనే వాళ్ళకు యుద్ధం వద్దనిపించింది. శాంతినికోరుతున్న ప్రజలకు [illegible] వినవచ్చినది సమరసన్నాహం! వాళ్ళ సహనాను

బలపరచేలా రాజధానికి రాజప్రతినిధులు, సామంతులు తమ చతురంగసైన్యాలతో వచ్చారు. రాజధానికి వచ్చిన సైన్యాలనుచూసే, ప్రజ యిది యుద్ధప్రయత్నమని తెలుసుకుంది. కానీ—ఇదివరకు యీ విషయం కేవలం వూహాగానే మిగిలింది. సార్వభౌము లీవిషయంలో యే చాటింపు ప్రకటించివుండలేదు. అందరూ యిప్పుడుజరిగే సభలో యీ సంధి-విగ్రహాలవిషయం తీర్మాన మౌతుందని భావించారు. అందువల్లనే జనసముదాయాని కిప్పటి మహానవమి ఉత్సవం పట్ల విశేష సంబరాడంబరాలు !

సార్వభౌమ కృష్ణదేవరాయలు ఉషోవేళకే లేచి, తన అనుదిన అంగసాధనను తీర్చుకొని చంద్రశాలకు వచ్చారు. అక్కడ సుమంగళులు రాయలకు శాస్త్రోక్తంగా సుగంధ పూరితమైన తైలాన్ని లేపనంచేసి, అభ్యంగనాదులు ముగించారు. మజ్జనానంతరం రాయలు శుభ్రవసనధారుడై, నుదుట తిలక ముంచుకొని, పూజాద్రవ్యాలతో-తన యిష్టదైవమైన శ్రీ పంపావిరూపాక్షస్వామి ఆరాధనకు వెళ్ళారు. శరన్నవరాత్రి తొమ్మిదిరోజులు శ్రీ విరూపాక్షస్వామికి అఖండమైన పూజాపురస్కారాలు జరుగుతూ వున్నాయి. ఇప్పుడు మహాపూజ. స్వర్ణవిగ్రహమున్న పూజామందిరము సమీపానికి రావడానికికూడా యెవరికి అవకాశంలేకుండ అన్నివైపుల బలమైనరక్షణ. రాయలు పురోహితుల సముఖంలో తన యిష్టదైవాన్ని శ్రద్ధాభక్తులతో ఆరాధించి, విగ్రహమును కౌగలించి, సాష్టాంగనమస్కారం చేసి, ఆ తర్వాత యాగశాలకు వెళ్ళుచ్చారు.

యజ్ఞశాలలో శరన్నవరాత్రి అభిమానదేవతలైన మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళి వీళ్ళ ప్రీత్యర్థంగా నిత్యం హవనహోమాలు అవ్యాహతంగా జరుగుతున్నాయి. ఇప్పుడు పూజ చివరిదినం. అభిమానదేవతలకు పూర్ణాహుతి. దీని కోసం ఆచారప్రకారం బలి యివ్వడానికి అనేక సంఖ్యల్లో గొర్రెలను, దున్నలను తెచ్చి నిలబెట్టారు. వీటిని బలి యిచ్చిన తర్వాత సకలదేవతల ప్రీత్యర్థమై హవిస్సు నిచ్చి, హోమ గుండంలో రత్న, మౌక్తిక, వజ్ర, వైఢూర్యాలను ప్రభువు అగ్నిహోత్రునికి సమర్పించాడు. పంచభూతాల తృప్తికై యథేచ్ఛమైన దానధర్మాలు, మృష్టాన్న దానసంతర్పణాలు జరిగాయి. అక్కడికి యాగసమాప్తమైనట్టయింది.

సాయంకాలం విజయమందిరంలో సార్వభౌమ కృష్ణ దేవరాయల విశేష దర్బారు.

మధ్యాహ్నంనుండే జనస్తోమం విజయమందిరపు వెలుపలి వలయానికి రాసాగారు. ఆహ్వానితు లందరు నేటిమిఎండకు ముందే విచ్చేయసాగారు. ఇప్పటి సభకు విశేషాహ్వానం మీద వచ్చిన మాండలీకులు, సంస్థానికులు, ప్రముఖ సామ్రాజ్యపు ఇతర వున్నతాధికారులు, సేనాధిపతులు గణ్యవ్యక్తులు, విద్వజ్జనులు, కళావిదులు తమకని నిర్దేశింపబడిన ఆసనాలలో కూర్చున్నారు. రాజబంధువులకు, అంతఃపురస్త్రీలకు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయబడ్డాయి.

ఉన్నతమైనప్రదేశంలో సార్వభౌముల రత్నసింహాసనం. దానిచుట్టూ భవ్యమైన అద్భుత శిలాస్తంభరాజి. ఈ స్తంభ రాజిలో చాలనైపుల గజసింహాలను చెక్కివున్నారు. ఏనుగు

తుండరంలో ముత్తెపుసరం వ్రేలాడుతున్నట్టున్న చిత్రాలు శోభస్కరంగావున్నాయి సభామందిరపు నాలుగు వేపులా నేలను మెత్తటి రత్నకంబళి మూసివేసింది. గోడలకు పట్టు గుడ్డల పల్చటి సొగసైన జాలరులు, సింహాసనానికి వెళ్ళే దారిలో రత్నకంబళ్ళమీాద మఖమల్ గుడ్డ పరచబడింది. సింహాసనపు చుట్టుపట్ల ముత్య, రత్నఖచితమైన నిమ్నాసనాలు అపూర్వరీతిలో అమర్చబడి శోభిస్తున్నాయి. ఈ రాజాస్థానం దేవలోకపు ఇంద్రునివైభవానికి సరితూగుతోంది.

నిశ్చిత వేళకు సార్వభౌములు విజయం చేశారు.

వారి ఆగమనాన్ని నిర్దేశించడానికి కోటమీాదనుంచీ ఫిరంగులు ప్రేల్చబడ్డాయి. జనస్తోమం జయధ్వానం చేసింది. వేదమంత్రాలను ఘోషిస్తూ వైదికులు, పౌరోహితులు ముందు నడుస్తున్నారు. వాళ్ళవెనుక వేత్రహస్తులు, ఛత్రచామరగ్రాహులు, వైతాళికులు, వాళ్ళ ననుసరించి రాయల బిరుదులను చదివెడి భట్టులు. ప్రభువులు వస్తుండగానే వంది మాగధులు బిరుదులను ఉచ్చైశ్శ్వరంలో ఉద్ఘోషించారు:

'స్వస్తి! శ్రీమత్సమస్త భువనాశ్రయ,
దక్షిణభారత పృథ్వీవల్లభ,
శ్రీమన్మహారాజాధి రాజ,
రాజపరమేశ్వర,
భక్త పరమభట్టారక,
సత్యాశ్రయ,
వేదవాక్యప్రమాణ సంవాదపారీణ,

ప్రత్యర్థి రాజవిఫాల,
శ్రీ విరూపాక్ష పాదపద్మారాధక,
శ్రీ వీరప్రతాప,
ఆసేతుహిమాచల భూమండలైక చ్ఛత్రాధిప,
సకల వర్ణాశ్రమాచార,
సనాతనధర్మ ప్రతిపాలక,
సకల కళానిపుణ,
ఆంధ్రభోజ,
శ్రీమద్విద్యానగర రాజధానీ రత్నసింహాసనాధీశ్వర,
కర్ణాటక రాజ్యరమారమణ.
శ్రీమన్నరస రాజేంద్రకుమార,
శ్రీకృష్ణదేవరాయ మహారాయ,
పరాక్! బహుపరాక్!!

సభాసదులు లేచినిలబడి జయఘోష చేశారు. సార్వభౌములు రత్నసింహాసనంలో ఆవిష్టులైనారు.

రాజభవనపు కోటగొమ్మలనుంచి గౌరవసూచకంగా ఫిరంగులు ప్రేల్చబడ్డాయి. ఒక ప్రక్క వీణా, వేణు, మృదంగాల మంజులరవం; మరోవంక శంఖ, భేరీ, ఝాంకార భయంకర నాదం. వీనిజతకు జనస్తోమపు జయఘోష. గిరికందరాలు ఈ ప్రచండ శబ్దానికి అదరి ఆకాశమే విచ్ఛిన్నమై పోతున్నట్టనిపిస్తోంది. ప్రధానామాత్యుడైన తిమ్మరుసు చేతిలో వున్న కఱ్ఱతో శబ్దంచేసిన వెంటనే సందడి తగ్గిపోయింది.

సదస్యు లందరు తమ తమ అంతస్థుకు తగిన ప్రణామము లర్పించారు.

సర్వాలంకారభూషితలై, స్వర్గలోకపు అప్సరసల్లా కనిపిస్తున్న నటీమణులు నృత్యం ప్రారంభించారు. పల్చటి చీనాంబరాలు ధరించి శిరోజాలను చక్కగా కట్టి, రత్న సరాలతోను - పూలతోను అలంకరించుకున్నారు. మెడలో మరకత, మాణిక్యా...స్ట్రాభరణాలు, చేతులకు రత్నకంకణాలు, నడుముకు నవరత్న...తమైన ఒడ్డాణాలతో అలంకరించుకుని వున్న వాళ్ళు సుర సుందరీమణుల్లానే కన్పిస్తారు. అందరూ ఒక్కొక్క స్వర్ణకలశాన్ని పట్టుకుని వున్నారు. వాటిల్లో స్వర్ణజ్యోతులు వెలుగుతున్నాయి. వాళ్ళు దీపోత్సవపు నృత్యాన్ని ప్రదర్శించారు.

రత్నదీప నృత్యవిన్యాసం ముగిసినతర్వాత విద్వన్మ ణులగోష్ఠి, సంగీత-సాహిత్యాల కార్య...కమాలు జరిగాయి.

వీటి ననుసరించి; ఇవి ముగుస్తూండగానే విజయమందిరపు విశాలవలయంలో ఏర్పాటుగావించబడ్డ క్రీడారంగంలో వివిధములైన ఆటపాటలు ప్రారంభమయ్యాయి.

మల్లయుద్ధంలో పారంగతులైన జగజెట్ల కుస్తీపట్లు. దీనిలో దెబ్బలుతగిలి అంగహీనులైనవా రెంతోమంది. రక్తం ధారబోసి మరణించినవా రెంతోమంది. సార్వభౌముల నుంచి బహుమతి పొందడానికి వాళ్ళు మల్లయుద్ధంలో అనేక చమత్కారాలను ప్రదర్శించారు.

దివిటీలప్రకాశమైన వెలుగులో ఒకటితర్వాత ఒకటిగా ఎన్నో మనోల్లాసప్రదర్శనలు జరిగాయి. వేషాలు వేసే వాళ్ళు, కత్తివరుస, దొమ్మరాట మొదలైన జనప్రియ ప్రదర్శనలతో సర్కసువాళ్ళు చేసే చమత్కారాలు, బాణ

సంధి ప్రయోగ ప్రదర్శనలు జరిగి, ప్రజలు రంగులపండుగలో మైమరచిపోయారు.

వినోదాలన్నీ ముగిసినతర్వాత పద్ధతిప్రకారం పట్టపు ఏనుగు, గుఱ్ఱం, ఆవు, పట్టపుఖడ్గం, ఛత్రచామరాలను పూజించడం జరిగింది.

ప్రజలు హర్ష ధ్వానాలు చేశారు. సైనికులు జయఘోషచేసి, శస్త్రాస్త్రాలను తమ ఒఱలనుంచి లాగి శబ్దంచేసి సంతోషాన్ని వ్యక్తపరిచారు. గుఱ్ఱాలు సకిలించాయి. ఏనుగులు ఘీంకరించాయి. ఫిరంగులు మ్రోగాయి. భూమ్యాకాశాలు ఒక్కటయినట్టు యీ శబ్దం దిగ్దిగంతాలవరకూ నిండిపోయింది.

కొన్ని నిమిషాల్లోనే రాజసభలో మళ్ళీ మౌనం ఆవరించింది. సార్వభౌమ శ్రీకృష్ణదేవరాయలు మాట్లాడడానికి లేచి నిలుచున్నాడు. శ్రీకృష్ణదేవరాయలు సామాన్యపు ఎత్తుగలవ్యక్తి. సుదృఢమైన శరీరసౌష్టవం. బలిష్ఠ శరీరం. ముఖంలో రాజతేజస్సు. అచ్చటచ్చట అస్పష్టమైన పోట్ల కపుమచ్చలు. విశాలమైన వదనంలో కాంతిపుంజమైన కళ్ళు. విశాలమైన ఫాలప్రదేశం. అతడు మహాపురుషుడని చెప్పక చెప్పతున్నాయి.

ప్రజలు నిశ్శబ్దంగా కూర్చున్నారు, రాయల సందేశాన్ని వినేవుద్దేశ్యంతో. కృష్ణదేవరాయలు గంభీరంగా తన ఉపన్యాసం ఉపక్రమించాడు.

"శ్రీ భగవతీ భువనేశ్వరీ కృపాపోషిత, శ్రీమద్విద్యారణ్యమునీంద్ర సంస్థాపిత, విద్యానగర రాజధాని రత్నసింహా

సనావిచ్ఛిన్న స్వామి నిష్ఠాసేవకులారా, మహాజనులారా! విజయదశమి యీ శుభదినంలో మీ అందరికి శ్రీ పంపాపతి విరూపాక్షస్వామి సకల సౌభాగ్యాలను కలుగజెయ్యాలని ప్రార్థిస్తున్నాను.

"మీరు చూపించిన రాజభక్తిని చూచి నాకు చాలా హర్షం కలిగింది. మీవంటి రాజనిష్ఠాసేవకులను పొందివున్న నేను ధన్యుడనేనని నాకు తెలుసు."

"ఇప్పుడు దేశపు నలుమూలలనుంచీ వచ్చివున్న మీ రంతా యిక్కడ ఒక మహత్కార్యసాధనకుగా చేరారు. ఇక్కడ మనం నాల్గవ మహానవమి విజయోత్సవాన్ని ఆచరిస్తున్నాము. ఈ నాలుగుసంవత్సరాల్లో మనం అనేక మహాత్కార్యాలను సాధించాము. ఉత్కళసామ్రాజ్యాన్ని జయించాము. దక్షిణాపథాన్ని గెల్చి మన స్వాధీనంలో వుంచుకున్నాము. క్రితం మన పూర్వులకాలంలో చెయ్యిజారిపోయిన అనేక ప్రదేశాలను వశపర్చుకుని సామ్రాజ్యపు సరిహద్దును విపులీకరించాము. ఇప్పుడు పంపాపతి అనుగ్రహం వల్ల కృష్ణనుంచి కన్యాకుమారివరకు విజయనగర సామ్రాజ్యాన్ని విస్తరించాము. ఉత్కళ అధిపతులను గెల్చి సామంతులనుగా చేసుకున్నాము; నిజమే. అనేక విద్రోహులను పట్టుకున్నాము; నిజమే. ఇక్కడికే మన కార్యం ముగిసినట్టు కాలేదు. మన మింకా బహమనీసుల్తానులను ఓడించలేదు. వాళ్ళ గర్వాన్ని అణచలేదు. వాళ్ళు యెప్పటిలాగునే ప్రబలిపోతున్నారు. క్రితం పూజ్య పితామహులైన శ్రీ ఇమ్మడి వీరనరసింహ భూభుజులకాలంలో మనదిగావుండి చెయ్యి

జారిపోయివున్న రాయచూరు, ముద్గల్లు. ఇవి యింకా బిజాపురపు సుల్తానుల వశంలోనే వున్నాయి. వీటిని గెల్చి సామ్రాజ్యంలో కలుపుకోవలసివుంది. చెయ్యి విడచిపోయిన ఉదయగిరిని గెల్చినట్టే. వీటిని గెల్చి సామ్రాజ్యంలో చేర్చనిదే సాళ్వనరసింహ భూపాలుల మరణశాసనం సంపూర్ణంకాదు. పూర్వుల ఆత్మకు శాంతి కలుగవలెనంటే మనం యీ పనులను చెయ్యవలసేవుంది. ఈ కార్యాలలో మీ అందరి సౌజన్యపూర్వకమైన సహాయసంపత్తులు అత్యావశ్యకం.

"బిజాపుర సుల్తానులమీద యుద్ధం ఘోషించడమంటే మాటలతో పనికాదు మీ నుంచి అనేకవిధాలైన ఆత్మత్యాగ, బలిదానాలు కావాల్సివుంది. బిజాపురసుల్తానులు స్నేహితులుగా వున్నట్లే నటిస్తూ మనమీద పడడానికి యుద్ధసన్నద్ధులౌతున్నారు. వాళ్ళ సైన్యం మన సరిహద్దు ప్రాంత్యంలోని వూళ్ళమీదపడి హత్యలు. బందిపోటులను జరిపిస్తున్నారు. అంతేకాక యిక్కడి రాజద్రోహులకు, దొంగలకు, దుష్టులకు, శిక్షార్హులకు వాళ్ళు ఆశ్రయ మిస్తున్నారు. ఇవన్నీ చూస్తూ కూర్చోవడానికి మనం చేతకానివారము కాము. శత్రువులు బలయుతులు కాకముందే మన శక్తిని వాళ్ళకు పరిచయంచెయ్యాలి. వాళ్ళ గర్వాన్ని అణచాలి. కాబట్టి ఓ కర్ణాటాంధ్ర వీరులారా లేవండి. మేలుకోండి! మనం పిరికిపందలం కాము. రత్నసింహాసనపు రక్షణకోసం గౌరవంకోసం ఆఖరిశ్వాస వున్నంతవరకు పోరాడుతాము. సామ్రాజ్యానికి జరిగిన అవమానాన్ని సహించలేము. కర్ణాటాంధ్ర వీరపుత్రులు రణభీరువులు కారు—రణధీరులు అన్న

విషయ మా మదోన్మత్త సుల్తానులకు తెలియజెయ్యాలి. ఇదే నా సందేశం. దీనిలో యశస్సును కలిగింపజెయ్యాలని పంపాపతి శ్రీ విరూపాక్షస్వామిని ప్రార్థించెదము. జై భువనేశ్వరి !"

ఈమాత్రంచెప్పి రాయలు తనసింహాసనంలో కూర్చు న్నాడు. జనులు జయఘోష చేశారు. ఒక్కనిమిషం సభలో మౌనం ఆవరించింది. మరుక్షణమే ఎక్కడినుంచో ఎవరో ఉచ్ఛకంఠంతో అన్నారు.

"ప్రభూ! మాకు యుద్ధమక్కరలేదు. మాకు శాంతి కావాలి!" అని.

సభలోనివారంతా ధ్వనివచ్చినవేపు తిరిగి చూశారు. మళ్ళీనాలుగైదు కంఠాలు ఒక్కుమ్మడి వినిపించాయి.

"ప్రభూ! యుద్ధమక్కరలేదు. మాకు శాంతికావాలి, శాంతి!"

ఆస్థానంనుంచి నిర్గమిస్తున్న సార్వభౌముని చెవిలో కూడా యీ మాట, కలకలం వినిపించింది. "ప్రభూ! మాకు యుద్ధమక్కరలేదు. శాంతికావాలి. మాకుశాంతికావాలి" అన్న మాటలు విని రాయలు ఒక్కతూరిగా చకితుడై, గంభీరంగా నిల్చున్నాడు. సార్వభౌముల సముఖంలో వారికి వ్యతిరిక్తంగా యుద్ధమక్కరలేదు, శాంతికావాలి అనగల గుండెధైర్యం ఎవరికుందని ఆశ్చర్యమైంది. రాయలు అలాగే నిలబడి సందడి జరుగుచున్నవైపు చురచురచూచి ప్రధానామాత్యుడైన తిమ్మరుసుకు ఏమిటో సంజ్ఞచేశాడు.

తిమ్మరుసు సందడి జరుగుతున్న వైపు పరుగెత్తుకు వచ్చి, సార్వభౌములకు వ్యతిరేకంగా శాంతిఘోష చేసిన వ్యక్తి ఎవరని శోధించసాగాడు. దాదాపు ముప్పయియేళ్ళు గల కాషాయవస్త్రధారియై ఒకసన్యాసి సభాస్తారులను త్రోసుకుని రాయలముందుకు రావడానికి ప్రయత్నిస్తున్నాడు. అతణ్ణి ముందుకు రానియ్యకుండా సదస్యులూ, రాయుల రక్షక భటులూ ఆపుతున్నారు. అయినా ఆజడదారి ముందుకు రావడం నిలుపలేదు.

"ప్రభూ! మాకు యుద్ధముక్కరలేదు. మాకుశాంతి కావాలి, శాంతి!" అని అరుచుకుంటూనే అతడు ముందుకు వస్తున్నాడు. అతణ్ణి చూస్తే శరీరం మీద స్పృహలేనివాడి లానే వున్నాడు. సాధ్యమైనంత త్వరగా రాయుల ముందుకు రావాలి. రాయలు సభానిష్క్రమణం చేసేటుందే తను చెప్పదలచిన సంగతులను చెప్పాలి. అనే ఉత్కంఠాకాంక్షతో ఇతడు ముందుకు త్రోసుకువస్తున్నట్టుగాతోస్తుంది. ఆతని అనుచరులు గాకన్పిస్తున్న నాలుగైదుమంది ఆతణ్ణి వెన్నంటివస్తున్నారు.

అక్కడికి తిమ్మరుసు వచ్చేవేళకు సందడి తక్కువైంది. ఆసన్యాసిని అరవనియ్యకుండా ముందుపడి, త్రోసుకుపోనియ్యకుండా రక్షకభటులు ఆపుతున్నారు వాళ్ళు అచ్చటినుంచి అతణ్ణి మరోకచోటుకు తీసుకుపోయే ప్రయత్నంలో వున్నారు. అప్పుడే తిమ్మరుసు అక్కడికిరావడం.

తిమ్మరుసును చూడగానే సైనికులు ఆసన్యాసిని అతనిఎదుట తెచ్చి నిలబెట్టారు. తిమ్మరుసు ఆసన్యాసిని ఆపాదమస్తకమూ సూక్ష్మంగా అవలోకించాడు

అతడొక విరక్తుడైన సన్యాసని చూడగానే చెప్ప వచ్చు. అతని చేతిలో దండ కమండలము, మెడలో రుద్రాక్ష మాలవుంది. ఫాలప్రదేశంలో విభూతిరేఖలు ప్రకాశిస్తు న్నాయి. తైలసంపర్కంలేని తలవెంట్రుకలు జడలు కట్టాయి. కానీ—ఆముఖంలో ఒకవిధమైన సౌమ్యకళ తొంగిచూస్తోంది. సార్వభౌమ కృష్ణదేవరాయులకు వ్యతిరిక్తంగా శాంతిఘోష నిండుసభలో వెల్లడించాలంటే అతనికి ఎంత ధైర్యముండి వుండాలి!

తిమ్మరుసు ఆలస్యంచెయ్యకుండా ఆసన్యాసిని రాయల వద్దకు తీసుకుని వెళ్ళాడు.

కృష్ణదేవరాయలు కాషాయాంబరధారియై పరమేశ్వ రునిలా తేజస్వియైన ఆసన్యాసిని విస్మయంతో చూచాడు. ఆతనిపట్ల రాయనికి గౌరవంకలిగింది. చూడడానికి సర్వసంగ పరిత్యాగిలా కన్పిస్తున్న యితడెందుకిక్కడికి వచ్చాడు? ఇతడు విజయమందిరంలో యెలా ప్రవేశించగలిగాడు? కేవల మాధ్యాత్మిక చింతనలో మునిగివుండవలసిన వ్యక్తికి యీ రాజకీయపు గొడవలెందుకు? ఇతడు ప్రచ్ఛన్న వేషధారు డేమీకాడుగదా? ఈ విధమైన ప్రశ్నలుత్పన్నములై రాయ లకు కుతూహలాన్ని కల్గించాయి.

“మిమ్మల్ని చూస్తే విరక్తులైన సన్యాసుల్లా కన్పిస్తు న్నారు. కానీ—మీరు రాజకీయంలో ఆసక్తివహించి వుండడంచూస్తే మాకు కుతూహలమౌతోంది. తమ రెవరు? తమ పేరేమిటి? తమరు వచ్చిన ఉద్దేశ మేమి? ఇవి మేము అడుగవచ్చా?” అన్నాడు వినమ్రుడై.

"అవశ్య మడుగవచ్చు ప్రభూ! నే నొక మఠమూ, మందిరమూ లేని సన్యాసిని! పేరు శాంతివాది. నాకు రాజకీయంలో ఆసక్తివుండడం చూసి తమ కాశ్చర్యమనడం సహజం. నా ఆధ్యాత్మికచింతనలో దైవసాక్షాత్కారంకంటె భవరోగాల నిర్మూలనకు యెక్కువ ప్రాముఖ్యమిచ్చింది ప్రభూ! అందువల్లే విరాగినైన నాకు మానవజీవనపు అన్ని కార్యాల లోను ఆసక్తి వుంది. రాజకీయము నా దృష్టిలో ఆధ్యాత్మిక చింతనే. దాన్నిగురించే నేను యిక్కడికి రావలసివచ్చింది."

"విరాగులైన మీకు మానవజీవనపు అన్నికార్యాల లోను ఆసక్తి వుందా? అలా ఐతే మీ ఆశయ మేమిటి?"

"మానవ వ్యక్తిత్వపు వికాసానికిగా శ్రమించడమే నా జీవితపు ముఖ్యోద్దేశం.................. అతని స్వభావంలో అసహజంగా మిశ్రితమైన స్వార్థ, ద్వేషాసూయా సహిష్ణతే త్యాది దుర్గుణాలను నిర్మూలనం చేసి, అతని మూలస్వభావ మైన శాంతి, సహన, సౌశీల్య, తృప్తి, నిర్మలాంతఃకరణే త్యాది సద్గుణాలు జనించి వికాస మొందేలా చెయ్యడం. అంటే సుఖ, సంతృప్తులతో కూడిన ఆదర్శ ధర్మరాజ్య సంస్థాపనకుగా చేతనైనంతవరకు శ్రమించడమే నా జీవనపు పరమోద్దేశం. ఈ జనతా సేవలోనే నా యిహపరాలముక్తి దైవసాక్షాత్కార మిమిడివున్నాయని నా నమ్మిక. 'మానవ సేవయే మాధవసేవ' అను నానుడి తమకు తెలియనిది కాదు. అందువల్లే ప్రజాప్రతినిధిగా ప్రభువుల సందేశాన్ని విని కృతార్థుణవడాని కిక్కడికి వచ్చాను. కానీ—ప్రభువుల సందేశం నాకు నిరాశను కలిగించింది."

"ఎందువల్ల ?"

"సార్వభౌములకన్నైనా యుద్ధాన్ని చాలించి జనగణ శాంతి, సౌఖ్యాల సందేశాన్ని వినిపిస్తారని భావించాను. కానీ, యిప్పుడు వినవచ్చేనది శాంతిసందేశంకాదు. యుద్ధ ఘోషణ."

"ఔను. మా కిప్పుడు కావలసినది యుద్ధం. అఖండ దిగ్విజయం!"

"దిగ్విజయం! అఖండ దిగ్విజయం! ఎవరిమీద యుద్ధం? ఎవరిమీద అఖండ దిగ్విజయం?" అని వికటంగా నవ్వుతూ ఆ సన్యాసి అన్నాడు.

"సార్వభౌములు నానుంచి అపరాధ మేదైనా జరిగి వుంటే క్షమించాలి. నా మాటలు అర్థశూన్యంగా తోచ వచ్చు. కానీ—శాంతమనస్కంగా ఆలించాలి. యుద్ధం...? యుద్ధంకోసం ప్రభువులు ఆత్రుతపడుతున్నారు. వ్యక్తికానీ, రాష్ట్రమేకానీ జీవించడానికి మార్గం యుద్ధం కాదు ప్రభూ! ద్వేషాసూయలు వినాశపు దారులు. శాంతిస్నేహాలే నిజ మైన జీవన మార్గాలు. యుద్ధంనుంచీ వైరి నిర్మూల మవు తుంది. నిజమే. కానీ, వైరత్వం నిర్మూలమవడంలేదు. యుద్ధంవల్ల సంభవించే హానియెంత? ఎంతమంది ప్రజల బలి దానం? తమ మిత్ర బాంధవులను పోగొట్టుకున్న జనుల ఆర్తనాదాలెన్ని? ప్రజల రక్తంనుంచి సాధించే జయం దిగ్వి జయమా? హింసతో ప్రతిహింస. ఒక యుద్ధం మరొక యుద్ధా నికి దారి. ప్రభువులు ప్రజాహిత రక్షణావైపు దృష్టిని పోనిచ్చి

ఇకనైనా యుద్ధంచాలించమని మనవి. ఇదే ప్రజల ఆశ. ఆశాంతీ,గూడాను'' అని ఆగిపోయాడు.

సన్యాసి మాటలు విని కృష్ణదేవరాయలకు ఒకవిధమైన అసమ్మతి కలిగింది. తను బిజాపురసుల్తాను మీాద యుద్ధసన్నద్ధుడై, సామ్రాజ్యపు నలుమూలలనుంచి సైన్యసంగ్రహం చేసి, విజయయాత్ర దివ్యసందేశాన్ని రాజ్యప్రజలకు విప్పించగా, దీన్ని చేరిన ఆస్థానికులందరూ జయకారాలతో సమ్మతించినపుడు మధ్యన యీా సన్యాసివచ్చి, శాంతి సందేశమిస్తున్నాడుకదా అని చింతించాడు. సన్యాసిచెప్పిన మాటలు సత్యములే అయినా, ప్రస్తుత పరిస్థితిలో తిరస్కరణీయమైనవనే రాయల అభిమతం. బహమనీ సుల్తానులు ప్రబలి తమ సామ్రాజ్యానికి సదాశత్రుభీతిని కలిగిస్తుండగా శాంతిరోజులైనా ఎక్కడివి? అంతేకాక సామ్రాజ్యానికి చేరివ్వుంది. యిప్పుడు చెయ్యివిడిచిపోయిన రాయచూరు, ముద్గల్లులను గెల్చి స్వాధీనపరచుకోకపోతే తమ ప్రతిష్ఠ యేంగాను? తమ సామ్రాజ్యానికి వ్యతిరిక్తంగా అనేక విద్రోహాలు చర్యలలో భాగంవహించి, హత్యలను దోపిడీలను చేయించి, యిబ్బందులు కలుగజేస్తున్న సుల్తానుల గర్వాన్ని అణచకపోతే వాళ్ళుసమయం చూసి, సామ్రాజ్యాన్ని ఆపోశన పట్టకుండావుంటారా? శత్రువులు ప్రబలిపోవడానికి ముందే వాళ్ళను పదాక్రాంతులనుగా చేసుకోవడమే యుక్తమైనరాజనీతి. ఇలాంటి సమయంలో ఈ సామాన్య బైరాగి యుద్ధంనుంచి మనస్సును విముఖత పరచడానికి బోధిస్తున్నాడుకదా! ఇది ఒకవిధంగా రాజద్రోహమే. శిక్షార్హమైన అపరాధమే.

ఇతణ్ణి నిదానంగా విచారించాలి. ఇది కేవలం అతని ఒక్కడి అభిప్రాయమో, ప్రజాభిప్రాయమో ఏదైనదీ విచారించి శిక్షించాలి. అంతవరకూ ఇతణ్ని బంధనలో వుంచాలి. అని అనుకుని రాయలు తిమ్మరుసుకు ఆవిధంగా ఆజ్ఞాపించి, రాజ సభలోనుంచి వెళ్ళిపోయాడు.

రాజాజ్ఞ ప్రకారం ఆసన్యాసిని అతని అనుచరులుగా నున్న మరి నలుగురినీ చెఱసాలలో బంధించడమైనది.

ఆ సభలో జరిగిన ఆకస్మిక సంఘటనను గురించే చర్చించుకుంటూ —మౌనంగా— సదస్యులందరూ యిళ్ళకు వెళ్ళిపోయారు. కృష్ణదేవరాయల విజయదశమి సందేశం వాళ్ళలో యెవరికీ సంతోషాన్ని కల్గించలేదనడానికి వాళ్ళ ముఖాలమీదున్న నిరుత్సాహపు ఛాయలేచాలు!

## 2

కృష్ణదేవరాయలు రాత్రంతా భువనవిజయపు టంతఃపురంలో హంసతూలికాతల్పంమీద నిద్రలేకుండా అటు యిటు పొర్లుతూనే వున్నాడు. సయ్యాగృహ దాసి వేకువ ఝామున వీణమీద 'ఉదయరాగం' పాడి మేల్కొల్పి నపుడే రాయలకు ప్రాతఃకాలమైనదని తెలియడం. రాయలు నిద్రలేని కళ్ళను వాతాయనంవైపు త్రిప్పాడు. వాతాయనపు తెర ప్రక్కకుతొలగి, దానిమూలంగా ఉషఃకాంతి శయ్యాగారంలో తరంగాలు తరంగాలుగా పడనారంభించింది.

రాయలు ఆవులిస్తూ ఒక్కతూరి మెటికెలు విరుచుకుని ఉషః ప్రభను చూస్తూపడుకున్నాడు. వాతాయనపు మూలకంగా అంతఃపురపు వెనుభాగంలోని ఉద్యానవనం కన్పిస్తోంది. అక్కడి పచ్చటి తరులతలూ, చల్లటి ఉషోవాయువుకు తల లాడిస్తున్నాయి. కొలను మీదినుంచి వస్తున్న చల్లటి గాలి ఆహ్లాదకరంగా వుంది. విశాలవిశ్వంలోని ప్రాణికోటికి కే ఉషోదయమైంది. పక్షులు బిలబిల రావాలు మధురంగా వున్నాయి. అక్కడ చంద్రశాలలో వీణాగాయని చేతులో పలుకుతున్న వీణ యొక్క ఉదయరాగపు నాద మాధుర్యం అస్వస్థతాచిత్తుడైన రాయలకు యెంతో ఆనందాన్ని కలిగించింది. రాయలు అలాగే దృష్టిని మరోవేపుకు పోనిచ్చాడు.

రాయల దృష్టిసి గోడలమీదున్న అనేక వర్ణచిత్రాలు చెలపట్టాయి. వాటిలో ఒకటి రాధాకృష్ణుల ప్రణయ చిత్రం. మరొకటి పరమేశ్వరుని వశపఱ్చుకోడానికి నృత్యంచేస్తున్న పార్వతీచిత్రం, మరొకన్నైపున విశ్వామిత్రుని తపస్సును భంగం చెయ్యడానికి వచ్చిన మేనక చిత్రం. గోడలమీద పురాణపురుషుల చిత్రాలను అద్భుతవిధానంలో రూపుదాల్చి వచ్చినట్టుగా కనిపించేలా చిత్రించారు. భిత్తికమీద వర్ణ శిల్పాలు చెక్కిన అనేక కళాపూర్ణ చిత్రాలు ప్రకాశిస్తు న్నాయి. ఇప్పుడు రాయలకళ్లు వీటిని చూస్తున్నా మనస్సు మాత్రం వ్యాకులంగానేవుంది. రాయలను రాత్రంతా వేధించిన ఆచింత ఏమిటి?

అప్పటి రాజసభలో జరిగిన ఆకస్మిక ఘటన రాయల [illegible] నేత్రాలముందు మళ్ళీ మళ్ళీ కనిపించి అతని సము[illegible]

త్సాహాన్ని చల్లబరచసాగింది. ఒక సామాన్యసన్యాసి చెప్పిన మాటలు రాత్రంతా నిద్రకు అవకాశమివ్వకుండా వేధించా యంటే అవి రాయలమనస్సుమీాద ఎంతటి పరిణామాన్ని కలిగించి వుండాలి?

సన్యాసి నిండుసభలో సార్వభౌముల సందేశాన్ని ఆయన ఎదుటనే తిరస్కరించాడు! అతడు ప్రాణంమీాద ఆశ లేకుండా వచ్చివుండాలి! ఈలాంటి విరోధాన్ని వ్యక్తపరచ డానికతని కెంత ధైర్యం? అథవా అతడొక మతి విహీను డైన పిచ్చివాడో, మూర్ఖుడో అయివుండాలి! ... ... లేకపోతే సార్వభౌముల సందేశాన్ని ధిక్కరించే గుండెధైర్యం ఎక్కడిది?

కానీ-అతడొక విరక్త సన్యాసి. దేనిని సత్యమని తల చాడో దానిని ప్రభువుల ఎదుట వెల్లడించడానికి వచ్చాడు. తను దేనిని జనులయొక్క ఆశ-ఆకాంక్ష అని అనుకున్నాడో దానిని ప్రతిధ్వనింపజెయ్యడానికి వచ్చాడు. "మాకు యుద్ధ మక్కరలేదు, శాంతి కావాలి-శాంతి. యుద్ధంనుంచీ వైరి నిర్మాణమౌతుంది. కానీ వైరత్వం నిర్మూలమవడంలేదు. హింసవల్ల ప్రతిహింస జనిస్తుందేకాని స్నేహసౌహార్ధతలు జనించడంలేదు. అందువల్ల జీవనమార్గం శాంతేకాని యుద్ధం కాదు"అని నిర్భయంగా ప్రాణాలమీాద ఆశవదలి ఆ సన్యాసి రాయల సముఖంలో వివరించాడు. ఇది కేవలం అనామకు డైన సన్యాసిమాట కాకుండా ప్రజాకాంక్షనేఅయి వాళ్ళకు యుద్ధ మక్కరలేకుండా వుంటే? ... ...

రాయలు క్షణకాల మాలోచించడానికికూడా భయ పడ్డారు. ప్రజల ఆశ–ఆకాంక్ష లేమిటని రాయల కిదివరకు తెలిసి వుండలేదు. మంత్రి పరిషత్తులో కొందరు శాంతి ప్రియులుగా వున్నా, చాలామంది రాయలు బిజాపురంమీద దండెత్తి వెళ్లేవిషయంలో ఉత్సాహవంతులుగానే వున్నారు. కానీ—ఈ సమరోత్సాహానికీ క్రిందటి సమరోత్సాహానికీ చాలా భేదముంది. క్రితం రాయల ప్రధానామాత్యుడైన తిమ్మరుసు రాయలకు కుడిభుజంలానిల్చి, యుద్ధంచేసి దిగ్విజయాలను సంపాదించిపెట్టాడు. కానీ–ఈతూరి తిమ్మరుసుకు మునుపటి ఉత్సాహమున్నట్టుగా కనిపించలేదు. ఈ విషయం గ్రహించే రాయలతని అభిప్రాయ మడుగటానికి వెళ్ళలేదు.

ఇక సమరోత్సాహానికి ప్రోత్సాహమిస్తున్న వాళ్ళెవరంటే, రాయసం కొండమరసయ్య. ఇతడూ తిమ్మరుసులా రాయల సైన్యంలో మహాదండనాయకుడు. అతడు వృద్ధాప్యంలోవున్నా అతనికియుద్ధపు ఉత్సాహం–ఉద్వేగం యింకా ఆరిపోలేదు. అతని ప్రబోధన, సహాయసంపత్తులనుంచే ఈసారి రాయలు దండయాత్రను సిద్ధపరిచాడు. దీన్ని కార్యరూపంలోకి తీసుకురావాలనే సామ్రాజ్యపు అన్నివైపులనుంచీ సైన్య సంగ్రహణం చేశాడు. మహానవమిరోజే బిజాపురసుల్తాను మీద యుద్ధఘోష జరిగింది. తన చిర కాలపుటాశ ఈడేరినదని కొండమరుసుకు సంతోషం. అలాంటి సంతోషమే శాంతిఘోషణ వినిపించేవరకూ రాయలుకూ వుంది. కానీ... ...?

ఈ సన్యాసి విద్రోహకారులు విడిచిపెట్టిన భూతంలా వేధించాడు. అతడు రాయల సమరోత్సాహాలన్నిటికీ కన్నీరు కార్చి శాంతివాదన చేశాడు.

రాయలు రాత్రంతా మథనపడ్డా ఇంకా ఏదీ నిర్ణయం కాలేదు.

యుద్ధప్రకష్ట మెంతటిదో రాయలూ ఎరిగినవాడే. యుద్ధమంటే శతసహస్ర సంఖ్యలో సామ్రాజ్యపు వీరపుత్రుల బలిదానం! చిరకాలంనుంచి సంగ్రహించి పెట్టిన బొక్కసపు ధనవ్యయం! ఎంతో మానసికాయాతన! దైహికశ్రమ. యుద్ధంలో జయంకల్గితే ఈ కష్టా లన్నిటికీ ప్రతిఫలం దొరికి నట్టు. ఒకవేళ అపజయం కల్గితే! ఎంతఅనర్థం! సార్వభౌములు చేసిన ఒక అవిచార కృత్యంవల్ల సామ్రాజ్యప్రజలు యావన్మందీ హత్యలు, బందిపోటులతో బాధపడేలా అయితే! ఒకదానిమీద ఒకటిగా యుద్ధాలుచేసి చాలినంత యుద్ధపురుచి వున్న సైనికులకుగాని, ప్రజలకుగానీ, యుద్ధం ఒకప్రియమైన కార్యం కాదు! ఇంతటి మనోభ్రువన తన సైన్యంలో, ప్రభవించివుంటే తన యుద్ధఘోషణ వాళ్ళకు అప్రియ వార్తయే సరి! ప్రజలకిప్పుడు కావలసినది యేమిటి? యుద్ధమా? శాంతా? రాయలుఏదీ నిర్ణయించలేకపోయాడు.

కానీ—రాయలప్పుడేదైనా ఒకటి తప్పక నిర్ణయించ వలసివచ్చింది.

బిజాపురసుల్తాను సంధిమాటలు చెబుతూనే గడచిన నాలుగైదు సంవత్సరాలనుంచి, విజయనగరపు సార్వభౌము [illegible] పరోక్షంగా విద్రోహపు చర్యలకు పోషదమిస్తున్నాడు.

ఆతడుకావాలనే సరిహద్దు ప్రాంత్యపుపల్లెలమీదఊళ్లమీద తన సైనికులను పంపి హత్యలను, దోపిడీలను చేయించి రాయలు తానుగానే సంధిసి విరమించడానికి ప్రేరేపిస్తున్నాడు. సమర సన్నద్ధుడై విజయనగరంనుంచి మోసంచేసి తప్పించుకున్న వారికీ, హత్యలు, బందిపోటులు చేసివచ్చినవారికీ సుల్తాను తన రాజ్యంలో ఆశ్రయమిచ్చి రాయలు తానుగానే యుద్ధం ఘోషించాలని వాంఛిస్తున్నాడు. శత్రువు యిలా ప్రబలుడై కూర్చునివుండగా ఆతణ్ని నిర్లక్ష్యిస్తే సామ్రాజ్యానికి దీని నుంచి ఎప్పటికైనా హాని సంభవిస్తుంది. అందువల్ల దుర్బలుడుగా వున్నప్పుడే అతణ్ని అణగద్రొక్కి శత్రునిర్మూలం చెయ్యాలి. పరిస్థితులలా వున్నప్పుడు యుద్ధం అనివార్యమే...

మరొక దృష్టిలోకూడా యుద్ధం అనివార్యమే. చాలా రోజులనుంచీ రాయచూరు, ముద్గల్లులు విజయనగరానికి చెందినవే. ఇవి ఇమ్మడి నరసభూపాలుని కాలంలో అతని చెయ్యి విడచిపోయినవి. ఇదివరకు సుల్తాను వశంలోనే వున్నాయి. వీటిని ఎలాగైనా మళ్ళీ సామ్రాజ్యానికి చేర్చుకో వలసివుంది. బిజాపురపు సుల్తానుమీద దండెత్తివెళ్ళనిదే ఈ దుర్గాలు సామ్రాజ్యానికి చేరడం అసంభవం. అందును గురించే యుద్ధం అనివార్యమైంది. ఈ దృష్ట్యానైనా తను బిజాపురంమీద దండెత్తివెళ్ళి, సుల్తాను గర్వమణచాలని అనుకున్న రాయలుకు నూతనోత్సాహం వచ్చినట్టయి పాన్పు మీదనుంచి ఛెంగునలేచి కూర్చున్నాడు. ఎవరేమి చెప్పినా, ప్రజ విరోధించినా యుద్ధమేమో నిశ్చయం. ఎటువంటి

మొచ్చినా—నా సంకల్పాన్ని విడువనని రాయలు దృఢ నిర్ణయం చేసుకున్నాడు.

మనస్సులోని దృఢనిర్ణయాన్ని ప్రతిబింబింపజేసేలా రాయలవదనం గంభీరమైనది. ముఖంలో కప్పివున్న గ్లానతా ముసుగు తొలగిపోయింది. హృదయభారం తగ్గిపోయింది. రాయలు తన నిత్య వ్యాయామాన్ని తలచుకుని వ్యాయామ శాలకు వెళ్ళాడు.

సర్వసామాన్యంగా రాయలు ఉషోవేళకే లేచి, ప్రాత స్నానాదులను ముగించుకుని వ్యాయామశాలకు వెళ్ళుతుండేవాడు. రాజధానినుండి మకాం మార్చినసమయాలలో తప్ప తదితర సమయాలలో వాతావరణం యెంతటిదైనాకాని, ఎంతటి ప్రసంగాలైనా వుండనీ—రాయలు వ్యాయామాన్ని తప్పించడంలేదు. అది రాయల జీవితంలో సహజంగా కలసివచ్చిన అభ్యాసమైనది.

రాయలు కడచిన ఇరవై సంవత్సరాలనుంచి వ్యాయామాన్ని తప్పకుండా చేస్తూవస్తున్నాడు. కాబట్టే రాయలది వజ్రశరీరం. ఆ శరీరంలో పది ఏనుగుల బలముందని రాయల అంగసాధనా వైఖరిని చూచినవాళ్ళు అంటూండేవారు. దీనిలో కాస్త అతిశయోక్తి వున్నా రాయలకు చాలా శక్తి వున్నదన్నది అబద్ధంకాదు. అతడు జగజట్లను నిమిషకాలంలో నేలకు దొర్లించడం, వస్తాదులను కుస్తీలో పడగొట్టడమే వీటికి నిదర్శనం.

వ్యాయామశాలలో, సూర్యనమస్కారంతో ప్రారంభమయ్యే అంగసాధన క్రమంగా కర్రసాము, ఇనుపగుండ్లను

గాలిలో త్రిప్పడం, మల్లయుద్ధం, గుఱ్ఱపుస్వారీలో ముగుస్తుండేది.

రాయలు కత్తిపట్టుకుని నిలిస్తే శత్రువుల మారణ హోమమే జరుగుతుండేది. కత్తిని త్రిప్పడంలో రాయల హస్తకౌశలపు నిదర్శన లనేకంవున్నాయి. ఒకమారు—రాయలు వెంట్రుక కోసను కత్తివిసరి ఛేదించాడు! మరొక తూరి పైనపడడానికి వచ్చిన శత్రువు తలను ఖండించాడు. ఖండించిన తల మొదటిలా మొండెంమీదనే వుంది. అతను మునుపటి మనిషిలానే కనిపిస్తూవున్నా అతనిలోని ప్రాణపక్షి మాత్రం పారిపోయింది. రాయలు ఖడ్గాన్ని త్రిప్పుతుండగా యెన్ని రాళ్ళను విసరినా అతనికి తగులకుండా అన్నీ నేలకు పడుతుండేవి. రాయల ఖడ్గవిద్యానైపుణ్యాన్ని చూచి శత్రువులే నిశ్చేష్టులయ్యేవారంటే యిక తక్కినవారి మాటేమిటి?

కత్తివరస అయినతర్వాత నలుగురు బలశాలులు ఎత్తలేని యినుపగదను యెత్తి గాలిలో త్రిప్పడం.

రాయలు నిరాయాసంగా గదను పైకెత్తి గాలిలో త్రిప్పుతూండేవాడు.

మల్లయుద్ధంలో రాయలను మించిన వాళ్ళు యెక్కువ మంది లేరు. రాయలు మదగజమల్లునివద్ద ముష్టియుద్ధ, మల్ల యుద్ధాలను శాస్త్రోక్తంగా అభ్యసించాడు. ఎంతటి భీమబలుడైనాసరే, రాయలతో మల్లయుద్ధం చెయ్యడానికి అతనికి తగిన ధైర్యముండాలి!

గుఱ్ఱపుస్వారిలోకూడా రాయలదే వైశిష్ట్యం. శరీరాని కంతా ఆముదం లేపనంచేసుకుని జీనుపట్టుకుని గుఱ్ఱంమీద

కూర్చున్నాడంటే, అది ఆయాసంతో బడలి నోటిలో నుర గలు వచ్చేవరకూ తను పూసుకున్న తైలం ఆరిపోయేవరకూ గుఱ్ఱపుస్వారి అవ్యాహతంగా సాగిపోయేది. దీనిని చూసిన వాళ్ళు రాయలను అశ్వవిద్యలో నలచక్రవర్తితో పోల్చు తూండేవారు.

రాయలకు మొదటినుంచి ఉత్తమాశ్వాలను తీసుకొచ్చి తన సైన్యంలో వుంచుకోవాలనే ఆశ ఎక్కువగా వుంటూ వుండేది. మహమ్మదీయులకు వచ్చిన అశ్వపతులనే బిరుదును తను పొందాలని ధనవ్యయ మవడాన్నికూడా లెక్కించక దేశదేశాలనుంచి గుఱ్ఱాలను కొని తెచ్చేవాడు. ఈ గుఱ్ఱపు వ్యాపారనిమిత్తంగా విదేశీయులైన పోర్చుగీసులకు వ్యాపారానికి సర్వానుకూలతలు కల్పించాడు. వాళ్ళ రేవుపట్టణమైన గోవాలో అశ్వశాస్త్రాన్ని కూలంకషంగా ఎరిగిన సిద్ధమర్కార్ అనునతణ్ణి నియమించాడు. అతనివద్ద వేనవేలు వరహాలిచ్చి విదేశాలనుంచివచ్చిన ఉత్తమాశ్వాల నన్నిటినీ క్రయానికి తీసుకోమని ఆజ్ఞాపించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే రాయలకు ఉత్తమాశ్వాలపట్ల ఒకవిధమైన పిచ్చి పట్టుకుందన్నా సరిపోతుంది.

గుఱ్ఱపుస్వారి అయిన తర్వాత బడలిక చెందిన శరీరానికి మదగజమల్లుడు మాలీసు చేసేవాడు. అనంతరం స్నానంచేసి శుచిర్భూతుడై ఉపోపూజముగించుకుని లఘు ఫలహారస్వీకారంచేసి, ఆతర్వాత రాజకీయాలకు మనస్సునిస్తూండేవాడు రాయలు.

ఇది రాయల దినచర్య గ్రంథంలో ఒకటోపుట.

ఇప్పుడు రాయలు వ్యాయామంలో ఎక్కువభాగం వహించకుండా కత్తివరుస, గుఱ్ఱపు స్వారీలతోనే ముగించాడు. స్నానం, పూజ, ఫలహారస్వీకారాలను ముగించుకుని రాజకీయాలమీదికి దృష్టిని పోనిచ్చే సమయానికి ప్రతీహారి ఒకడు కనిపించాడు. అతడు సార్వభౌముని ఘనతకు తగినట్టు అంగరఖా ధరించి, బంగారంతో చిత్రితమైన శంఖు, చక్రములుగల ఉష్ణీషాన్ని పెట్టుకుని, ఖడ్గాన్ని వరలో యిముడ్చుకొని వున్నాడు.

ప్రభువులవద్దకు వచ్చిన ప్రతీహారి రాయలకు నమస్కరించి వినమ్రుడై నిల్చున్నాడు.

రాయలు కళ్ళెత్తిచూచి "ఏమిటి సమాచారం?" అని ప్రతీహారిని ప్రశ్నించాడు.

"ప్రధానామాత్యులు ప్రభువులను చూడడానికి వచ్చి వున్నారు."

"ఎక్కడున్నారు?"

"చంద్రశాలలో నిలబడి తమ ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్నారు."

"రమ్మని చెప్పు."

ప్రతీహారి కనుమరుగైన కొంతసేపటిలోనే తిమ్మరుసు ప్రభువుల సముఖానికివచ్చి నిలబడి నమస్కరించాడు.

"ఓం!... అప్పాజీగారు! ఇదేమిటి ప్రాతఃకాలంలోనే అపురూపంగా దయచేశారు?"

"అవును ప్రభూ! ప్రాతఃకాలంలోనే రావలసి వచ్చి వచ్చాను."

"ఏమిటీ అంతటి మహత్తర విషయం?"

"మహత్తర విషయమేమీ లేదు ప్రభూ! అయినా ఈ విస్మయకరమైన సంగతిని తమకు తెలియ జెయ్యడానికి వచ్చాను."

"ఏమిటంతటి విస్మయకర విషయం?"

"ప్రభువులు కోపగించుకో కూడదు. నిన్నటి రాజసభలో శాంతికావాలని ఘోషించిన ఆసన్యాసిని నేను చెరసాలలో వెయ్యమని ఆజ్ఞాపించాను. ఇప్పుడతణ్ణి విచారణకు గురిచెయ్య వలసివుంది. కానీ—ముందే అతడు చెరసాలలోంచి తప్పించుకుని వెళ్ళిపోయాడు. ఎలా తప్పించుకున్నాడన్నది ఎవరికీ తెలియనివిషయం. అతనిమిత్రులుగా కనిపించిన ఆనలుగురైదుగురికికూడా ఆ సన్యాసి ఎప్పుడు తప్పించుకున్నాడన్నది తెలియదు! వాళ్ళందరూ నిద్రిస్తుండగా అతడు ఒక్కతూరిగా అదృశ్యుడయ్యాడు! అతడు హఠయోగి. అతడు తప్పించుకుని వుండడాన్ని చూస్తే ఇదీ ఒక అద్భుతంలా తోస్తోంది. వెళ్ళిపోతూ అతడొకలేఖను విడచివెళ్ళాడు. ప్రభువులు పరిశీలించాలి." అని పత్రాన్ని తీసి రాయల చేతికిచ్చాడు.

రాయలు అంతావిని ఆశ్చర్యపోయాడు. పత్రంలో ఏ గొప్ప విషయాలు దాగి వున్నాయోనని తెలుసుకోవడానికి ఆత్రుతతో చదువ ప్రారంభించాడు.

"స్వస్తిశ్రీ మన్మహారాజాధిరాజ శ్రీకృష్ణదేవరాయల దివ్యసన్నిధికి సన్యాసి ప్రణామములు.

ప్రభువులు తెలిసో—తెలియకనో మహానవమి శుభ దినంలో ప్రజకు అభయ సందేశమివ్వడానికి మారు యుద్ధ సందేశ మిచ్చారు. కానీ, ప్రజల కిప్పుడు కావలసినది యుద్ధం కాదు శాంతి.

గడచిన పది సంవత్సరాలనుంచీ జరిగిన అఖండ విజయ యాత్రవల్ల సైనికులకూ, సామంతులకూ, అందరి కంటే ఎక్కువగా దేశప్రజలకూ విసుగు కల్గింది. యుద్ధంకోసం రాయలవారి బొక్కసంకూడా ఖాళీ అయిపోయినది. దీనిని నింపడానికి బీదలను పీడించటం ఏలానూజరిగేవుంది. ఇలా వుండగా ప్రభువులింకా యుద్ధోత్సాహంలో వుండడం చూసి దేశప్రజలు తల్లడిల్లిపోతున్నారు. ప్రభువులు ప్రజల ఆశ—ఆకాంక్షలను మనస్సుకు తెచ్చుకుని భయపీడితులైన ప్రజలకు అభయ సందేశమిస్తారని నమ్ముతున్నాను.

బహమనీ సుల్తానులతో గౌరవపూర్ణమైన ఒడంబడిక చేసుకుని, హిందూ ముస్లిం సఖ్యాన్ని సాధించి, భరతఖండా నికి ఆదర్శప్రభువులుగా వెలగాలని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
విరక్త సన్యాసి."

ఈ పత్రాన్ని చదువుకుని రాయలుగంభీరంగా కూర్చు న్నారు. తిమ్మరుసుకు ప్రభువులు పత్రపు విషయాలను దీర్ఘంగా మననం చేస్తున్నా రనిపించింది. రాయలు ప్రశ్నార్థకంగా తిమ్మరుసు వైపుచూశాడు.

"ఔను ప్రభూ! ఆసన్యాసి వ్రాసినదాన్లో సత్యాంశా లున్నాయి" అని మెల్లగా అన్నాడు.

"అప్పాజీ! మీరూ అలా అంటున్నారా!" అని రాయలు ప్రశ్నించాడు.

ఈ మాటకు మరేమీ చెప్పలేక తిమ్మరుసు అర్థంలేని నవ్వు నవ్వి, ఊరకనే నిల్చున్నాడు.

# 3

కృష్ణదేవరాయల తండ్రి శ్రీమన్నరస రాజేంద్ర భూపాలుడు మరణించి నప్పుడు కృష్ణదేవరాయల కింకా పసి వయస్సు. అందువల్లే పెద్దవాడైన వీరనరసింహుడు పట్టానికి వచ్చాడు. నరసరాజేంద్రునికి తన యనంతరం వీరనరసింహుడు సింహాసనానికి వస్తే సామ్రాజ్యం నాశనం కావచ్చునన్న భీతి వుండేది. తన దుర్గుణాలతో తండ్రి నమ్మిక, విశ్వాసాలను వీరనరసింహుడు ఎప్పుడో పోగొట్టుకున్నాడు.

వీరనరసింహుడు బాల్యం నుంచీ విలాసి, భోగలాలసుడు. రాజ్యకార్యాలను యశోవంతంగా జరిపించడానికి అసమర్థుడు. అతని కాలమంతా విషయసుఖాలలో గడచిపోయింది. ఇదంతా గమనిస్తూ వచ్చిన నరసభూపాలునికి వీరనరసింహునిమీద అంతగా ప్రేమలేకపోయింది. తన యితర కుమారులైన అచ్యుత, రంగరాజుల మీది ప్రేమకంటే నాగలాదేవి గర్భంలో జనించిన కృష్ణదేవరాయల మీద

మొదటినుంచీ అతిశయమైన ప్రేమవుండేది. బాల్యంనుంచీ తన ధైర్య, సాహస, పరాక్రమాలతో, రాజకీయమందలి ఆశక్తి, ఉదారాంతఃకరణాలతో రాయలు తండ్రికి అభిమాన పాత్రుడయ్యాడు. తన యనంతరం ఆతడే ఆ సింహాసనానికి రావాలని నరసరాజేంద్రుని ఆశ. కానీ—అందరికంటే పెద్దవాడైనవీరనరసింహుడు బ్రతికివుండగా కృష్ణదేవరాయలు సింహాసనానికి రావడం దుర్లభమైంది. అయినా నరసరాజేంద్రుడు మరణించడానికి ముందు ఒక అగ్నిపరీక్షను పెట్టి అనంతరం మరణించాడు. దీనిలో నెగ్గిన వారిని సింహాసనానికి తీసుకురావాలని తిమ్మరుసామాత్యుల వద్ద మాట తీసుకుని ప్రాణాలను విడిచాడు.

నరసరాజుపెట్టిన అగ్నిపరీక్ష మేమిటంటే ఆయన మరణించడానికి ముందు వేసుకునివున్న రాజముద్రికను కత్తిరించకుండా వ్రేలినుంచి వెలుపలికి తియ్యడం. ఉంగరపుటాకారం చాలా చిన్నదిగావుంది. దానిని వ్రేలినుంచి తియ్యడం చాలదుస్తరంగావుంది. ఈపరీక్షలో వీరనరసింహ, అచ్యుత, రంగరాజు లందరూ ఓడిపోయారు. చనిపోయి కట్టెలా బిగుసుకుపోయివున్న నరసరాజేంద్రుని చేతివ్రేలినుంచి ఉంగరాన్ని తియ్యడానికి వాళ్ళెవరూ సమర్థులు కాలేకపోయారు. తైల రస లేపనాదులతో వూడదీయడానికి ప్రయత్నించి వాళ్ళంతా విఫలులయ్యారు. ఇకిప్పుడు కృష్ణదేవరాయలవంతు. రాయలు తండ్రి శవంవద్ద నిల్చుని ఒక క్షణం ఆయన ముఖాన్ని చూశాడు. అనంతరం ఒరలోని ఖడ్గాన్ని లాగి ఉంగరమున్న వ్రేలును ఖండించి ఉంగరాన్ని

వ్రాడదీసి మంత్రి తిమ్మరుసుచేతి కిచ్చాడు. అతని ధైర్య సాహసాలను చూచిన మంత్రి పరిషత్తునకు, సదస్యులకు అతడు ఆదర్శప్రభువుగా కన్పించాడు. ఈ ముద్రికాపరీక్షలో కృష్ణ దేవరాయలు ఉత్తీర్ణుడైనా అతనికి సింహాసనం దొరకలేదు. పెద్దవాడైన వీరనరసింహుడు బలప్రయోగంతో సింహాసన మధిష్ఠించాడు.

వీరనరసింహునిపరిపాలన కేవలం కొన్ని రోజులుమాత్రంజరిగింది. ఈఅల్పకాలంలో పరిపాలనలో నేదక్షతతప్పి, సామంతులు మాండలీకులుదండెత్తితాముస్వతంత్రులని ఘోషించారు. శత్రువులు ప్రబలులయ్యారు. ఎక్కడచూచినా అరాచకత బహుళు చేరింది. ఇంతైనా వీరనరసింహుడు విషయవాంఛలకు తిలాంజలి నివ్వలేదు. చివరికతనికువ్యసనాలే అగ్నికి బలిగొన్నాయి. అతడు త్వరలోనే మంచంపట్టి పడుకున్నాడు. పడుకున్న వాడు మళ్ళీ లేవనేలేదు. మృత్యువు సమీపిస్తోందని తెలిసి రాగానే అతనికి తన అనంతరం సింహాసనానికి వచ్చేవాళ్ళను గురించి చింత కలుగసాగింది.

వీరనరసింహునికి విరూపాక్షుడన్న ఆరు సంవత్సరముల కొడుకు వున్నాడు. తండ్రి దుర్గుణతలకు ప్రతీకమన్నట్లుగా అతడు చాలా దుర్బలుడుగా వున్నాడు. తన అనంతరం కొడుకుకు సింహాసనం చెందాలని వీరనరసింహుని ఆశ. కానీ— దీనికి చాలా అడ్డంకు లున్నాయి. సోదరుల కందరికంటె ప్రబలుడైన కృష్ణదేవరాయలే సింహాసనానికి రావచ్చునన్న భయం వీరనరసింహునికి కల్గింది. దానిని తనుబ్రతికివుండగానే తీర్చుకుని కుమారునికి సింహాసన మెక్కడానికి నిష్కంటక

మైన మార్గ మేర్పరచాలని నిశ్చయించాడు. ప్రధానమంత్రి తిమ్మరుసును తన అంతరంగానికి పిలుచుకొని కృష్ణదేవ రాయల కళ్ళను వూడదీసి తెచ్చి చూపించాలని ఆజ్ఞచేశాడు.

తిమ్మరుసుకు మొదటి నుంచి కృష్ణదేవరాయలమీద అమితమైన ప్రీతి విశ్వాసాలుండేవి. రాయలప్పుడు ఇరవై, ఇరవై రెండేళ్ళ వయస్సుగల యువకుడు, వీరుడు. సాహస వంతుడు. రాజ్యపాలనలో బహుళాసక్తిగలవాడు. దీని సంతా సూక్ష్మంగా గ్రహిస్తూవచ్చిన తిమ్మరుసుకు కృష్ణ దేవరాయల కళ్ళను వూడదియ్యమన్న వీరనరసింహుని పన్నా గడ తెలిసి చాలా వ్యధ కల్గింది. ప్రభువాజ్ఞ ప్రకారం నడచు కుంటే రేపటి సార్వభౌముణ్ణి తానుగానే హత్యచేసినట్లవు తుంది. ప్రభువాజ్ఞ మీరితే రాజద్రోహం చేసినట్లవుతుంది. ఈ ధర్మసంకటంలో పడి దారి తెలియకుండా తిమ్మరుసు కొంతసేపు విహ్వలుడై కూర్చున్నాడు. కృష్ణదేవరాయ ల్లాంటి అప్రతిమవీరుణ్ణి అంధునిగా చెయ్యడాని కతని అంత రాత్మ సమ్మతించలేదు. ఇటు కృష్ణదేవరాయలు కళ్ళు పోగొట్టుకోకూడదు. అటు వీరనరసింహభూపాలునికి తన ఆశయం నెరవేరిందని తెలియాలి. ఈవిధంగా అతడొక ఆలోచన చేశాడు. కృష్ణదేవరాయలను యేకాంతానికి పిలి పించుకుని రాజాజ్ఞను తెలియజేశాడు. ఇది వినగానే రాయలు గజగజ వణకిపోయాడు. దైన్యంగా తిమ్మరుసును చూస్తూ అన్నాడు.

"అప్పాజీ, రాజ్యకోశాలు దొరుకక పోయినా చింత లేదు. నన్ను అంధునిగాచేసి ఆజన్మాంతమూ దుఃఖించేలా

చెయ్యకండి. రాజుగారికి నేను బ్రతికి వుండడంవల్ల తమ పుత్రునికి సింహాసనం లభించదని అనుమానంగావుంటే, నేను సన్యాసం పుచ్చుకుని ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతాను.''

రాయలమాట తిమ్మరుసు హృదయాన్ని కలచివేసింది. రాయలను సంతోషపరచి, అతడు కొంతకాలం రాజధానిని వదలి అజ్ఞాత వాసంలో వుండాలనిచెప్పాడు. అదేవిధంగా రాయలు రాజధానినివిడచి అజ్ఞాతంగా గడుపడానికి ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఇక్కడ తిమ్మరుసు మేకకళ్ళను తీసి, వాటిని స్వర్ణ సంపుటంలో వుంచుకొని వెళ్ళి ప్రభువైన వీరనరసింహ భూపాలునికి చూపించాడు. వీరనరసింహునికి సంతోష మైనది.

ఈ ఘటన జరిగిన స్వల్పకాలంలోనే వీరనరసింహుడు మరణించాడు. అప్పుడు తిమ్మరుసు అజ్ఞాతంలోవున్న రాయలను రాజధానికి పిలిపించుకుని రత్నసింహాసనంలో కూర్చుండ జేసి, పట్టంకట్టి సార్వభౌముడని ఘోషించడమేకాక తండ్రిగా, మిత్రుడుగా, మంత్రిగా నిలబడి సామ్రాజ్యాన్ని పాలించడాని కతనికి సహాయకుడయ్యాడు.

అప్పటినుంచీ తిమ్మరుసంటే రాయలకు తండ్రి—ప్రియ మైన అప్పాజీ. తిమ్మరుసు ఇదే విశ్వాసాన్ని వుంచుకుంటూ వచ్చాడు. అతని భావనలో రాయలు అభిమాన పుత్రుడే అయ్యాడు. తిమ్మరుసు కృష్ణదేవరాయ—గోవిందరాజులను తన రెండుకళ్ళుగా భావించాడు. ఇది అక్షరశః సత్యమైనది—

సాళ్వ తిమ్మరుసు బాల్యంలో చాలా కష్టాన్ని అను భవించినవాడు కాబట్టే అతనికి ఇతరుల కష్టాలు సహజంగా

అర్థమౌతుండేవి. దుఃఖాలకూ—దౌర్భాగ్యాలకూ మిత్రుడవడానికి అతడు సర్వదా సిద్ధుడుగావుండేవాడు. అతని కరుణార్ద్ర హృదయ పరిచయం సామ్రాజ్యపు ప్రతిఒక్క పౌరునికీ వుండేది. అతడు రాజనిష్ఠా సేవకుడైనట్టే, ప్రజాసేవకుడూ అయ్యాడు. అందువల్లనే అతడు ప్రజాకోటి కభిమాన ప్రధానామాత్యుడయ్యాడు.

చిన్నతనంలోనే తల్లి తండ్రులను పోగొట్టుకున్నతిమ్మరుసుకు సంసారభారం చాలా చిన్న వయస్సులోనే నెత్తిన పడింది. వాళ్ళదన్నది ఒక్క పూరిగుడిసె తప్ప మరేమీ లేదు. తిమ్మరుసు బ్రాహ్మణుడవడంవల్ల శరీరకష్టం అతని నుంచి సాధ్యంకాదని అతణ్ని కూలికి కూడా ఎవరూ పిలిచే వాళ్ళు కాదు. పుట్టినవూళ్ళో పురిసెడు గంజికూడా దొరుకడం కష్టంమైపోయింది. భిక్షమడుగడానికతనికి అభిమానం అడ్డు తగిలింది. అందువల్ల అతడు స్వగ్రామం విడిచి వెళ్ళిపోయాడు

తమ్మునితో అక్కడ—యిక్కడ పడి లేస్తూ తిరుపతి చేరిన అతనికి అక్కడ వెంకటేశ్వరుని కృపేమో నన్నట్టుగా సమీపంలోని ఒక పల్లెలో జమీందారువద్ద గోవులను మేపే పని దొరికింది. అతనికి భిక్షమడిగే వృత్తి తప్ప మరే పనిగానీ చెడ్డదిగాతోచలేదు. తనకు ఈ వృత్తిని చూపించిన వెంకటేశ్వరునికి నమస్కరించాడు. ఇది వరకు తమ్ముణ్ని ఎలా పోషించాలని ఆలోచిస్తున్న అతనికిప్పుడు నిశ్చింత అయినది.

తిమ్మరుసు గోపాలకుడుగా కుదిరిన తర్వాత అతని భాగ్యభవనపుద్వారం తెరువబడిం దనాలి. జమీందారు

బ్రాహ్మణుడు. నిష్ఠావంతుడు. వేదాంతంలో పాండిత్యం గలవాడు. అతడు ఆచారశీలుడుగా వున్నప్పటికీ దయాపరుడు, ఉదారుడుకూడాను. అతని యింటిలో ధన ధాన్య సంపదలు నిండి వెల్లువలై పోతున్నాయి. అతని భార్యా-పుత్రులు అతని కనుకూలవంతులు. జీవితంలో తృప్తినికన్న సుసంస్కృత జీవికి పరుల సుఖంలో, దుఃఖంలో భూతానుకంప ముండేది. ఊరూరూ తిరిగివచ్చిన తిమ్మరుసు హృదయవిదారకమైన కథను విని అతని కోరికప్రకారం ఒక గోపాలకునికి పని నిచ్చాడు. తిమ్మరుసు జమీందారుకుటుంబానికి చేరినవాడి లానే వుండిపోయాడు. జమీందారు భార్య తిమ్మరుసు, అతని తమ్ముని అన్నవస్త్రాలను చూస్తూ వారి తల్లిస్థానాన్ని ఆక్రమించుకుంది. జమీందారు తిమ్మరుసుకు సకాలంలో ఉప నయనం చేసి వేదాధ్యయనం చేయించడానికి ప్రయత్నించాడు. అతని గ్రహణశక్తిని చూచి ఆయన నిశ్చేష్టుడయ్యేవాడు. తిమ్మరుసు ఆయన చెప్పించినపాఠాలను, గోవులను మేపడానికి వెళ్ళినప్పుడు వృక్షచ్ఛాయలలోనో, నదివద్దనో కూర్చుని మననం చేసుకునేవాడు. ఇలా చేస్తున్నప్పుడు ఎన్నోసార్లు ఆయాసంతో పడుకోవడమూ వుండేది. అప్పుడతని మిత్రులు వచ్చి లేపవలసివచ్చేది.

ఒకతూరి యిలాగే అయింది. గోవులను మేపడానికి వెళ్ళిన తిమ్మరుసు గోవులను మేతకు వదలి అక్కడేవున్న కానుగ చెట్టుక్రింద ఆలోచిస్తూ పడుకున్నాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో అతనికే తెలియదు. మెలకువ వచ్చి చూడగా ప్రభువైన జమీందారు ఎదురుగా నిలబడివున్నాడు. తన తప్పుకు

ఒప్పుకున్నట్టుగా దీనుడై ఆయనవైపు చూస్తూ నిలబడ్డాడు. ఆయన పరుగెత్తుకునివచ్చి అతణ్ణి హృదయానికి హత్తుకుని "నాయనా! నువ్వు సామాన్యుడివికావు. నువ్వొక మహాపురుషుడివి! నీవల్ల లోకంలో అనేక మహత్కార్యాలు జరుగుతాయి. ఇప్పట్టినుంచీ నువ్వు సామాన్య గోపాలకుడివికావు. లోకాన్ని పాలించడానికి వచ్చిన మహాసార్వభౌముడివి" అని తడబడుతూ అన్నాడు. ఆయన చెప్పిన ఒక్కమాటకూడ తిమ్మరుసుకు అర్థంకాలేదు. తప్పుచేసిన తనమీాద ప్రేమామృతవర్షం కురిపిస్తున్న అతణ్ని చూచి తిమ్మరుసుకు ఆశ్చర్యమైనది.

జమిందారు అతణ్ని అక్కడ విడువకుండా యింటికి తీసుకు పోయాడు. తన భార్యతో జరిగిన సంగతిని చెప్పి ఆత్రుతతో త్వరత్వరగా అడుగులువేశాడు. ఆయన చిరకాల వాంఛితం ఫలించినట్టు ఆయనకు ఆదిశేషుని దర్శనమైనది. దీనికి కారకుడైన తిమ్మరుసు విషయంలో ఆయనకు పూజ్యభావం ఏర్పడింది.

జరిగిన సంగతేమిటంటే, తిమ్మరుసు గోవులను మేతకు విడచి వృక్షచ్ఛాయలో పడుకున్నాడు. అతడు మేతకువిడిచిన ఆవులలో ఒకటి అక్కడా-ఇక్కడా మేస్తూవెళ్ళి మళ్ళీ ఇంటికి తిరిగివచ్చేసింది. ఇంకా ప్రొద్దుండగానే తిరిగివచ్చిన ఆవును చూసి, జమీాందారున కాశ్చర్యమై దాన్ని తోలుకుని వెళ్ళిన తిమ్మరుసును వెతుక్కుంటూ వచ్చి చూశాడు! తిమ్మరుసు కానుగచెట్టు నీడిలో ప్రశాంతంగా నిద్రిస్తున్నాడు. అతని తల వద్ద వున్న కొమ్మమీాద ఒకనాగుపాము ఎండపొడవల్ల అతని

నిద్రకు భంగం కలుగుతుందేమోనని పడగవిప్పి సూర్యరశ్మి అతని ముఖంమీద పడకుండా నీడను కలుగజేస్తోంది. విష జంతువని ఖ్యాతిగాంచిన నాగుపాము పడగవిప్పి ఒకసామాన్య బ్రాహ్మణపిల్లవానికి నీడను కలుగజేస్తున్న అద్భుత దృశ్యాన్ని చూచి ఆయనకు విస్మయాశ్చర్యాలు ఏకకాలంలో జనించాయి. జమీందారు కనిపించగానే పాము సరసరి వెళ్ళి దూరంలోవున్న పుట్టను చేరుకుంది! తీక్ష్ణమైన సూర్యకిర ణాలవల్ల తిమ్మరుసుకు మెలకువ వచ్చి కళ్ళు తెరచి చూడగా ఎదురుగా తన యజమాని! అన్ని సంగతులను విన్న తర్వాత ఆయన మాటను తిమ్మరుసే నమ్మలేకపోయాడు. దైవం తన మూలంగా ఏమహాత్కార్యాన్ని సాధించాలని నిశ్చయిం చిందో నని తిమ్మరుసు అనుకున్నాడు.

ఈ విషయం జమీందారు భార్యవిని తిమ్మరుసును దేవదూత యేమోనని అనుకుంది. అప్పటినుంచి తిమ్మరుసు దురదృష్టాన్ని లెక్కించకుండా అతణ్ని ఇంటిలోనే వుంచు కున్నాడు. ఇతడేదో ఉత్తమ బ్రాహ్మణ వంశంలో పుట్టివుండ వచ్చునని అతని గ్రహణశక్తినీ, మేధాసంపత్తునూ చూచి, వూహించి అతనికుల గోత్రాలను విచారించి, ఆ విషయంలో పరిశోధన సాగించారు.

వాళ్ళ శోధన ఫలవంతమైంది—

తిమ్మరుసు తండ్రి తాతల కాలానికి వేదవేదాంగా లలో పారంగతులైన శ్రోత్రియులవంశంలో పుట్టాడు. అతని తండ్రికాలంలో తాకిన జీవనంలో వేదాంతదర్శనలకు విలువ

లేకపోయి తిమ్మరుసు, అతని తమ్ముడు బీదతనపు బాధలను అనుభవించవలసి వచ్చింది. ఇది ఒకవిధంగా శాపమే అయినది. తమ ఆచారాన్ని శ్రద్ధాభక్తులతో కాపాడుకుంటూ వచ్చిన మరొక శాఖవారు యింకా వృద్ధదశలో వున్నారు. వాళ్ళలో గంగామాత్యుడన్న బ్రాహ్మణుడు వేదాంతాది చతుర్దర్శనలలో పారంగతుడై, మంచి శ్రోత్రియుడై, ఆచారశీలుడై, విజయనగరపు సాళ్వనరసింహుని ఆస్థానంలో విద్వాంసుడుగా వుండేవాడు. అతడు తిమ్మరుసుకు దూరపు చుట్టంగా వుండవచ్చునని యెలాగో ఆరాతీసి తనే తిమ్మరుసును, అతని తమ్ముణ్ణి పిల్చుకునివెళ్ళి గంగామాత్యునివద్ద విడచివచ్చాడు.

గంగామాత్యులంతటి ఉత్తమ గురువుల ఆశ్రయం తిమ్మరుసుకు దొరికినతర్వాత చెప్పవలసిన దేముంది? తిమ్మరుసు అతిత్వరలో సంస్కృతం, తెలుగుభాషలలో పారంగతుడయ్యాడు. గంగామాత్యులు ఆస్థానంలో మన్నన పొందినవాడు. తిమ్మరుసు తన గురువుల మిత్రత్వంలో మెల్లమెల్లగా రాజనగరుకు వెళ్ళివస్తూండడంవల్ల ప్రభువుల దృష్టికి యితని బుద్ధికౌశలం, పాండిత్యం తెలిసివచ్చి ఆతనికి రాజనగరులో ఒక ఉద్యోగం దొరికింది. లౌకికవిషయాలలో కుశాగ్రబుద్ధియైన తిమ్మరుసు త్వరలోనే తన శక్తిసామర్థ్యాలతో ప్రభువుల సేవలో కొంత కొంతగా పురోగమిస్తూవచ్చాడు. అతనికి మంత్రిపరిషత్తులో స్థానం లభించింది. అనంతరం కుశాగ్రమతి, రాజకీయతంత్రజ్ఞ నిపుణుడు అయిన అతను చివరికి

ప్రధానామాత్యపదవి సంపాదించి గడచిన నలభై యేళ్ళనుంచి సామ్రాజ్యానికి సేవచేశాడు.

అంతటి గొప్పవాడైన తిమ్మరుసు—తన దిగ్విజయాలన్నిటికి కుడిభుజంగా నిల్చి పోరాడినవాడు యిప్పుడు సాధారణ సన్యాసిమాటను ఆమోదిస్తున్నాడుకదా అని రాయలకు ఆశ్చర్యమైంది. ప్రధానామాత్యుడే యిలా యుద్ధవిషయంలో నిరుత్సాహం వ్యక్తపరిస్తే ముందటి గతేమిటి? అని రాయలు తన యుద్ధనిర్ణయాన్ని మళ్ళీ శంకించేలా అయింది. ఆ సమయానికి ప్రతీహారి ఒకడు కనిపించి గోవానుంచి ఒక దూత వచ్చి రాయల దర్శనానికి కాచుకునివున్నట్లు విన్నవించాడు. రాయలు అతణ్ని తీసుకురమ్మని చెప్పగా తిమ్మరుసు అక్కడ నుంచి వెళ్ళడానికి లేచాడు. కానీ, రాయలే తిమ్మరుసును అక్కడ వుండమని ప్రార్థించాడు.

తిమ్మరుసు నిరుత్తరుడై విగ్రహంలా కూర్చున్నాడు.

# 4

"ప్రభూ! చాలా అన్యాయమైంది. చాలా అన్యాయమైంది. తమను విశ్వాసపాత్రుడైన మిత్రుడని అనుకున్న సిద్ధిమర్కార్ ప్రభువులకు ద్రోహం తలచాడు! ప్రభువులను మోసగించి తప్పించుకున్నాడు." అని గుక్క తిప్పుకోకుండా ఒప్పించాడు, గోవానుంచివచ్చిన ఆ దూత.

"ఏమిటి సంగతి ? వివరంగా చెప్పు !" అని ఉద్వేగాన్ని అణచుకోలేక రాయలు ప్రశ్నించాడు.

గోవానుంచి వచ్చిన ఆ దూత అన్నివిషయాలను వివరంగా తెలియజేసినతర్వాత రాయలు భారంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

"స్నేహితుడనుకుని అతణ్ణి నేను నమ్మాను. కానీ— అతడు ద్రోహం చేస్తాడని అనుకోలేదు." అని ఖిన్నుడై అన్నాడు కృష్ణదేవరాయలు.

రాయలకు తనకూ సిద్ధిమర్కారుకూ వున్న సంబంధమంతా కళ్ళయెదుట కనిపించినట్టయింది—

సిద్ధిమర్కార్ విజయనగరపు ఒక ప్రముఖవర్తకుడు. అతడు నమ్మకమైన అశ్వవ్యాపారిగా, రాజనిష్ఠాసేవకుడుగా వుండేవాడు. రాయల, సిద్ధిమర్కారుల పరిచయం చాలా రోజులది. అతని వినయప్రవర్తన, ఇతరులకు బాధకలిగించని మాటలు యెలాంటివారినైనా కరిగింపజేస్తుండేవి. అతడు పదిమూరల దూరం నుంచునే గుఱ్ఱపు వయస్సు, జాతి, దాని శక్తి అన్నీ వూహిస్తూండేవాడు. ఆ వూహాలకు, వాస్తవాంశాలకు యెక్కువభేదం వుండేదికాదు. అతని అశ్వశాస్త్రప్రజ్ఞ అంత గొప్పగావుండేది. దీనినుంచి అతడు రాయల పరమాప్తమిత్రుల్లో ఒకడయ్యాడు. ఎన్నోసార్లు బహుబాధ్యతాయుతమైన నమ్మకపుపనులను అతడు వహించవలసివస్తుండేది. సిద్ధిమర్కారు యిదివరకు రాయల విశ్వాసాన్ని కాపాడుకుంటూనే వచ్చాడు. ఏవిధమైన ప్రలోభా

నికి వశుడవకుండా స్వామి నిష్ఠాసేవకుడుగా వుంటూ వచ్చాడు.

మహమ్మదీయుడైన సిద్ధిమర్కారుని విషయంలో రాయలింత నమ్మక ముంచడం తిమ్మరుసు కిష్టంలేదు. సిద్ధిమర్కారెంత మంచివాడుగా కనిపించినా, అతడు మాటలునేర్చిన వాడని, అతణ్ని పూర్తిగా నమ్మడం అంత మంచిది కాదని తిమ్మరుసు రాయలను హెచ్చరిస్తూనేవస్తున్నాడు. రాయలు యీ హెచ్చరికను గమనించకుండా నడచుకోసాగాడు. రాయలు జాగ్రత్తపడకపోయినా తిమ్మరుసు గూఢచారుల మూలంగా సిద్ధిమర్కారుని ప్రవర్తనలను మొదటినుంచి తెలుసుకుంటూనే వస్తున్నాడు. ఇంతైనా యే నమ్మక ద్రోహమూ బయల్పడలేదు. ఎప్పటికైనా అతడు నమ్మక ద్రోహం చేసేవాడేనని అతనివిషయంలో తిమ్మరుసు చాలా జాగ్రత్తగా మెలగసాగాడు.

ఈమధ్య రాయలు సిద్ధిమర్కారునికి ఒక నూతన కార్యం అప్పగించాడు అదేమిటంటే విజయనగరపు సైన్యానికి కావలసిన ఉత్తమాశ్వాలను విదేశీయులనుంచి కొని రాజధానికి పంపించడం. ఈ కార్యం సాధించటానికి సిద్ధిమర్కార్ రాజధానిని విడచి గోవాకు వెళ్ళవలసివచ్చింది. ఇది ఒక విధంగా అతని కనుకూలమే అయింది.

కృష్ణదేవరాయలు యెంతటి యుద్ధవీరుడో అంతే యుద్ధశాస్త్రపారంగతుడూనూ. క్రితం బహమనీసుల్తానులు విజయనగరరాజులను ఓడించినది వాళ్ళ అశ్వసైన్య బలం వల్లనే. ఉత్కళగజపతి తమ సైన్యంలో యేనుగులను నిండిం

చాడు. ఆతని గజసైన్యాన్ని ఎదిరించి పైనపడటాని కెంతటి వారికీ సాధ్యంలేదు. విజయనగరరాజులు నరపతులని ఖ్యాతి గాంచినవారు. వాళ్ళవద్ద అధికసంఖ్యలో సుశిక్షితసైన్య ముండేది. వీటితోపాటు గజసైన్య, అశ్వసైన్యం చేరుకుంటే తమ నెదిరించడానికి యెవరూ రారని తలచిన రాయలు సాధ్యమైనన్ని ఏనుగులను, గుఱ్ఱాలను తన సైన్యానికి చేర్చు కొని సైన్యాన్ని బలపర్చుకున్నాడు. అందువల్లనే ఉత్కళ గజపతి రాయలకు శరణుజొచ్చాడు. అశ్వపతులైన బహామనీ సుల్తానులు బెదరి సంధిచేసుకున్నారు.

ఇప్పుడు సిద్ధమర్కార్ గోవాలో ఒక ఠాణాను ఏర్ప రచుకున్నాడు. అక్కడ సంవత్సరంలో చాలామాసాలు డేరాలువేసి పర్షియా, ఓమెజార్, అరేబియాదేశాల నుంచి వస్తున్న ఉత్తమాశ్వాలను కొంటూ వుండేవాడు. పశ్చిమపు రేవు పట్టణాలైన బట్కళ్, మంగుళూరు, కళ్ళికోటలలో తన అనుచరులను నియమించి, అక్కడున్నుంచివచ్చిన విదేశపు గుఱ్ఱాల నన్నింటిని కొని, రాయలకు పంపించడానికి ఏర్పాటు చేస్తూండేవాడు.

ఈ గుఱ్ఱపు వ్యాపారం చాలా లాభదాయక మవడం వల్ల విదేశీయులు—ముఖ్యంగా పోర్చుగీసు ఈ ఉద్యమంలో పాల్గొనేవారు. ఇంతవరకూ విదేశపుగుఱ్ఱాలన్నిటినీ బిజాపుర, బీదర్, గోల్కొండ, బీహార్ దేశపు రాజులే ఎక్కువ వెల యిచ్చి కొనుక్కుంటూ వుండేవాళ్ళు. ఇప్పుడు వాళ్ళకు ప్రతిస్పర్థిగా రాయలునిల్చాడు. అతడు ఇతరులిచ్చే వెలకంటే ఎక్కువ వెలయిచ్చి గుఱ్ఱాలను కొనడానికి, వాళ్ళు తెచ్చిన

ఉత్తమ శ్రేణివర్గపు గుర్రాలను తనుతీసికుంచేవాడు. దీన్నుంచి ఇతరులకు విదేశపు ఉత్తమాశ్వాలు దొరకడమే దుర్లభమై పోయింది.

ఈ అశ్వవ్యాపారపు హక్కులన్నీ సిద్ధిమర్కారునికి యివ్వడంచూచి తిమ్మరుసు మొదట అసమ్మతిని వ్యక్తపరిచాడు. కానీ—ధనాదికాలమీద తమ అధికారం వుండడం వల్ల, సిద్ధిమర్కార్ చతురోపాయాలేమీ సాగవని వూహించుకున్నాడు.

సిద్ధిమర్కార్ రాజధానినివిడచి చాలాకాలం అన్య ప్రదేశంలో వుండవలసిన సందర్భం సంభవించడంవల్ల అతని ప్రవర్తనలో మార్పు కలిగింది. తనమూలంగా నూరారువరహాలు పోర్చుగీసుల చేతిలో పడుతుండడంచూసి అతనిలో దురాశ మొలకెత్తింది. బిజాపుర సుల్తానుని ప్రబోధనకూడా జరిగింది సిద్ధిమర్కార్ మహమ్మదీయుడైనా రాయల సేవలో వుండడం చాలా అవమానకరమని, అతడు తన ఆశ్రయంలో నిలుచున్నట్లయితే ఇంకా ఎక్కువ అధికార, శ్రీమంత, అంతస్థులు దొరుకుతాయనీ అతనికి ప్రబోధన చేస్తూనే రాసాగాడు. మొదట ఈ మాటలకు సిద్ధిమర్కార్ వశుడుకాకపోయినా, చివరికి సంతతంగా జరిగిన ప్రబోధనకతడు వశుడైపోయాడు. ఆతడు రాయల సేవలో వుంటూనే రాయలకు వ్యతిరిక్తంగా విద్రోహకార్యాల్లో మునిగాడు. దీన్ని గమనించిన తిమ్మరుసు అతని మీాద మరింత నిఘావుంచాడు. ఎంత చేసినా సిద్ధిమర్కార్ రాయలను ఏమరించి తిమ్మరుసుకు తెలియకుండా నలభై వేల వరహాలను సురక్షితమైన చోటుకు

సాగించి హఠాత్తుగా మాయమైపోయాడు. తిమ్మరుసుకు ఈవిషయం తెలియకముందే అతడు రాజధాని విడచి చాలా దూరంవెళ్ళి, బిజాపురసుల్తానులవద్ద ఆశ్రయం పొందివున్నాడన్న ఈ విషయాలను తెలియ జెయ్యడానికిగా భటుడు గోవానుంచి రాజధానికి వచ్చాడు.

ఈ విషయాలన్నీ విని, రాయలు క్రోధంతో పళ్ళు కొరికి "ఆద్రోహి ఎక్కడున్నా పట్టితెచ్చి, ఆ విశ్వాసఘాతకుణ్ని ఉగ్రశిక్షకు గురిచెయ్యాలి." అని గర్జించాడు.

తిమ్మరుసు సిద్ధిమర్కారుని కథనంతా విని, రాయల కోపావేశం శాంతతగ్గినతర్వాత "చివరికి నాఊహానిజమే అయింది" అన్నాడు.

"అయితే సిద్ధిమర్కార్ యిలా స్వామిద్రోహి అవుతాడని మీకు తెలిసేవుంది?"

"ఈ విషయంలో నేను తమకు మొదటి నుంచీ హెచ్చరిక చేస్తూనే వస్తున్నాను. కానీ—అది ప్రభువుల మనస్సుకు రాలేదు. చివరికి నా నిరీక్షవ్యర్థంకాలేదు. ఇప్పుడు నాకు ఒకవిధంగా సమాధానమే అయింది."

"సిద్ధిమర్కార్ మాకు మోసంచెయ్యడం మీకు సమాధానమేనన్నమాట?"

"అవును ప్రభూ, అతడలాంటి కపటి. రెండు తలల పాము రాజధానిలో వున్నంతవరకూ రాజ్యానికి క్షేమం లేదు. ఇక్కడున్నంతవరకూ అతడు సుల్తానుల గూఢచారుడుగానే వున్నాడు. అతడు రాజధానినుంచి వెళ్ళిపోవడం ఒకవిధంగా సమాధానమే ప్రభూ!"

"మీరు చెప్పినది ఒకవిధంగా సమంజసమే అయినా రాజభాండాగారంనుంచి నలభై వేల వరహాలు అపహరించి వున్న అతణ్ణి పట్టితెచ్చి, ఆ డబ్బును మళ్ళీ పొందాలి. లేదా అతణ్ని కఠినంగా శిక్షించాలి. కానీ-శత్రురాజుల ఆశ్రయంలో వున్న అతడు మనచేతికి దొరికేవిధాన మెలాగా? అతణ్ని పట్టుకోవడానికి మనం బిజాపుర సుల్తానుమీద దండెత్తడ మొకటేదారి!"

ఈమాటలు విని విస్మితుడైన తిమ్మరుసు:

"ఇంత అల్పవిషయానికి యుద్ధపు టవశ్యకత లేదు ప్రభూ! సిద్ధిమర్కార్ మనసైన్యంలోనివాడు. రాజబొక్కసం నుంచీ ధన మపహరించుకొని బిజాపుర సుల్తాను ఆశ్రయం పొందివున్నాడు. అతణ్ని డబ్బుతోసహా మనకు అప్పజెప్ప డానికి మనం లేఖ వ్రాసి పంపితే—బహుశః సుల్తాను సిద్ధి మర్కారునికోసం, నలభై వేల వరహాలకోసం యుద్ధంలాంటి ప్రచండాఘాతాన్ని ఆహ్వానించడని నా నమ్మిక. కాబట్టి యుద్ధం చెయ్యడానికి ముందు సామ, దాన, భేదాలను ప్రయోగించడం మంచిది."

"ఒకవేళ సుల్తాను మనలేఖను ధిక్కరిస్తే?"

"ఆతర్వాత తెలిసేవుంది దండప్రయోగం!"

"ఆ మదోన్మత్త సుల్తాను మన మంచిమాటలకు చెవి నిస్తాడా? అతని గర్వాన్నణచడానికి యుద్ధమొకటే సరైన దారి."

"యుద్ధం అనివార్యమైతే-యుద్ధం చేస్తాం ప్రభూ! యుద్ధమంటే రెండు రాష్ట్రాలకూ కపార ధనవ్యయం. జన

హాని. దీనివల్ల ఎవరికీ సుఖంలేదు. సిద్ధిమర్కారునికి ఆశ్రయ మివ్వడంమూలాన మనం చేసుకునివున్న శాంతి సంధికి భంగం కలిగిందని బిజాపురసుల్తానుల దృష్టికి తీసుకురావాలి. దీని నుపేక్షించారంటే—మన ఆజ్ఞను ధిక్కరించారంటే—తర్వాత యుద్ధం, తెలిసేవుంది.''

తిమ్మరుసు ఈ సలహా రాయలకు మంచిగా తోచ లేదు. అకారణంగా బిజాపుర సుల్తానులమీద యుద్ధం ఘోషించిన రాయలకు యిప్పుడు సదవకాశం దొరికివుండగా దానిని ఉపయోగించుకోకుండా విడువడమా? సుల్తాను లేఖను చూసి బెదరి సిద్దిమర్కారుని అప్పగి స్తే ఒక సదవకాశం తప్పి పోతుంది. ఏలాగైనా యుద్ధం చెయ్యాలనే రాయల కోరిక.

"అయితే మీకు యుద్ధంచెయ్యడాని కిష్టంలేదన్న మాట?''

''నిష్కారణంగా యుద్ధం చెయ్యడం నాకిష్టంలేదు ప్రభూ!''

''ఇప్పుడు యుద్ధంచెయ్యడానికి రెండుకారణాలు లభిం చాయి. మొదటిది: సిద్ధిమర్కారునిది. రెండవది: రాయ చూరు, ముద్గల్లులను వశపరచుకోవడానికైనా యుద్ధం అని వార్యంగానేవుంది!''

''దీన్ని శాంతివిధానంలోనే పరిష్కరించుకోవచ్చు. ప్రభూ! నేను క్రితం చెప్పినట్టు బిజాపురసుల్తానుకు రాయ చూరు, ముద్గల్లు లను మనకు అప్పగించాలసి లేఖ వ్రాస్తాము. అతడు తిరస్కరి స్తే తెలిసేవుంది, యుద్ధానికి శరణురావడం. కానీ—సాధ్యమైనంత శాంతి విధానంలో ఈ విషయాన్ని

పరిష్కరించుకోవడానికి ప్రయత్నించాలి. 'జీవనమార్గం శాంతి' అన్న సత్యాన్ని వాళ్ళు మనసులో వుంచుకున్నట్టయితే, ఖచ్చితంగా యుద్ధానికి, హింసకు ప్రేరకులు కారు."

"ఇప్పుడు మనం శాంతి మంత్రాన్ని జపిస్తూ కూర్చున్నామంటే, పరిస్థితివిషమించడమేసరి. శత్రువు బలాఢ్యుడు కాతముందే అతణ్ణి శరణాగతుని చేసుకోకపోతే సామ్రాజ్యానికి విపత్తు తప్పదు. మనతో సుల్తాను శాంతిసంధి చేసుకుని వుంటమైనా యుద్ధసన్నద్ధుడు కావడానికే— సైన్యాన్ని బలపరచి, సమయంచూచి మీాదపడడానికి సిద్ధమౌతున్నాడు. అతడు శాంతిప్రియుడే అయివుంటే విద్రోహ చర్యలకు దోహదమిచ్చేవాడా? మనం యుద్ధసన్నద్ధులం కావాల్సినదే."

"సుల్తాను మనమీాద పడడానికి వస్తే మనమెందుకు భయపడాలి ప్రభూ! మనసైనికులు పిరికిపందలు కాదు. ఏ ఘడియలోనైనా వాళ్ళు దేశరక్షణకు సిద్ధులుగానేవున్నారు. ఈ విషయంలో ప్రభువులకు చింత అక్కరలేదు. కానీ—ఏదో సన్నపాటి కారణానికిగా యుద్ధంచేసి దేశపు సంపదను పాడు చెయ్యడం నాకిష్టంలేదు.

ఈ మాటలు రాయలకు ఎంత ప్రియమయ్యాయో, దానినతడు మాటలలో వ్యక్తపరచలేదు. "అప్పాజీ అభిప్రాయానికి వ్యతిరిక్తంగా యుద్ధంచెయ్యడంకన్నా, అతని అభీష్ట ప్రకారం నడచుకోవటం మంచిది. తన అభీష్టం నెరవేరకపోతే తెలిసేవుంది, యుద్ధం" అని రాయలు సుల్తానుకు లేఖను పంపించడానికి నిశ్చయించాడు.

# 5

త్రిమ్మరుసు సలహా ప్రకారం బిజాపుర సుల్తానుకు లేఖ వెళ్ళింది. దానిలో రాయలు, తన రాజ్యపు విశ్వాస ఘాతకునికొకనికి సుల్తాను ఆశ్రయమిచ్చినట్టూ, అతన్ని ధనంతో సహా తమకు అప్పగించవలసినదనీ తెలియజేశాడు. ఆ లేఖను చూసి సుల్తాను, తనకు ఈ విషయాలొక్కటీ తెలియవనీ, తాను ఎవరికీ ఆశ్రయ మివ్వలేదనీ ప్రతిలేఖ వ్రాసి తెలియజేశాడు.

కాసీ—వేగులవారు తెచ్చిన వార్త ప్రకారం సిద్ధిమర్కారునికీ, అదిల్‌శహానుకూ మొదటినుంచి స్నేహితముంది. సిద్ధిమర్కార్ అశ్వశాస్త్ర నిపుణుడూ, వ్యాపారదక్షుడూ, శ్రద్ధావంత మహమ్మదీయుడూ అయినందువల్ల అతడు సన్న్యాసుల సేవలో మునిగిపోవడం అధర్మమనే సుల్తాను అభిమతం. అతడు తన ఆశ్రయానికి వచ్చినట్లయితే అతన్ని జాబాల్ దుర్గపు అధిపతిగా చేయునట్లు వాగ్దానంచేశాడు. ఈ ప్రలోభాలన్నిటికీ వశుడై సిద్ధిమర్కార్ నల్భై వేల వరహాలతో సుల్తాను వద్దకు వచ్చాడు. సుల్తాను తన వాగ్దానం ప్రకారం నడచుకున్నాడు. ఇదంతా తెర వెనుక జరిగిన కథ.

రాయలు సుల్తాను ప్రతిలేఖను చదివి కోపంతో లేచి యుద్ధానికి వెళ్ళడానికై ఏర్పాటులను చేసుకోసాగాడు.

ఇక్కడ సుల్తానుని యుద్ధసన్నాహపు కార్య మింకా పూర్తి కాలేదు. తను యుద్ధానికి సిద్ధుడవడానికి ముందే

రాయలు తన మీద దండెత్తిరావడాన్ని తప్పించాలని అతను నిశ్చయించుకున్నాడు. సిద్ధిమర్కారుని గురించి తను రాయలతో వైరత్వాన్ని కట్టుకోవలసి వచ్చిందనీ, రాయల సైన్యం తనమీద పడడానికి వస్తున్నదని, దాన్ని ఎదురించడానికి తను యుద్ధసన్నద్ధం కావడంవల్ల రాయల భొక్కసం నుంచి తెచ్చిన నల్భైవేల వరహాలను తనకు యివ్వవలసినదని సుల్తాను సిద్ధిమర్కారునికి లేఖవ్రాసి తెలియజేశాడు.

ఇలా జరుగుతుందని సిద్ధిమర్కారు ముందే వూహించి వుండవచ్చు. తనను ఆపత్కాలంలో బిజాపురపుసుల్తాను మోసగించడానికి వెనుదియ్యడంలేదని అతనికి తెలియడానికి కెంతోకాలం పట్టలేదు. ఏదో దుర్ముహూర్తంలో, అదిల్ శహాసుని నయగారపు మాటలకు వశుడై తను విశ్వాస ఘాతుకుడైనందు కతడు పరితపించాడు. కానీ, జరిగిపోయిన దానిని గురించి చింతించడాని కిప్పుడు సమయంలేదు. సాధ్యమైనంత త్వరగా తన సంపదతోసహా డాబూల్ దుర్గాన్ని త్యజించి, గోవాలోనున్న పోర్చుగీసుల ఆశ్రయం పొందడానికి నిశ్చయించుకున్నాడు.

ఆ నిశ్చయప్రకారం ఒకరోజు తన సమస్త సంపదనూ గుర్రాలమీద వేసుకుని డాబూల్ దుర్గాన్ని విడచి వెళ్ళిపోయాడు.

కానీ—అతడు బిజాపుర సుల్తాను అదిల్‌శహాసుని కళ్ళుగప్పి వెళ్ళలేకపోయాడు. అదిల్‌శహాన్ గూఢచారులు అతన్ని వెన్నంటి గోవా సరిహద్దును చేరడానికి ముందే అతనిమీద

పడ్డారు. హఠాత్తుగా తనమీద పడిన శత్రువులతో అతడు శక్తిమీరి పోరాడాడు. ఈ పోరాటంలో సిద్ధిమర్కార్ తల తెగిపడింది. అతని సమస్త సంపదను తీసుకుని బిజాపురపు వాళ్ళు వెళ్ళిపోయారు.

సిద్దిమర్కారుని మరణాన్ని విని అదిల్‌శహాన్‌కు వ్యథ కల్గినా, అతని అధిక సంపద దొరికినందుకు సంతోషమే అయింది. తన కీసంపద రావడానికి కారకులైన గూఢచారులను ఉచితరీతిని సన్మానించాడు.

అదిల్‌శహాన్ సిద్ధిమర్కారుని అతనివద్దవున్న సంపద కోసం హత్య చేయించాడన్న వార్త రాయల చెవిలోనూ పడింది. సిద్ధిమర్కార్ అలాచెయ్యడంవల్ల అదిల్‌శహాన్ హీనకృత్యం బయటపడింది. ఇక వూరుకోవడం మంచిది కాదని రాయలు సుముహూర్తంలో విజయనగర సమస్త సైన్యంతో బిజాపుర సుల్తానుమీద దండెత్తి వెళ్ళాడు.

కృష్ణదేవరాయలు మొదట డాబూల్ దుర్గాన్ని వశపర్చుకోవాలని ఆలోచించాడు. తిమ్మరుసు, డాబూల్ దుర్గానికి బదులు రాయచూరు మీద దండెత్తి వెళ్ళాలనీ, దాన్ని రక్షించడానికి అదిల్‌శహాను దండెత్తిరావడం నిశ్చయమనీ, ఆ సమయంలో రాయలు వాళ్లమీదపడి పగతీర్చుకోవచ్చునని సలహా చెప్పాడు. ఈ సలహాప్రకారం రాయలు సమస్త సేనాబృందంతో రాయచూరు మార్గంగా వెళ్ళాడు.

విజయనగర ప్రచండవాహిని పదిలక్షల సైనికులతో కూడినది. దీనిలో పదునొకండు ప్రముఖదళాలున్నవి. ఒక్కొక్క దళానికి ఒక్కొక్క యుద్ధపారంగతుడైన సేనాధిపతి వున్నాడు.

సాధారణంగా ఈ సైన్యాధిపతులందరూ రాజకుటుంబానికి చెందినవాళ్ళే అయ్యారు. లేదా తమశక్తి సామర్థ్యాలతో రాయల అనుగ్రహానికి పాత్రులైనవారుగా వున్నారు.

సాళ్వ తిమ్మరుసు, అతని కుమారుడు గోవిందరాజు, రాయసం కొండమరుసు, విజయభద్రుడు మొదలైన వీరులు వేనవేలు సైన్యాలను నడిపిస్తూ ముందు వెళ్తున్నారు. రాయల అడపగాడైన అడివప్పనాయకుడు కూడా పదునైదువేల కాల్బలమూ, రెండునూర్ల అశ్వబలానికీ అధిపతిగా వున్నాడంటే ఇక తక్కిన సామంతులూ, మాండలీకులూ ఇంకెన్ని సైన్యాలను నడిపిస్తూండాలి?

ప్రతిఒక్క సైన్యమూ అన్నివిధాలా సువ్యవస్థితమైనది. ఒక సైన్యాన్ని మరొకరినుంచి వేరుపరచడానికి ఒక్కొక్కదానికి ఒక్కొక్క గుర్తులు. ఒక్కొక్కరంగు ఉడుపు. యుద్ధపు ఏనుగులను, గుర్రాలను రకరకాలుగా అలంకరించడమైనది. ఏనుగుల మీద నిలబడి యుద్ధం చెయ్యడానికి అనుకూలమయ్యేలా శస్త్రాలతో నిండిన అంబారీలు ఏర్పాటుచెయ్యడమైనది. ఏనుగుల దంతాలకు నిడుపాటి పదునైన కత్తులను కట్టారు. ఈ కత్తులకు శత్రుసేన చిక్కిందంటే అది యిక ఛిద్రచిద్రమైనట్టే.

యుద్ధోపకరణాల్లోనూ అనేక వైవిధ్యాలు, చిత్రచిత్రమైన అనేక రకాల శస్త్రాస్త్రాలు ఒకప్రక్క, ఏనుగులు, గుర్రాలు, ఒంటెల సైన్యం మరొకప్రక్క. వాటి వీపులకు పెద్దఫిరంగులు, చిన్నఫిరంగులు, భయంకర మతాబులు, తారామండలాలు, రామబాణాలు, మొదలైన మందుగుండుసామానులు వీపు

లంగా వున్నాయి. పదాతి దళమూ, మావటీళ్ళు, సర్కసు వాళ్ళవరకూ ఒకగుంపు. నృత్య వినోదపు వేషగాళ్ళు, వాద్యగాళ్ళు, నీటిసరఫరా చేసేవాళ్లు, బంట్రోతులు, రాతిపనిచేసే వాళ్ళు, గుఱ్ఱపురౌతులూ, వడ్రంగులూ ఒకగుంపు. రాజబంధువులూ, పురోహితులూ, పౌరాణికులూ, కళావిదులు మరొక గుంపు.

ఇలా గుంపులు గుంపులుగా సాగింది రాయలసైన్యం.

ఈ సైన్యపు ముందుభాగంలో దాదాపు నాలుగు ఆమడల దూరంలో ఐదు వేలమంది వెళ్ళసాగారు. వీళ్ళ పనేమిటంటే, శత్రువుల గుట్టుమట్టులను పరిశీలించి తెలుసుకొని సైన్యశిబిరాలకు వార్తలందించడం. సైన్యానికి కావలసిన నీటిని సరఫరా చెయ్యడానికి పన్నెండు వేల నీటిసరఫరా సైనికులు నియోజితులయ్యారు. వాళ్ళు సైన్యానికి ముందు భాగంలో వెళ్లుతూ త్రాగెడి నీటిని నీరు దొరికే స్థలాలనుంచి చర్మపు సంచులలో, బండ్లమీద, ఎద్దులమీద, గుఱ్ఱాల మీద తీసుకొచ్చి సైన్యానికి సరఫరా చేస్తూండేవారు. అలాగే సైనికుల బట్టలు గుంజడానికి చాకలివాళ్ళూ, సైనికుల నుల్లాసపరచడానికి పాములవాళ్ళూ, దొమ్మరవాళ్ళూ, సంగీతకారులూ, నాటకవర్గపువాళ్ళూ వున్నారు.

ఈ సైన్యం నిరంతరం ప్రయాణించి, మూడునాలుగు నెలలకు రాయచూరు వద్దకువచ్చి విడిసింది. రాయచూరుకు సమీపంలో 'మల్లబండ' అన్న స్థలంలో సైన్యం దండు విడిసి కొంతకాలం విశ్రాంతి తీసుకోవడానికి నిల్చింది.

రాయలు జరగనున్న యుద్ధఘటాలోచనను సిద్ధపరచడానికి ప్రారంభించాడు.

మల్లబండలో గండుమవిడిసిన రాయల సైన్య శిబిరాలను చూస్తే ఎలాంటివారికైనా ఆశ్చర్యం కలుగుతూండేది. శిబిరాల కేంద్రంలో రాయలశిబిరం. దాని చుట్టూ దుర్భేద్యమైన ... కంచె. ప్రవేశద్వారంలో సర్వకాలమూ శస్త్ర సజ్జిత సైనికులు కావలి కాస్తూండేవారు. రాయల శిబిరం ... పలువిధాకారంలో తక్కిన దండనాయకుల శిబిరాలు. అందరకీ వారివారి అంతస్థులకు తగినట్టుగా అనుకూలమైన సౌఖ్యాలను కల్పించారు. చూడడాని కదొక చలించే నగరంలా కన్పిస్తుండేది. నగరంలో దొరికే సర్వ సౌలభ్యాలు అక్కడ ప్రాప్తమవుతుండేవి.

అక్కడ ఒకమాసంరోజులు రాయలు విశ్రాంతి సుఖాన్ననుభవించి, తర్వాత రాయచూరు మీద దండెత్తడానికి నిశ్చయించాడు. కాని, రాయలు శత్రువును వెదకుకుని పోనక్కరలేకపోయింది. వెదకబోయిన తీగ పదములకు తగులుకున్నట్లు శత్రువే రాయలున్న చోటికి వచ్చాడు.

అదిల్‌శహాన్ కృష్ణదేవరాయల ప్రచండసైన్యాన్ని చూచి భయపడి శరణాగతుడవలేదు. అతడు ఈ మూడు నాలుగు సంవత్సరాలనుంచి రాయల మీద దండయాత్రాలనే సైన్యాన్ని సంగ్రహిస్తూ వచ్చాడు. అతడూ రాయల్లానే వీరయోధుడు. పైగా మదోన్మత్తుడు. అతనికి ముందటి సుల్తానులూ వైభవశాలులు. అనేక సంవత్సరాలుగా పరరాజ్య ప్రమాణ, దోపిడీలతో రాజబొక్కసాన్ని నింపారు. ఇంక బహ

మనీ రాజ్యాలకు బిజాపురం మకుటప్రాయంగా వుండేది. బిజా పురపు అభివృద్ధిని చూచి ఈర్ష్యపడుతున్నా—బిజాపురపువిరుద్ధ యుద్ధంచెయ్యలేక ఇతర మహమ్మదీయ సుల్తానులు బిజాపురపు సుల్తానును తమనాయకునిగా అంగీకరించారు. దుర్బలులైన రాజులువిజయనగరసింహాసనమెక్కగావాళ్లనుఓడించి,బిజాపుర సుల్తానులు విజయనగరానికి చేరిన, రాయచూరు, ముద్గల్లు లను వశపరచుకుని తమ సరిహద్దును ముందుకుజరిపారు. వీటిని తిరిగి వశపరచుకోవాలనే రాయలు రాయచూరు మీాద దండెత్తిరావడం.

రాయలు తన ప్రచండసైన్యాన్నిచూసి బిజాపుర సుల్తాను శరణాగతుడవుతాడని ఊహించాడు. కానీ—ఆ ఊహ నిజంకాలేదు.

బిజాపురసుల్తాను ఇబ్రహీం అదిల్ శహాన్ ఒక్కడు గానే రాయలను ఎదురించడానికి తన సమస్త సేనాబలంతో కృష్ణానదికి మరొకవైపున శిబిరాలను వేయించి నిలుచున్నాడు. తక్కిన సుల్తానులకూ అదిల్ శహానుకూ వైమనస్యాలుండడం వల్ల ఇప్పుడతనికి వాళ్లు తమసహాయాన్ని నిరాకరించారు.

అన్ని రాజ్యాల సైన్యాలనూ సంగ్రహించుకుని వచ్చి వుంటే అతణ్ణి ఓడించడం కష్టమే అయ్యేది. అదిల్ శహానుకు రాయలను ఓడించి, అనంతరం తక్కిన బహమనీ సుల్తాను లను చూసుకోవచ్చునన్న ఆశ. రాయలను ఓడించిన తర్వాత తను వాళ్ళమీాద దండెత్తి వెళ్ళనలసిన పనేలేదు. తమకు తామే వాళ్ళు లొంగిపోతారు. అని కలగంటూ, సుల్తాను కృష్ణాతీరంలో రాయల చర్యలను గమనిస్తూ కూర్చున్నాడు.

దీనివల్ల రాయలకు చాలా నిరాశకల్గింది. అతనికి ఒక్కొక్క వేళలో ఇక్కడ కూర్చుని వుండడంవల్ల వృధాగా కాలహరణ మాత్రోందనిపిస్తూండేది. మొదట వెళ్ళి అదిల్ శహాన్ సైన్యం మీదపడి అతన్ని ఓడించాలని త్వరపడ్డాడు. కాని—తిమ్మరుసు శత్రువే తమమీద పడడానికి పొంచుకుని సమయంకోసం ఎదురుచూస్తూండగా తాము ఏ ఒక్కతప్పు చేసినా, దాన్నుంచి తమకే అనర్థం సంభవిస్తూండగా తాము ఏవక్క తప్పుచేసినా, దాన్నుంచి తమకే అనర్థం సంభవిస్తుందనీ, తాము అదిల్ శహాన్ సైన్యం మీద పడడానికి వెళ్ళితే నిండుప్రవాహపు కృష్ణను దాటాలనీ, అలాచేస్తే శత్రువుల మీద జయం సంపాదించడం కష్టమనీ, చెప్పాడు. తిమ్మరుసు అనుభవపూర్ణమైన మాటలవల్ల రాయల సమరోత్సాహానికి చల్లటినీరు పోసినట్లయినా అవి విచారించవలసిన విషయాలవడంవల్ల రాయలు వూరకుండిపోయాడు.

ఈ వ్యవధిలో తిమ్మరుసు ఉపాయాంతరంగా, అదిల్ శహాన్ చెవికి ఒక అబద్ధపువార్తపడేలా చేశాడు. అదిల్ శహాన్ అపారసైన్యాన్ని చూసి కృష్ణదేవరాయలు అధైర్యపడి వున్నాడనీ అందువల్లనే అదిల్ శహాన్ మీద పడడానికి బెదరి తటస్థుడుగావున్నాడనీ అదిల్ శహాన్ విన్నాడు. ఇది నిజమనే నమ్మిఅతడు ఒక పెద్ద అవివేకపు పనిచేశాడు. రాయలు తన సైన్యంచూసి బెదరి కూర్చునివుండడంవల్లనే, తమమీదపడ డానికి వెనుకముందాడుతున్నాడు. రాయలు భీతావస్థలో వుండగానే, తను నదినిదాటి రాయలసైన్యాన్ని ముట్టడించి తొందరలు కలుగజేస్తే రాయలు శిబిరంనుంచి పారిపోతాడని

తనకు అఖండవిజయం లభిస్తుందని భావిస్తున్నాడు. దీనికి ప్రోత్సాహకరంగా అదిల్ శహాన్ కుడిభుజంలావున్న సేనాధిపతి, అంకుస్ ఖాన్ అదిల్ శహాను కిలా చెప్పాడు.

"హుజూర్, కృష్ణదేవరాయలు మన సైన్యాన్ని చూసి, చాలా బెదిరివున్నాడు. ఈమాట ఎక్కడచూసినా వినిపిస్తోంది. మనం యిక్కడికివచ్చి మాసం రోజులైనా, ఇంకా మనమీద పడ్రయత్నం చెయ్యకుండా వుండడం చూస్తే ఈ మాటలో సత్యముందని తెలుస్తోంది. కృష్ణదేవ రాయలు, తన పూర్వులకు బిజాపుర సుల్తానులవల్ల జరిగిన పరాభవము, మొదలగు ఇబ్బందులను తలచుకొని తల్లడిల్లి పోయివుండాలి. భయపడి గొర్రెల గుంపులావున్న సైన్యాన్ని నిమిషకాలంలో తరిమివెయ్యవచ్చు. మనం నదిని దాటి, శత్రువుల మీద హఠాత్తుగా పడితే 'విజయమాల' మన కంఠానికే పడుతుంది. ఇదిఖచ్చితం."

అంకుస్ ఖాన్ మాట అదిల్ శహానుకు చాలా ప్రియమైంది. కానీ — అంకుస్ ఖాన్ సలహాను అనాలోచితమని వాళ్ళు అదిల్ శహాను శిబిరంలో లేకపోలేదు. రాజాశ్రయం గల్లైన సలబల్ ఖాక్ మొదలైన వీరులు ఈ సలహాను ఆమోదించలేదు. యుద్ధనిపుణుడైన రాయలు నిశ్చింతగా వుండడంలో ఏదో మోసమిమిడి వుందని వారి వాదన. నిండుగా ప్రవహిస్తున్న నదినిదాటి శత్రువులమీదపడితే శత్రువులచెయ్యి పైబడి ప్రాణం తప్పించుకొని పోవడానికి వీల్లేక తాము శత్రువులకు సులభంగా బలైపోతామని వారి

వాదించాడు. స్వయంగా సుల్తానే యుద్ధానికి త్వరపడు తుండడంవల్ల సలబల్ ఖాను మాటను ఎవరూ లక్ష్యపెట్టలేదు.

అదిల్ శహాన్ అజ్ఞ ప్రకారం ఒకరోజురాత్రి అతని సైన్యమంతా నది ఎక్కువ లోతులేని ప్రదేశంలోదిగి దక్షిణ తీరంచేరింది. పదాతిసైన్యమూ, భిల్లులూ, సశస్త్ర యుద్ధ భటులూ, అశ్వ, గజసైన్యాలు నదిని సురక్షితంగా దాటి వచ్చాయి నదిమరొకవేపులో అదిల్ శహాను సైన్యశిబిరాలు వేయబడ్డాయి.

ఇది అతడుచేసిన అవివేకపు పరమావధి అనేచెప్పాలి. వాళ్ళునదిని దాటి యీప్రక్కకు వచ్చినది గొర్రె కసాయి వాడిని వెతుక్కుని వచ్చినట్టే అయింది. అదిల్ శహాను చేసిన అవివేకంవల్ల కృష్ణదేవరాయల పని సులభమైంది. ఇక విజయం సిద్ధమని రాయలు మనసులోనే సంతోషించాడు.

## 6

రాత్రంతా శిబిరంలో ఎవరికీ నిద్రలేదు. కృష్ణదేవ రాయలు మొదలుకుని సామాన్య సైనికుల వరకూ అందరికీ యుద్ధపు గడబిడ — సంరంభం. మరుసటిరోజు వేకువ ఝాముకే అదిల్ శహాను సైన్యం మీద దండెత్తాలని రాయలు నిర్ణయించాడు. రాయల నిర్ణయాన్ని సైనిక శిబి రంలో కొమ్ము, కాహళుల మూలంగా వెల్లడించ బడింది. ఎక్కడ చూసినా ఉత్సాహం తాండవమాడుతూ వుంది.

సైనికులకు ఎప్పుడు శెల్లవాగుతుందో, సైనికులను నిశ్శేషం చేయటానికి ఎప్పుడు వెళ్ళుతారో అన్న ఆతృత.

శిబిరంలో ఎవరికీ మనస్సు స్థిమితంగా లేదు. అందరికీ మరుదినం రానున్న యుద్ధంలో ఏమౌతుందోనన్న కళవళం. విజయమేమో తమదేనన్న నమ్మకవున్నా యుద్ధపు మాట యిలా అని చెప్పడానికి సాధ్యంలేదు! చివరివరకూ ఓటమి పొందుతున్నట్లే కనిపించినా, ఎన్నోసార్లు విజయంతో యుద్ధం పరిసమాప్తి పొందడమూ, ప్రారంభంలో జయమైనట్లే కనిపించి అంత్యంలో అపజయం కల్గుతూండడమూ యుద్ధంలో ఆశ్చర్యమైన విషయం కాదు చివరి ఘడియలో ఒకవ్యక్తి ధైర్యసాహసాలతో యుద్ధ నిర్ణయం కావచ్చు. యుద్ధమంటే దైవపు ఒక ఆట. అందులోని జయాపజయం లతని అధీనములు. ఈ జయాపజయాలను నిర్ణయించునదతడే కానీ మనుష్యులుకాదు! అందువల్లనే సైనికుల కందరికీ ఏమి కానుందో నన్న కళవళం పీడించసాగింది.

ఇలావున్నా శిబిరంలో ఉత్సాహవంతులకు గూడా కొదువ లేదు. కొన్ని సార్లు యుద్ధంలో ప్రముఖపాత్రవహించి యశోవంతులైనవారూ — నవ యువకులూ యుద్ధవిషయంలో ఆశావాదులుగానే వున్నారు. తమశక్తిసామర్థ్యాలను ప్రదర్శించడానికి అదొక పక్షానికి యుద్ధంలో కొల్లగొట్టాలన్న ఆశ. మహమ్మదీయసైన్య శిబిరంలోని వైభవం అక్కడ లభిస్తున్న ద్రాక్షారసం, నర్తకీమణుల కీర్తి వినినవారికి మనస్సు లాగుతున్నదీ ఆవైపుకే. శత్రుసైన్యం మీదపడి ఆవేశంతో పోరాడవలయునే కానీ దోపిడీలకు, ఆడవాళ్ళ

జీకం వ్యానికి పోగూడదన్న అభిప్రాయం కొందరిదైతే, భార్యా బిడ్డలను వదలి మృత్యుగహ్వరంలో పడటానికి సిద్ధంగా వుంటేగా, ఈ లోకంలో ఎంత సౌఖ్యమనుభవించవచ్చో అంతా అనుభవించి పోవాలని మరికొందరి అభిప్రాయం. ఇలా వివిధాభిప్రాయ ప్రేరితులై, సైనికులు మొత్తంమీద యుద్ధ సన్నద్ధులు కాసాగారు.

రాయలీ పూర్తిరాత్రినంతా రాబోయే యుద్ధాన్ని గురించే ఆలోచిస్తూ గడిపేశాడు. సైన్యాధిపత్యపు అగ్ర తాంబూలాన్ని ఎవరికివ్వాలి, యుద్ధాన్ని ఎలా ప్రారంభించాలి, రక్షణా వ్యవస్థ, వ్యూహరచన మొదలైన విషయాలలో తన చేతిక్రిందవున్న దండనాయకులతో సమాలోచన చెయ్యడం లోనే రాయులసమయం గడచిపోయింది. తిమ్మరుసు యువకు లను సిగ్గుపరచే ఉత్సాహంలో సైన్యానికి సంబంధించిన అనేక విషయాలలో తల దూర్చి పగలు రాత్రి అనకుండా కష్టపడుతున్నాడు.

సూర్యోదయానికి పూర్వమే అన్ని ఏర్పాట్లూ సంపూర్ణం కావలసివుంది. అందువల్లే రాత్రంతా శిబిరంలో తేనెటీగల్లా తిరుగుతూ పనిచేస్తున్నారు; సందడి చెప్పసాధ్యం కాదు. తమ బాణాలు, విల్లులు మొదలైన శస్త్రాస్త్రాలను సిద్ధ పరచుకునేదొకరో, తమ వాహనాలైన ఏనుగులు, గుర్రాలు, ఒంటెలను సింగారించి సిద్ధపరచడంలో మునిగిపోయారు అందరూ. ఎంతచేసినా ముగిసిపోనిపనులు యింకా వుండనే వున్నాయి.

వేకువఝామునకే, సూర్యోదయమవడానికి ముందే సైన్య శిబిరాన్ని విడచి వెళ్ళవలసివుంది. రాయలు దండ నాయకులను రావించుకుని సభచేసి, శ్రీరంగపట్టణపు మాండలీకుని కుమారుడైన వీరయ్యకు సైన్యాధిపతి పట్టం కట్టి అగ్రతాంబూల మిచ్చి మరుదినపు నాయకుడని ఘోషించాడు.

యుద్ధానికి వెళ్ళక ముందు యుద్ధంలో తమకు జయం లభించాలని దేవతల ప్రార్థన. అనంతరం యుద్ధపు అభిమాన దేవతలకు నరబలి. ఇది జరిగినతర్వాతనే యుద్ధానికి ప్రయాణం.

యుద్ధాభిమాన దేవత ప్రీత్యర్థంగా, రణస్తంభము నొక దానిని స్థాపించడమైనది. దానిని కుంకుమాక్షింతలతో పూజించడమైనది. పురోహితులు వేదమంత్రాలను ఘోషించి, రణకంబంలో దేవీ ఆవాహనచేశారు. అనంతరం తనకుతానే 'బలిపశు' వవడానికి సమ్మతించిన వ్యక్తిని వైభవంతో తీసుకురావడమైనది. అతడు రక్తవర్ణపు వస్త్రాలను ధరించి, తలలో ఎర్రటి రకరకాల పూలను చుట్టివున్నాడు. నుదుటినిండా కుంకుమలేపను అతడు రక్తంలో ముంచిన కత్తిని ఝుళిపిస్తూ, కంఠానికి దాసాని పుష్పముల మాలను వేసుకుని, రణవాద్యాలకు తగినట్టుగా నృత్యంచేస్తూ సశరీరుడు గానే స్వర్గానికి వెళ్ళేవాడిలా ఆవేశంలో మైమరచివున్నాడు. అతడు దేవిని అనన్యభక్తితో సేవించి నమస్కరించి, ప్రార్థన చెల్లించి, అనంతరం రణకంబపు సమీపానికివచ్చి మోకరిల్లాడు. అందరూ అతనిమీద పుష్పవృష్టి కురిసించారు.

అనంతరం రణకంబపు సమీపమునచే స్థాపించిన మరొక కంభాన్ని నంది, దానికొనకు భైరవుని శిరసు భద్రంగా బిగించి కట్టడమైనది. ఇప్పుడు రణవాద్యాలు మరొకసారి భయంకరంగా మ్రోగాయి. భేరి, కహాళి, కొమ్ములను చెవులు చిల్లులుపడేలా ఊదడమైనది. రణోన్మత్తులైన సైనికులు జయఘోష చేశారు. వాళ్ళుచూస్తూండగానే ఒక సైనికుడు వచ్చి రణకంభం వద్ద నిల్చున్నాడు. తన ఒరలోనుంచి ఖడ్గాన్నిలాగి మహాదుసాహస్త కత్తిని రణకంభానికి తాకించి, కత్తిని విసిరాడు. ఆదెబ్బకు భైరవునితల క్షణార్థంలో మొండెంనుంచి వేరై వాల్చివున్న కంభం నిటారుగా నిలబడి రణకంభపు మకుటమణిలా శోభించసాగింది. భైరవుని దేహం నేలకొరిగి రక్తపుకాలువ ప్రవహించింది.

రాయలు తన సర్వసైన్యానికీ ముందుకు నడవడానికాజ్ఞయిచ్చాడు. సైనికులు పెళ్ళివాళ్ళలా నియతగతిలో నడువసాగారు.

సూర్యోదయమైన కొంతసేపటికే రెండుసైన్యాలూ ఒకదానినొకటి సంధించాయి. అందరికంటే ముందుగా వెళ్లుతున్న కుమార వీరయ్యదళం భయంకరోత్సాహంతో శత్రువులమీదపడింది. వాళ్ళు చేతికిచిక్కిన శత్రువులను, కత్తి, ఈటె, బల్లెము, విల్లు బాణాలతో ఖండించి చెండాడారు. దీనివల్ల శత్రుసైన్యం కొంతసేపుగాభరా పడిపోయింది. అప్పుడు అదిల్‌శహాన్ సేనాధిపతులకు మరేమిచెయ్యడానికీ తోచక ఆత్మరక్షణకని నిలిపివుంచిన ఫిరంగులను ప్రయోగించసాగారు. హఠాత్తుగా కురువసాగిన గుళ్ళవర్షాన్ని ఎదు

ించలేక రాయలసైన్యం పండుటాకుల్లా నేలకు రాలిపోసాగింది. ఇలాజరగడంవల్ల తక్కినసైన్యానికి భయంజనించి ప్రాణంమీద ఆశతో యుద్ధరంగంనుంచి వెనకకు పారిపోసాగింది. ఈసమయంచూసి ఆదిల్‌శహాను సైనికులు చేతికి చిక్కిన రాయలసైన్యాన్ని హతమార్చడానికి వాళ్ళను వెన్నంటివచ్చారు. రాయలసైన్యం చెల్లాచెదురై శత్రువుల చేతికిచిక్కి అన్యాయంగా హతమైపోయింది. ఇదిచూసిన కృష్ణదేవరాయలకు విపరీతమైన కోపంవచ్చింది. అతను వెనుదిరిగి పారిపోతున్న తన సైనికుల కెదురుగా గుర్రాన్నిపోనిచ్చి గంభీర కంఠస్వరంతో గర్జించాడు.

"రణభీరువులారా! పారిపోతున్నారెందుకు? మీ శౌర్యానికేధిక్కారం! మీరు పురుషులేనా? చేతిలోపట్టుకుని వున్నది ఖడ్గమని చెప్పడానికి మీకు సిగ్గులేదా! మీరు రణరంగంనుంచి పారిపోయినా ప్రాణం మిగులుతుందని భావించారా? ఇదిగోవినండి... మీరుముందుకు వెళ్ళితే శత్రువుల చేతిలో హతమౌతారు! ఇదిఖండితం! దీనివల్ల మీప్రాణమెలాగూ మిగులడంలేదు! యుద్ధానికి వచ్చినా మీకింకా ప్రాణంమీద ఆశా?... ...ధీరులుగా వర్తించండి! మీకూ మిమ్మల్ని కన్నవారికీ కీర్తినితెండి! పిరికితనంవల్ల మీసర్వమూ నాశనమౌతుంది. ఓ వీరపుత్రులారా లేవండి! భయపడకండి యుద్ధంచేసి మరణిస్తే వీరస్వర్గం. బ్రతికివస్తే శత్రువులను జయించిన కీర్తి! వీటిలో ఏదికోరుకుంటారో కోరుకోండి? ముందుకుదూకండి! శత్రువులను యమపురికి పంపండి! ఈ పవిత్రకార్యంలో నశ్వరమైన ఈదేహం నశించిపోనీ. ఎప్పటి

నైనా నశించిపోయే ఈ దేహాన్ని దేశహితంకోసం బలిదానంచెయ్యండి. ఓకర్ణాటాంధ్ర వీరపుత్రులారా! పదండి. ముందుకు పదండి! ఖడ్గాన్ని పట్టుకోండి!" అని ప్రోత్సహించాడు. రాయల వీర ప్రబోధాన్ని విని సైనికుల శరీరాల్లో విద్యుత్ప్రసారమైనట్టయింది. వాళ్లు ప్రాణం మీది ఆశనువదలి రాయలననుసరించారు.

వాళ్ళకు నాయకుడుగా తిమ్మరుసు కుమారుడు గోవిందరాజు ముందుకువచ్చాడు.

పారిపోతున్న సైన్యం ఒక్కసారిగా హఠాత్తుగా తనను ఎదురించడంచూసి అదిల్‌శహాన్ సేనకు ఆశ్చర్యమైంది. రాయల సైనికులు ఆవేశం వచ్చినవారిలా శరీరం మీద హెచ్చరిక లేకుండా ఎదురుపడిన సైనికులమీదపడి వాళ్ళను మార్కొని పోరాడారు. ప్రాణాశవదలి వీరావేశంతో పోరాడుతున్న రాయల భటులచేతికిచిక్కిన సైన్యం చిన్నాభిన్నమైపోయింది. వాళ్ళదెబ్బలకు తట్టుకోలేక శత్రుసైన్యం తల్లడిల్లిపోయింది. వాళ్ళురాయల సైన్యాన్ని ఎదురించలేక——కత్తిపట్టుకున్న వారంతా——యుద్ధరంగంలో మరణించారు. తక్కినవారు ప్రాణంమీద ఆశతో యుద్ధభూమిని వదలి పారిపోయారు. కేవలం కొన్నినిమిషాల క్రితం సుల్తాను సైన్యానికి విజయం లభిస్తుందన్నట్టుగా వుండిన పరిస్థితి హఠాత్తుగా అడ్డంతిరిగింది. రాయల సైన్యప్రహారాలను ఎదురించలేక, అదిల్‌శహాను సైన్యం ధైర్యం కోల్పోయి దిక్కులపాలై అస్తవ్యస్తంగా పారిపోయింది. తమను వెన్నంటి వస్తున్న రాయలసైనికుల చేతినుంచి తప్పించుకునే ఆతురతలో తాను

ఏమిచేస్తున్నామన్నది కూడా ఆలోచించకుండా పరుగెత్తారు. వాళ్ళు ముందువెనుక లాలోచించకుండా తమనాయకుడు పరుగెత్తినవైపు పరుగెత్తసాగారు. తమనాయకుణ్ణి వెన్నంటి వచ్చినందుకు వాళ్ళకు దొరికిన ప్రతిఫలం? తీవ్రమైనహాత్య.

రాయల సైనికులు అదిల్‌శహాన్ సైన్యాన్ని తరుముకుని వచ్చారు. వాళ్ళఒత్తిడిని తప్పించుకోలేక సుల్తాను సైన్యం పరుగెత్తిపరుగెత్తి నదివద్దకువచ్చిచేరింది. తామెంతటి చిక్కులో తగుల్కున్నదీ వాళ్ళకు తెలిసివచ్చింది గోవింద రాజు కావాలనే ఈ విధమైన వ్యూహాన్ని రచించాడు. శత్రువులను మూడువైపులనుంచీ వెంబడించి వచ్చి, వాళ్ళు మరెక్కడికి వెళ్ళడానికి వీలులేకుండాచేసి నదిగుండా వెళ్ళేలా చేసిన అతని పన్నుగడ ఫలవంతమైంది.

శత్రువులు—తమ ప్రాణాన్ని దక్కించుకోడానికి వచ్చినవాళ్ళు యిప్పుడు నది ఒడ్డునచేరారు. మూడువైపుల నుంచి తమమీాద గుళ్ళవాన కురిపిస్తూ, ఈటె, బల్లెములతో పొడుస్తూ యమదూతల్లా వెన్నంటివస్తున్న రాయలసైన్యం, మరొకవైపున నిండుగా ప్రవహిస్తున్న కృష్ణ. వాళ్ళ దురదృష్టానికి తగినట్టుగా ఆప్రదేశంలో నదిచాలా లోతుగానూ విశాలంగానూ వుంది. వాళ్ళకు మరేమీా తోచక జ్ఞానకుంది తులై ప్రాణంమిగిలించుకోవడానికి నదిలోని నీటిలోదుమికారు.

అక్కడికి వాళ్ళకథ ముగిసినట్టే అయింది.

మునుపే లోతుగా పారుతున్న నీటి ప్రవాహానికి చిక్కుకుని చాలామంది మరణించారు. మరికొందరు ప్రవాహ వేగాన్ని తట్టుకోలేక దానిలో కొట్టుకుపోయారు.

ఈదుతున్న సైనికులు తమశక్తినీూరి నదిని దాటడానికి ప్రయత్నిస్తున్నారు. ఈవేళకు రాయల యుద్ధఘోటేనుగులు నీటిలోకిదిగి నదిలో పడినవారిని తమ తుండములతో ఎత్తి కొట్టి, తమ కోరదంతాల కమర్చిన పదునైన కత్తులకు బలి యిస్తూ నాశనంచేశాయి. అంతే చాలదన్నట్టుగా అస హాయులై నీటిలోపడిన సైనికులను సురక్షితంగా ఒడ్డున నిల బడివున్న రాయలసైనికులు బాణాలతో, పెద్దపెద్దరాళ్ళతో చేపలను వేటాడేలా వేటాడారు.

అంతలో అక్కడికి వచ్చినరాయలకు శత్రుసైన్యానికి వచ్చిన దురవస్థనుచూసి కనికరమైనది. సైనికుల భయంకర హత్యను ఆపచెయ్యడానికి నిర్ణయించాడు. రాయల కరుణ వల్ల నీటిలో పడినభటులు కొందరు ప్రాణాలతో మిగిలారు. మృత్యుగహ్వరంలోవున్న ఆ నిర్భాగ్యులకు జీవనదానం లభించింది. వాళ్ళుధైర్యంగా నదిని దాటి ఒడ్డును చేరు కున్నారు. పట్టుబడినవారిని ఉచితరీతిలో చూచుకోవడానికి రాయలు తనసైనికులకు ఆజ్ఞాపించాడు.

అక్కడనుంచి బయలుదేరడానికి ముందు తనకు లభిం చిన జయాని కంతటికీ గోవిందరాజు బుద్ధికుశలతే కారణమని అతణ్ని గాఢాలింగనం చేసుకుని, అతని శౌర్య సాహసాలను ప్రశంసించాడు. రాయల నోటినుంచివచ్చిన తన కీర్తి గానాన్ని విని గోవిందరాజు మూగవాడేఅయ్యాడు. రాయల నిష్పక్షపాతబుద్ధికి ఇదినిదర్శనం. రాయలు గోవిందరాజును సన్మానించి, వీరోచితమర్యాద చేశాడు.

ఇప్పుడు ఒక క్షణకాలాన్నిగూడా వ్యర్థంచేసేందుకు లేదు. శత్రుసైన్యం శరణురావడంతో యుద్ధం ముగియలేదు. వాళ్ళశిబిరాలను వశపరచుకో వలసివుంది. అంతేకాక అదిల్ శహాన్ యుద్ధంలో మరణించాడా? పారిపోయాడా? అన్నది యింతవరకూ తెలియలేదు. అది తెలుసుకోవడానికి రాయలే సైన్యసమేతంగా అతని శిబిరం వైపువెళ్ళాడు.

బిజాపుర సైనిక శిబిరాలు నాయకులులేక అస్తవ్యస్తంగావున్నాయి. వాటినివిడచి శత్రువులు పారిపోయారు. వాటిని వశపరచుకోవడానికెక్కువ కష్టంకాలేదు. అదిల్ శహానుని రాజభవన సదృశ్యమైన శిబిరవిలాసం, శ్రీమంతపు వైభవాలు రాయలను ఆశ్చర్యపరచాయన్న తర్వాత ఇక వాటివిషయంలో చెప్పడానికేముంది! రాయలు ఆ రాత్రిని అక్కడే గడపడానికి నిశ్చయించాడు—

రాయలు అక్కడి హంసతూలికా తల్పం మీద పడుకున్నాడు. అతనికి సూర్యోదయమైన తర్వాతే మెలకువ వచ్చింది. యుద్ధం వల్ల ఆయాసపడిన రాయలకు అంతటి గాఢమైన నిద్రవచ్చింది.

# 7

కృష్ణదేవరాయలు ప్రాతర్విధులను తీర్చుకుని శత్రుశిబిరాన్ని చూడడానికి వెళ్ళాడు. శత్రుశిబిరంలో దొరికిన సంపద అపారమైనది. నాలుగువేల గుఱ్ఱాలూ, నూరారు

ఏనుగులూ, నాలుగు నూర్ల ఫిరంగులూ, తొమ్మిదినూర్ల ప్రేలుడు మందుగలసంచులు దొరికాయి. అంతేకాక లెక్క లేనన్ని శిబిరపు సామానులుకూడా లభించాయి. ఇవి లభిం చడంవల్ల రాయల ముందటి యుద్ధానికి అనుకూలమైంది.

రాయలు త్వరితంగా జరుగవలసిన కార్యక్రమాల పైదృష్టిని మరల్చాడు. యుద్ధంలో మరణించిన వీరులకు అంత్య సంస్కారంచేసి, వాళ్ళకిగా అనేకదాన ధర్మాలను చేశాడు. యుద్ధంలో మిగిలిన సైనికులకు అనేక సంభావన లిచ్చి, ఉచితరీతిగా సన్మానించాడు. అనంతరం యుద్ధంలో పట్టుబడినవారిని విచారించడానికి వెళ్ళాడు.

యుద్ధంలో అదిల్‌శహాను సైన్యం సగానికంటే ఎక్కువ మరణించింది. లేదా సైనికులు కాళ్ళు చేతులు పోగొట్టుకుని, విపరీతమైన గాయాలు తగిలి వ్యధపడు తున్నారు. అలాంటివారి ఆరోగ్యానికిగా తగినఏర్పాట్లు చేసి, ప్రాణాలతో పట్టుబడినవారిని అవమానపరచకుండా వాళ్ళను గౌరవంగానే చూసుకున్నాడు. యుద్ధంలో పట్టుబడిన అనేక మందిసర్దార్లూ, దండనాయకులపైకి ప్రసిద్ధుడైనవాడు సలబత్ ఖాన్ అనేవీరుడు.

సలబత్ ఖాన్ బిజాపుర సుల్తానుని ప్రముఖసేనాను లలో ఒకడు. యుద్ధరంగంలో అతనిముందు నిలబడే వీరు డెవడూలేడు. సలబత్ ఖాన్ వున్నచోట జయం సిద్ధమనే ప్రతీతివచ్చేంతమట్టుకు యుద్ధకళలో అతడు నిష్ణాతుడయ్యాడు. అతనివద్ద అయిదువందలమంది పోర్చుగీసు సైనికులున్నారు. వాళ్ళుమందుగుండ్లను ప్రేల్చడంలో సుశిక్షితులైనవారు.

సలబత్ ఖాన్ రాయలసైన్యాన్ని మందుగుండు సామాగ్రితో తల్లడిల్లేలా చేసి, యుద్ధరంగంనుంచి వెనుకకు పారిపోయేలా చేసినవాడు. కానీ — రాయలు పారిపోతున్న సైనికులను ప్రోత్సహించి శత్రుసైన్యంమీద పడేలాచేసిన తర్వాత, వీరావేశంతో పోరాడిన రాయల యుద్ధభటుల దెబ్బలకు తట్టుకోలేక శత్రుసైన్యం బెదరి పారిపోవడానికి ప్రారంభించింది. అప్పుడు పారిపోతున్న సైన్యాన్ని చేరు్చకుని సలబత్ ఖాన్ రాయల సైన్యంమీద పడి చేతికి చిక్కిన వారిని తన ఖడ్గానికి బలియిస్తూవచ్చాడు. అప్పుడు గోవింద రాజువచ్చి ఇతణ్ణి ఎదురించాడు. ఇద్దరూ రణధీరులు. కర లాఘవంలో సిద్ధహస్తులు. ఎవరుగెల్తురో వూహించడమే కష్టమైపోయింది. మొదటమొదట సలబత్ ఖానుని పై చెయ్యిగా తోచింది. కానీ, అధికసంఖ్యలోవున్న రాయల సైన్యం సలబత్ ఖానుని సైన్యాన్ని చుట్టుముట్టి చంపుతూ వచ్చారు. గోవిందరాజు ఉత్సాహంతో విసిరిన ఖడ్గపుధాటికి సలబత్ ఖానుని గుఱ్ఱం నేలకుదొర్లింది. అతడు మరొక గుఱ్ఱాన్నధిష్ఠించకముందే గోవిందరాజు అతని ఖడ్గాన్ని ఎగురగొట్టాడు. సలబత్ ఖానును చంపకుండా చేజిక్కించు కోవాలని గోవిందరాజునిఆశ. తను మరణించినా చింతలేదు. పట్టుపడకూడదని నిశ్చయించుకున్నాడు సలబత్ ఖాన్. కానీ, అతని నిర్ణయం సఫలంకాలేదు.

చివరికి సలబత్ ఖాన్ గోవిందరాజు చేతిలోపట్టుబడ వలసివచ్చింది. అతడు ఒక్కడు పట్టుబడినందుకు గోవింద రాజుని వెయ్యాొరు సైనికులు హతులైనారు.

రాయలకు సలబత్ ఖాన్ అసాధారణ శౌర్యాన్ని విని అతని విషయంలో గౌరవమేర్పడింది. అతణ్ని వీరోచితంగా ఆహ్వానించి ఉదితరీతిగా గౌరవించాడు. అతడు యుద్ధఖైదీ కావడంవల్ల విధిలేకుండా చెఱసాలలో వుంచాడు.

సలబత్ ఖానుని శౌర్యం చూచినతర్వాత, అలాంటి వీరులుపదిమంది తన మీాద దండెత్తితే తనసైన్యం నామావశేష మౌతుందని రాయలు భావించాడు.

రాయలకు అదిల్ శహాను వైపు మనస్సు మరలింది. అతడు ఏమైనదీ యింతవరకూ తెలియలేదు. రాయలీ విష యమై విచారిస్తూండగనే తిమ్మరుసు విషయసంగ్రహణ చేసుకుని రాయల వద్దకు వచ్చాడు.

అదిల్ శహాను కృష్ణదాటి రానేలేదు. అతడు సైన్యాన్ని విడిపించేభాధ్యత సలబత్ ఖానుకు అప్పజెప్పి, కృష్ణకు ఆవలివైపుననే యుద్ధాన్ని తిలకిస్తూకూర్చున్నాడు. ఉత్కళగజపతిని ఓడించినరాయలు — దక్షిణాపథపు అనేక చినపెద్ద సామ్రాజ్యాలను పదాక్రాంతచేసుకున్న రాయలు— ఇతర విజయనగరపు రాజుల్లాంటివాడుకాడు, అతన్ని ఓడిం చడం కష్టమని సుల్తాను భావించాడు. యుద్ధంలో విజయం లభిస్తేసంతోషం ఒకవేళ అపజయంకల్గితే అప్పుడు తప్పించు కుని పోవడానికి ముందు జాగ్రత్తవహించే, అతడు కొంత మంది ఆప్తమిత్రులతో, చాలినంత ఆత్మరక్షణ భటులతో తన శిబిరాన్ని విడచి రాలేదు. తను యిక్కడేవుంటే తన సైన్యపు అపనమ్మకకు పాత్రుడుకావచ్చునని ఊహించి సైనికశిబిరంలో తనకోసం ఒక భవ్యమైన రాజభవన

మంతటి డేరాను రచించడానికాజ్ఞాపించాడు. కాని, అక్కడికి మాత్రమతడు రాలేదు. ఈ విషయమెవరికీ తెలియకుండా గోప్యంగా వుంచబడింది. అతని ఆప్త మిత్రుల మూలంగా ఆ వైపు జరిగెడి అన్ని సమాచారములూ సుల్తానుకు తెలుస్తుండేవి. సుల్తాను తన శిబిరంనుంచే యుద్ధపు కార్యాచరణ జరిపిస్తూండేవాడు. దీనివల్లనే సుల్తాను సైనికులకు సరైన నిర్దేశన దొరుకక సైన్యంలో అవ్యవస్థ తలచూపింది.

మొదట బిజాపురసుల్తానుకు జయంకల్లేలా తోచింది. సుల్తాను సైనికులు వీరావేశంతో పోరాడి రాయల సైనికులను తరుముకుని వెళ్ళినప్పుడు తన కంఠానికే జయమాల పడుతుందని అదిల్‌శహాను భావించాడు కానీ, ప్రవాహపు దిక్కు హఠాత్తుగా అడ్డుతిరిగినట్టు యుద్ధపు స్వరూపమే అడ్డు తిరిగింది. రాయల సైన్యానికి అఖండ దిగ్విజయం లభించింది.

అదిల్‌శహానుకు రాయలచేతినుంచి తప్పించుకొని నదిని దాటి వచ్చినవారివల్ల జరిగిన విషయాలన్నీ తెలిసి, ఇక తను అక్కడవుంటే ప్రాణానికే అపాయమని భావించి, అతడు తన అనుచరులతోసహా పారిపోయి తలదాచుకొన్నాడు.

"ఇప్పుడు మనం ఉదాసీనం చేయకూడదు ప్రభూ! మనం మొదట రాయచూరును ముట్టడించి వశపరచుకోవాలి. తలదాచుకునివున్న అదిల్‌శహాను రాయచూరు రక్షణకని, కొద్దోగొప్పో మిగిలిన తన సైన్యాన్ని సంగ్రహించుకొని వచ్చి మనమీద పడవచ్చు. అప్పుడు రాయచూరును గెలువడం కష్టతరం కావచ్చు. ఇప్పుడు పరిస్థితి మనకనుకూలంగా

వుంది. మన మిప్పుడు రాయచూరును ముట్టడిస్తే అది సుల భంగా మనవశమౌతుంది.” అని తిమ్మరుసు తన ఆలోచనను రాయలముందు వెల్లడించాడు.

కృష్ణదేవరాయలకుకూడా ఈ సలహా నచ్చింది. విశ్రాంతి నెపంతో తాము రాయచూరును ముట్టడించడాని కాలస్యంచేస్తే, ముందుకు తమకు విపత్తు సంభవించవచ్చు నని గ్రహించి వెంటనే తన సైన్యాన్ని రాయచూరు ముట్ట డికి సిద్ధంకావాలని ఆజ్ఞాపించాడు.

రాయచూరు ఎత్తైనప్రదేశంలోవున్న నిగ్గమైన దుర్గం. దానికిచుట్టూ మూడు వలయాల కోటవుంది. వెలు పలి కోటను రాళ్ళతో నిర్మించారు. కోటక్రింద భద్రమైన భూగర్భపుకోట. ఈకోటలో సంవత్సరపు అన్నికాలాలలోనూ నీటితోనిండి ప్రవహిస్తున్న ఒక ఊటచలమ వుంది. ఇది పుర జనులకు కావలసిన నీటిని యిస్తుండేది. ఈ లోపలికోటలో ఒకటి రెండు సంవత్సరాలకు కావలసిన ఆహారసామగ్రులు దాచిపెట్టబడ్డాయి. అదిల్‌శహాను కృష్ణదేవరాయల దృష్టి రాయచూరుమీద పడుతుందని మునుపే గ్రహించి వుండడం వల్ల అక్కడ ఒక సువ్యవస్థిత సైన్యాన్నీ, అపారమైన మందుగుండు సామానులనూ సిద్ధపరచివున్నాడు. దుర్గపు కొమ్మలమీద రెండునూర్ల భారీఫిరంగులనువుంచి దానిని రక్షించడానికి అనుభవవంతుడైన ఒక దళపతిని నియ మించాడు. ఇలావుండగా అది సులభంగా రాయల వశ మయ్యేలా కనపడలేదు.

రాయలసైన్యం కోటసమీపంలోనే ఠాణావేసింది. సైన్యం లోపలికోటగోడను సమీపించడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలము లయ్యాయి. కోట గోడలపైనుంచి శత్రువులు మందుగుండులనూ, బాణాలనూ, రాళ్ళనూ వర్షంలా కురిపిస్తూ రాయలసైన్యం ఒక్కఅడుగు కూడా ముందుకు వెయ్యకుండా చేసింది. రాయలు ఏదిక్కునుంచి కోటను సమీపించడానికి వీలుగా వుందోనని చుట్టూ చూచుకుని వచ్చాడు. అన్నివైపులా పెద్దపెద్దఫిరంగులను వుంచి వున్నారు. అందువల్ల ఏవైపునుంచీనూ కోటను సమీపించడానికి సాధ్యంలేకపోయింది. రాయచూరు కోట వద్ద రాయలు మూడునెలలకాలం పోరాడినా కోటలోని ఒక్కరాతినిగూడా కదిలించలేకపోయాడు. తనముట్టడి ఈ విధంగా జరిగితే దీనిని వశపరచుకోవడానికి కనీసం ఒక సంవత్సరమైనా పడుతుందని రాయలు భావించాడు. రాయచూరుదుర్గాన్ని వశపరచుకోవడానికి ఒకసంవత్సర కాలాన్ని వినియోగిస్తే రాయల తక్కిన ఆశయాలు కార్యగతం కావలసివస్తే చాలా సంవత్సరాలే అవసరమయ్యేవి. ఊరకనే రోజులు గడచి పోతున్నాయికదా అని రాయలు వ్యాకులపడ్డాడు. ఈవిషయాన్ని గురించి చింతిస్తూ వుండగానే అక్కడికి తిమ్మరుసు వచ్చాడు.

"ప్రభువులెందుకో చాలావిచారంగా వున్నట్టున్నారు. ఆవిచార మేమిటో తెలియపరచేట్టయితే, పరిష్కరించడానికి సాధ్యమైనంతవరకూ ప్రయత్నిస్తాను."

"నన్ను వేధిస్తున్న చింత ఏమిటన్నది. అప్పాజీగారికి కూడా తెలిసేవుంటుంది. నేను రాయచూరు ముట్టడి ఇంత దీర్ఘమౌతుందని అనుకోలేదు. మనం ఇక్కడ దండువిడిసి మూడు నెలలయింది. ఇప్పటికి కోటగోడలోని ఒక రాతినిగూడా కదలించ లేక పోయామన్నమీదట దుర్గాన్ని ఆక్రమించు కోవడానికి మనకు చాలా సంవత్సరాలే కావలసి వస్తాయి"— రాయలు ఖిన్నుడయ్యాడు.

"దీనికెందుకు ప్రభువులింత చింతించాలి? ఇక కొన్ని రోజుల్లో దుర్గం మన వశమైనట్టే ననుకోండి. ఈవేళకప్పుడే శత్రువులు చల్లబడిపోతూ వస్తున్నారు. వాళ్ళా ఎంతకాలం కోటను యిలా రక్షించడానికి సాధ్యమౌతుంది? ఈ రోజు కాకపోతే రేపైనా కోట మన వశంకావల్సిందే. ఇది ఖచ్చితం!"

"ఈ కోట ఒకటి మన వశమైతే నా కనేక ఆలోచనలను కార్యగతం చెయ్యడానికి అనుకూలమౌతుంది. బిజాపుర సుల్తానును అతని అంతఃపురంలోనే ఖైదుచెయ్యాలన్న ఆశ నాది—మన సైన్యపుశక్తి—శస్త్రాస్త్రాలూ ఈ ఒక్క కోటను ముట్టడించడంలో వినియోగమైపోతే, మనం బిజాపురంమీద దండెత్తేవేళకు శక్తిగుంది దుర్బలమై పోతాము. ఇప్పుడు మనం గడిపివేస్తున్న ప్రతిక్షణమూ అమూల్యమైనది. మన మిక్కడ ఆలస్యంచేసినంతా శత్రువులబలం వృద్ధి అవుతుంది కదా అన్నదే నాచింత."

"తమరీ విధంగా చింతించకూడదు ప్రభూ! ఇక మాసంరోజుల లోపల ఎలాగైనా చేసి, ఈముట్టడిని పూర్తి

చెయ్యాలని అన్ని ఏర్పాట్లను చేస్తున్నాను. తమరీ విధంగా ఏ ఆలోచనా చెయ్యకుండా నిశ్చింతులుగా వుండండి. దుర్గపు ముట్టడి అగ్రతాంబూలాన్ని నాకివ్వండి.'' అని చెప్పి, ప్రభువులనుంచి అగ్రతాంబూలం పుచ్చుకునే అక్కడ నుంచి కలుతీశాడు తిమ్మరుసు.

ప్రభువులకు మాట యిచ్చిన తర్వాత తిమ్మరుసు తన శిబిరానికి వచ్చి దుర్గాన్ని ఎలా ముట్టడించి వశపరచుకోవడమా అని ఆలోచిస్తూవుండగనే ఒక భటుడు కనిపించి తిమ్మరుసును కలుసుకోవడానికి ఎవరో విదేశీయులు వచ్చి వున్నట్టుగా తెలియ జేశాడు.

తనను యుద్ధరంగంలో కలుసుకోవడానికి వచ్చివున్న విదేశీయులెవరని చూడడానికి తిమ్మరుసే లేచి వచ్చాడు. వెలుపల తిమ్మరుసుని పూర్వ పరిచయస్తుడైన క్రిస్టఫర్ ఫిగైరోడ్ అనే పోర్చుగీసు సరదారు తిమ్మరుసుకోసం కాచుకుని వున్నాడు. అతడు తిమ్మరుసును చూడగానే విదేశీయపద్ధతిలో 'ఏకహస్తవందనం' చేసి గౌరవించాడు. అనంతరం తిమ్మరుసు అతన్ని కుశల ప్రశ్నచేసి లోనికి పిలుచుకుని వచ్చి ఆసనమిచ్చి గౌరవించాడు.

ఫిగైరోడ్ కృష్ణదేవరాయల పాత మిత్రుడు. అతడు ఒక పోర్చుగీస్ వ్యాపారి. గడచిన నాలుగైదు సంవత్సరాల నుంచి అతడు విజయనగరంలో వుండినవాడు. అతడు అశ్వవిద్యా పారంగతుడు. గుఱ్ఱపు వ్యాపారంలో సిద్ధహస్తునివలెనే నిపుణుడు. అతడు కొన్నిమాసాల క్రితం రాయల ఆదేశానుసారంగా ఓమెజాన్‌కు గుఱ్ఱాలను తీసుకు రావ

డానికై వెళ్ళినవాడు అప్పుడే ఓమొజాన్‌నుంచి ఉత్తమాశ్వాలతో గోవా రేవుపట్టణానికి వచ్చి చేరాడు. గుఱ్ఱాలకు ముందుగా కొంత డబ్బిచ్చి, మిగిలిన పైకం గుఱ్ఱాలు బందరుకు వచ్చిచేరగానే యిచ్చు నట్లుగా ఒప్పందంజరిగింది. ఆ ఒప్పందం ప్రకారం సిద్ధిమర్కారుచేత నల్భై వేల వరహాల నిచ్చిపంపాడు. కానీ—సిద్ధిమర్కార్ డబ్బుతో సహా పరారీ అయ్యాడు. అనంతరం రాయలు బిజాపురసుల్తాను మీద యుద్ధంఘోషించి, రాయచూరు ముట్టడిని ప్రారంభించాడు. కారణాంతరాలతో ఓమొజాన్ నుంచి రావలసిన గుఱ్ఱాలు గోవాకు రావడానికి రెండుమూడు నెలలు ఆలస్యమయ్యాయి. ఫిగ్రెగోడ్ గోవాకు వచ్చేవేళకు డబ్బుతో ఎవరూ అక్కడ లేరు. రాయలు బిజాపురానికి వెళ్ళినసంగతి విని నేరుగా యిక్కడికే వచ్చాడు. కానీ—అతడు ఒంటరిగా రాలేదు. తను యుద్ధంలో మగ్నమైవున్న రాయలను సందర్శించ డానికి వెళ్ళుతున్నది. సమయంవస్తే రాయలకు తన సహాయం అవశ్యంకావలసి రావచ్చునని అతడు ముందుగానే ఆలోచించి, చతురంగబలాలతో రాయచూరుకువచ్చి విడిశాడు. అతడు తిమ్మరుసుకు తను వచ్చివున్న ఉద్దేశాన్ని తెలియపరచి, రాయలను కలుసుకొనడానికి అపేక్షించాడు. ఇప్పుడు రాయలు యుద్ధంలో నిమగ్నమైవుండంవల్ల మును పటిలా సులభంగా ఎవరు ఎప్పుడుపడితే అప్పుడు రాయలను కలుసుకోవడానికి వీలులేదు. రాయల రక్షణకోసం చాలా జాగ్రత్త వహించబడివుంది. రాయలను కలుసుకోదలచిన వారందరూ, శత్రువేకాని, మిత్రుడేకాని మొదట తిమ్మ

రుసును కలుసుకోవలసి వచ్చింది. అందువల్లనే అతడు తిమ్మ రుసును చూడడానికి వచ్చాడు.

తిమ్మరుసు ఆలస్యం చెయ్యకుండా, రాయలకు ఫిగైరోడ్ వచ్చివున్న వార్తను తెలియజేశాడు. రాయలకు తను యుద్ధరంగంలో వున్నప్పుడే, ఓమెజాన్ నుంచి వెయ్యారు గుఱ్ఱాలు వచ్చినందుకుగా చాలా సంతోషమైనది. అతడు ఫిగైరోడ్‌ను ఆహ్వానించి తన పక్షంలో చేర్చుకున్నాడు.

"తమకోరికలానే ఓమెజాన్ నుంచి ఉత్తమాశ్వాలను తీసుకొచ్చాను ప్రభూ" అని అన్నాడు ఫిగైరోడ్.

"చాలా సంతోషం. వాటిని నాకు వెంటనే స్వాధీన పరచు. బిజాపురయుద్ధంలో వాటి సహాయం నాకు చాలా అవసరం."

"గుఱ్ఱాలింకా గోవాలోనే వున్నాయి. వాటిధర నిర్ణయమైనా, ఇంకా చెల్లించ వలసినపైకం చెల్లించ లేదు ప్రభూ!"

"చింతలేదు. ఎంతడబ్బు చెల్లించవలసివుంది?"

"నలభై వేల వరహాలు."

ఈ మాట విని రాయలు చకితుడైనవాడిలా ఆశ్చ ర్యంగా అన్నాడు : "ఏమిటీ? నలభై వేల వరహాలా? మా భాండాగారంలో వున్న బంగారమంతా మీ దేశానికి కొల్ల గొట్టుకుపోవాలన్న ఆలోచనా మీది?"

"ప్రభువులు అన్యథా భావించకూడదు. ప్రభువుల వద్దనున్న సంపత్తును కొల్లగొట్టి సాగించడానికి ఒకటి రెండు రోజులు కాదు, పదునారు సంవత్సరాలు పడతాయి. కొల్ల

గొట్టడము, సాగించడము మాట అలావుందనీ, తనను ఓడించడానికి భూమండలపు రాజులంతా ఒకట్టై రావాలి కదా!" అని అన్నాడు.

ఈ పొగడిక విని రాయలకు సంతోషమైంది. "వ్యాపారంలో నిపుణుడవైనట్టే మాటల్లోనూ జాణవుగా వున్నావు!" అని నవ్వుతూ అన్నాడు.

"మా జాణతనమంతా వట్టి మాటలతో ముగిసిపోతే అది మా దురదృష్టం ప్రభూ!"

"అలాగంటే?"

"మేము కేవలం వ్యాపారంలో మాత్రమే కాదు. యుద్ధకళలోనూ నిష్ణాతులమైనవారము. ప్రభువులు మా శౌర్యాన్ని యుద్ధంలో ప్రదర్శించడానికి అవకాశమివ్వాలి."

"మిమ్మల్ని కేవలం అశ్వవ్యాపారులని మాత్రమే అనుకున్నాను. ఇప్పుడు సమర విద్యాధురంధరులూ, ప్రభు సేవా పరాయణులూ కూడానని తెలిసి సంతోషిస్తున్నాము."

"కేవలం మెప్పును చూపితే మా మనస్సుకు సంతోషం కల్గదంలేదు ప్రభూ! యుద్ధంలో మా శక్తిసామర్థ్యాలను చూసి మెచ్చుకుంటే సంతోషమౌతుందే కాని యిప్పుడు కాదు."

రాయలు యీ మాటను విని ఏమిటో యోచిస్తున్న వాడిలా వూరుకున్నాడు.

"ప్రభువులు ఎందుకో మాకు యుద్ధంలో పాల్గొనడానికి సమ్మతించడానికి అనుమానిస్తున్నారు. పోర్చుగీసు లెప్పుడూ యుద్ధానికి బెదిరేవాళ్ళు కారు. యుద్ధం వాళ్ళకొక వినోదం!"

"ఫిగ్గెరోడ్ గారూ, మీ ఆశను నెరవేర్చడానికి అడ్డు లేదు. కానీ—యుద్ధమంటే చావుబ్రతుకులతో కూడినపోరాటం. మిత్రుల్లా వచ్చివున్న మిమ్మల్ని యుద్ధానికి పంపించి నేను స్నేహానికి ద్రోహం తలపెట్టడమా?"

"ప్రభువులు మా విషయంలో చూపిన అభిమానానికి మేము ఋణస్థులం. కానీ—ప్రభువులు మమ్మల్ని స్నేహితులని అనుకునేటట్టయితే—స్నేహధర్మంలో మాదికూడా ఒక మాట వుంది. స్నేహితులు చిక్కులలోవుండగా వారికి మన నుంచి అన్యోన్యసహాయం చెయ్యాలని స్నేహధర్మం ఉద్ఘోషిస్తోంది. ఇలావుండగా తమరు మమ్మల్ని యుద్ధానికి పంపడానికి ఏ ఆలోచనా చెయ్యనక్కరలేదు."

"అలాకాదు ఫిగ్గెరోడ్ గారూ, మీరు స్నేహానికిగా ప్రాణాన్ని అర్పించడానికి సంసిద్ధులవడం మీ ఘనతకు నిదర్శనం అయినా మిమ్మల్ని యుద్ధంలో భాగం వహించేలా చేస్తే, హఠాత్తుగా ఏమైనా అపాయం సంభవిస్తే దానికి జవాబుదారీ ఎవరు? మాకు అపఖ్యాతి రాకమానదు. కాబట్టే మిమ్మల్ని యుద్ధరంగానికి పంపించలేను."

"ప్రభువుల మాటలవల్ల ఉపకృతులమయ్యాము. కానీ—మా స్నేహాన్ని ఒరపెట్టి చూడడానికిదే తగినసమయం. తమకిప్పుడు మా సహాయం అత్యవసరం. యుద్ధంలో చావుబ్రతుకుల సమస్యలనుగురించి చింతించకూడదు ప్రభూ! పోర్చుగీసు లెప్పుడూ మృత్యువుకు భయపడరు. అలా భయపడేలా అయితే వాళ్ళు తమ ఇళ్లు-వాకిళ్ళనువదలి, వేలమైళ్ళదూరం వచ్చేవాళ్లుకారు. వాళ్ళకు మృత్యువుతో ఆడుకోవడం ఒక

వినోదం. వాళ్ళకు మరణమొచ్చేటట్లయితే వీరోచితమైన మృత్యువునే కోరుతారు. ఇలావుండగా తమరు మా గురించి చింతించక యుద్ధంలో భాగం వహించడానికి అవకాశమివ్వాలి. ఇదే మన చిరస్నేహ బాంధవ్యపు చిహ్నం" అని అన్నాడు.

ఇంత చెప్పిన తర్వాత రాయలు ఫిగ్వెరోడ్ మాటను సమ్మతించవలసే వచ్చింది.

అప్పుడే ఫిగ్వెరోడ్ తన సైన్యంతో రాయల సైన్యాన్ని చేరుకున్నాడు.

ఫిగ్వెరోడ్ రాయల సైన్యంతో చేరినతర్వాత యుద్ధపు స్వరూపం మారిపోయింది. రాయచూరు దుర్గాన్ని వశపరచుకోవడానికి ఫిగ్వెరోడ్ తన ఆలోచనాప్రకారం సర్వం సిద్ధపరిచాడు. అతని సైనికులు దుర్గపు ఆయకట్టుస్థలాల్లో కందకాలను త్రవ్వి, వాటిలో కూర్చుని తమ కార్యాచరణను ప్రారంభించారు. వాళ్ళు శత్రువులదృష్టి తమవైపు పడగానే మిగిలిన సైనికులు మందుగుండులు పేల్చి, ఆప్రదేశాన్ని పొగతో కప్పివేశారు. ఈ పొగలో గోవిందరాజు వగైరా సైనికులు కొందరు సులభంగా కోటను సమీపించారు.

తమ కళ్ళు గప్పి, కోటవద్దకు వచ్చి చేరిన సైన్యాన్ని నిశ్శేషం చెయ్యడానికి కోట కొమ్మలపైనున్న శత్రుసైన్యం పెద్ద రాళ్ళను, సలసల కాగిన తైలాన్ని కార్చి క్రిందవున్న సైనికులను హింసించ సాగింది. ఈ హింసను లెక్కించకుండా రాయల సైనికులు కోటను ఛేదించే కార్యంలో నిమగ్నులైనారు.

ఇదే సమయంలో దుర్గం మీద నిలబడి రాయల సైన్యం మీద చెయ్యి చేసుకుంటున్న శత్రుసైనికులు ఫిగైరోడ్ అనుచరుల గుళ్ళదెబ్బలకు సులభంగా బలికాసాగారు. దుర్గం మీద నిల్చుని శత్రువుల గుళ్ళకు బలికాలేక, గోడ కావల నిలబడి గోడను భేదిస్తున్న సైనికుల మీద చెయ్యి చేసుకోడానికి ప్రారంభించారు. వాళ్ళకు శత్రువులను ఎలా వెనుకకు తరమాలన్నది తెలియక, తమనాయకుని వద్దకు పరుగెత్తారు. వాళ్ళనాయకుడు పరిస్థితి ఏమిటన్నది తెలియక, శత్రువుల కార్యాచరణను నిరోధించడానికి, తన యితర సేనాధిపతుళతో దుర్గం మీద వచ్చి నిలిచాడు. ఇదే సమయంలో ఒక పోర్చుగీసు సైనికుడు ప్రయోగించిన గుండు దూసుకుపోయి ఆ దుర్గాధిపతి తలకు తగిలింది. అతడు అక్కడే రక్తధారలు స్రవించి మరణించాడు. తమ నాయకుని కైన గతిని చూసి, తక్కినవారు ప్రాణరక్షణకు పరుగులిడక ముందే, గుళ్ళవర్షం కురిసి వాళ్ళను యమసదనానికి పంపించి వేశారు. తప్పిదారి మిగిలిన సైనికులు చెదరి దిక్కుకొకరై పారిపోయారు.

ఈ సమయం చూసి గోవిందరాజు, ఫిగైరోడ్ సైనికులు కోటగోడను భేదించి ఆ రంధ్రం మూలంగా పుర ప్రవేశం చేశారు.

ఎక్కడచూసినా హాహాకారాలు చెలరేగాయి. రాయల సైనికులు కోటను భేదించి పుర ప్రవేశంచేసిన సంగతిని విని ప్రజలు భీతితో తల్లడిల్లారు. తమ కోటను భేదించడానికి ఎవరినుంచీనూ సాధ్యం కాదనుకుని నిశ్చింతతో

వుండిన ప్రజ, రాయల సైనికులు కోటను ఛేదించి లోపలికి వచ్చిన సంగతి తెలిసి విస్మయ పడ్డారు. వాళ్ళకు ఫిరంగీ సైనికులరూపం, వాళ్ళ చేతిలోవున్న ఫిరంగులను చూసి భూత దర్శన మైనట్టుగా బెదిరారు. వాళ్ళ పిశాచాలే అయ్యారు. లేకపోతే అసాధ్యమని భావించిన కోటను సామాన్య గుళ్ళతో ఛేదించి లోపలికి రావడమంటే ఏమిటి?

ఉన్నట్టుండి లోపలికోటలో హాహాకారాలు బయలు దేరాయి. లోపలి కోటకూడా శత్రువులకు బలి అయినదనీ, దానిని వశపరచుకుని శత్రువులు పురవీధుల వెంట వస్తున్నా రనీ తెలిసింది. బయటికి తలచూపితే ఎక్కడ మరణించవలసి వస్తుందో నని నగర ప్రజ తమ యిళ్ళను చేరుకుని ద్వారా లను బంధించుకో సాగారు.

శత్రుసైన్య నాయకుడు మరణించిన తర్వాత అనాయ కత్వానికి గురైంది. అది సులభంగా రాయలకు వశమైంది. చూస్తూ చూస్తూవుండగానే దుర్గాగ్రం మీద సుల్తాను పతాకం నేలకువాలి దాని స్థానంలో విజయనగరపు వరా హాంకిత ధ్వజం ఎగుర సాగింది.

ఆదృశ్యం చూసి రాయల శిబిరంలో అందరికి సంతో షాశ్చర్యాలు జనించాయి. దుర్గాన్ని తమ సైనికులు వశ పరచు కున్నందుకు అది సంకేతచిహ్నమని తెలిసి వాళ్ళు తమలోనే హర్షించారు. కృష్ణదేవరాయలు జనుల జయజయ ధ్వానాలు విని తన మందిరం నుంచి వెలుపలికివచ్చి దుర్గపు అగ్రం మీద ఎగురుతోన్న తమ ధ్వజాన్ని చూసి సంతో షించాడు. ఈవిజయపు సంకేతంగా ముప్పయిఒక్క ఫిరంగు

లను ప్రేల్చేలా ఆజ్ఞాపించి, విజయులైన గోవిందరాజు, ఫిగై రోడ్‌లకు స్వాగత మివ్వడానికి సిద్ధుడైనాడు.

ఈ వేళకు రాయచూరు గోవిందరాజుని స్వాధీనమైంది. పురజనులు చేతుల్లో తెల్లని బావుటాలను పట్టుకొని భీతులై వచ్చి శరణాగతులయ్యారు. అక్కడికి యుద్ధం పరిసమాప్తమైంది. పురప్రజ కందరికీ శాంతిభిక్ష నివ్వఒడమైనది.

రాయచూరు పౌరులు వరుసగావచ్చి రాయలను శరణువేడారు.

"మహాప్రభూ! తెలియక మేము చేసిన అపరాధాన్ని మన్నించాలి. తమమీద యుద్ధమునకు సిద్ధమైన తప్పును మన్నించాలి" అని వేడుకున్నారు. కృష్ణదేవరాయలకు ఆ పురజనుల మొరవిని కరుణకలిగింది. అతడు పురజనులను ప్రీతిగా మాట్లాడించి, వాళ్ళు ఏతప్పూ చేసివుండలేదనీ, తమగృహాలకు నిశ్చింతగా వెళ్ళవచ్చుననీ, వాళ్ళ సిగవువ్వు కూడా వాడనట్లుగా చూచుకునేలా వాగ్దానమిచ్చి వాళ్ళను వెనుకకు పంపాడు.

భయభీతులైన ప్రజ యిప్పుడు ధైర్యంగా తమ యిళ్ళకు మరలివచ్చారు. విజయవంతుడైన రాజువల్ల తమకు ఏ సంకటమూ, కష్టమూ సంభవిస్తుందోనని వాళ్ళు భయపడ్డారు. కానీ—యిప్పుడు రాయల దయ, ఔదార్యాలను చూసి వాళ్ళు నిశ్చేష్టులయ్యారు. రాయచూరు నాగరికులకు రాయలు తమను ఉద్ధరించడానికి మానవాకారం దాల్చి వచ్చిన దేవతలా కనుపించాడు.

రాయచూరు ప్రజ చాలావరకూ హిందువులు. పైగా కర్ణాటాంధ్రులు. వీళ్ళు మొదట విజయనగరసామ్రాజ్యానికి చేరినవాళ్ళయినా, కాలగతివల్ల రెండుమూడు దశాబ్దాల నుంచీ బిజాపురసుల్తాను పాలనకు లోబడ్డారు. అక్కడి నాగరికులు సుల్తానుని క్రూరపరిపాలనవల్ల చాలా కష్టాలనుభవించారు. ఇప్పుడు వాళ్లకు మళ్ళీ తమ దేశ బాంధవులను కూడుకునే అపూర్వ సుయోగం దొరికింది. దీనివల్ల వాళ్ళ కమితానందమైంది.

మరునటిరోజు ఉదయం కృష్ణదేవరాయలు రాయచూరును ప్రవేశిస్తాడని దండోరా వేయబడింది. పురజనులాదిగా అందరూ సంబరంతో వీధులను తలిగుల తోరణాలతో సింగారించి రాయలకు ఘనమైన భవంతో స్వాగతమియ్యడానికి సిద్ధపడసాగారు.

రాయలు నిశ్చిత వేళకు సరిగా పురప్రవేశం చేశాడు. అతని కిరువైపులా సిగ్గరోడ్, గోవిందరాజులు నడుస్తున్నారు. వాళ్ళ వెనుక తిమ్మరుసు, రాయసం కొండమరుసు, తదితర ప్రముఖసేనానులూ, పురప్రముఖులూ నడచివస్తున్నారు. ప్రజలు జయఘోష చేసి, వాళ్లమీద పుష్పవృష్టి కురిపించి వాళ్ళను నగరంలోకి స్వాగతం చెప్పి రాయలకనే సిద్ధపరచిన మంటపంలోకి తీసుకుపోయారు.

మంటపాన్ని భవ్యంగా రచించి, రకరకాలుగా సింగారించారు. అక్కడి గద్దెమీద రాయలు కూర్చున్నాడు. పుర ప్రముఖులంతా రాయల సముఖానికివచ్చి నమస్కరించి నజ

దానాలను సమర్పించి వెళ్ళారు. అనంతరం రాయలు పుర జనుల నుద్దేశించి మాట్లాడాడు.

"ప్రియమైన పౌరులారా, మీరు ఇకమీదట ఏవిధ మైన భీతి పడవలసిన పనిలేదు. ఇదివరకు మీరు పరకీయుల పదాఘాతంవల్ల చాలినంత బాధ ననుభవించారు. రాహు గ్రస్తుల్లావుండిన మిమ్మల్ని భగవంతుడే యిప్పుడు విడుదల చేశాడు. మిమ్మల్ని మళ్ళీ నా ప్రీతి పాత్రమైన ప్రజలనుగా పొందినందుకు నాకు చాలా సంతోషంగావుంది. మీరు విజయనగర సామ్రాజ్య ఛత్రపు నీడలో తక్కిన సోదరుల్లానే నెమ్మదిగా, నిష్ఠగా జీవించి సామ్రాజ్యానికి కీర్తిని తెండి!

ఈ సమయంలో ఒక మాట చెప్పదలుస్తున్నాను. మేము విజయవంతులమైనా మీకు మాసైన్యంవల్ల ఏవిధమైన భీతికి అవకాశంలేదు. ఒక వేళ ఇక్కడ వుంటే మీ నెమ్మదికి భంగం కలుగవచ్చునని ఎవరికైనా అనుమానంగా వుంటే, వాళ్ళు ఈ వెంటనే తమ సమస్త సంపదనూ తీసుకుని ఈనగ రాన్ని విడచి వెళ్ళవచ్చు. అలాంటి వారికి బిజాపుర సరి హద్దువరకూ రక్షణ యివ్వబడుతుంది. మీరు యిక్కడే నెమ్మ దిగా వుండదలచి నట్టయితే మాకు చాలా సంతోషం."

అని రాయలు మాటలు ముగించాడు.

ప్రజలు జయఘోష చేసి రాయలిచ్చిన వాగ్దానానికి తమ కృతజ్ఞతను చూపించారు.

ఇంత సేపటికి నగరపు ఒకమూల నుంచి ఆర్తధ్వని వినవచ్చింది. అదేమిటోనని విచారించగా ఆ భాగంలో నివ సిస్తున్న వారిమీద శత్రుసైనికులు పడి ఇళ్ళల్లో హత్యలు,

దోపిడీలు, అత్యాచారాలను చెయ్యసాగారు. ఈ విషయాన్ని రాయలకు విన్నవించడానికి అక్కడ నివసిస్తున్న వాళ్ళు పరుగెత్తి వస్తున్నారు.

ఈవార్త విని రాయలు కూర్చున్నచోటనే అగ్గిలా అయ్యాడు. వెంటనే ఆ దుష్టులను పట్టి తీసుకు రావడానికి సైనికులను పంపించాడు. సైనికులు, త్రాగి మదోన్మత్తులైన కొంతమంది శత్రుసైనికులను పట్టితెచ్చి, రాయల యెదుట నిలబెట్టారు. వాళ్ళను చావబాది, గార్దభాల మీద కూర్చొబెట్టి నగరంలోని వీధులంటా ఊరేగింపు చెయ్యడానికి రాయలు ఆజ్ఞాపించాడు.

ఈ శిక్షను విన్న తర్వాత ప్రజకు రాయల మాటలలో నమ్మిక కలిగింది. రాయలు దుష్టశిక్షక, శిష్టరక్షకుడన్న విషయంలో వాళ్ళకు సంశయం మిగులలేదు.

రాయలు ఈ ఘటనకు కారకులైన అత్యాచారులను శిక్షించడమేకాక, వాళ్ళు దోచుకున్న ధనాన్నికూడా యిప్పించడంవల్ల ప్రజకు రాయల మీద పూజ్యభావం ఏర్పడింది.

రాయలు రాయచూరులో వుండగానే విజయనగరం నుంచి పురోహితులు ఒక సుభవార్తను తెచ్చారు. రాయల పట్టపురాణి తిరుమలాదేవికి ఒక పుత్రరత్నం జనించాడు. ఈ సంగతిని వాళ్ళు తెలియజేసి రాయలను ఆశీర్వదించారు. ఒక్కటూరిగా లభించిన రెండు సంతోష వార్తలవల్ల రాయల హృదయం ఉప్పొంగి పోయింది. అతడు వెంటనే పురజనులకు మధుర పదార్థాలను పంచడాని కేర్పాటుచేసి,

సమాచారాన్ని తెచ్చిన పౌరోహితులకు పారితోషికాలనిచ్చి తృప్తిపరచాడు.

అనంతరం రాయలు ఎనిమిదిరోజులపాటు సంతోష సంభ్రమాలతో ఉత్సవం జరిపించడానికి ఆజ్ఞయిచ్చి, రాయచూరులో రాజ్యపాలనపట్ల తగిన ఏర్పాట్లుచేసి, మాతా శిశువులను చూడడానికి రాజధానికి ప్రయాణం కట్టాడు.

# 8

మహారాణి తిరుమలాదేవి కృష్ణదేవరాయల పట్టమహిషి. ఈమె శ్రీరంగపట్టణపు మహామాండలీకుడైన కుమార వీరయ్య కుమార్తె. బాల్యంలోనే సంగీత, సాహిత్యాలలో పాండిత్యం గడించినది. నృత్యంలో 'నాట్యసరస్వతి' అను బిరుదును పొందినది. ఆమె గుణ, రూప, కుల, గోత్ర, నడవడికలనుచూసి మెచ్చుకున్న తిమ్మరుసు కృష్ణదేవరాయలకు ఈమే పట్టమహిషి కావడానికి తగినదని నిశ్చయించాడు.

ఒకవిధంగా వీరి వివాహం తిమ్మరుసు బలవంతంవల్ల అయిందనాలి. కృష్ణదేవరాయలు బాల్యంనుంచీ ప్రేమిస్తున్న చిన్నాదేవిని పట్టమహిషిగా చేసుకోవాలని నిశ్చయించాడు. కానీ—తిమ్మరుసు ఈ విషయంలో తన అసమ్మతిని వ్యక్తపరిచాడు.

కృష్ణదేవరాయలు చిన్నాదేవిని పట్టపురాణిగా చేసుకునే విషయంలో తిమ్మరుసు అసమ్మతిని సూచించడానికి ప్రబలమైన కారణముంది. చిన్నాదేవిలో పట్టమహిషి కావ

డానికి కావలసిన గుణాలన్నీ వున్నాయి ఆమె అనుపమ సౌందర్యవతి. సద్గుణసంపన్నురాలు. క్షత్రియరమణుల కుచితమైన గుఱ్ఱపుస్వారి, కత్తివరస, ధనుర్విద్య మొదలైన యుద్ధ విద్యల పరిచయంకూడా వుంది ఆమెకు. రాజనీయంలో అపారాశక్తివుంది ఆమెకు. ప్రజలను తను కన్నబిడ్డల్లాగా చూసే విశాలహృదయమూ వుంది. కానీ—ఒకే ఒక్క విషయంలో మాత్రం ఆమెకు పూజ్యమూ, పవిత్రమూ అయిన రత్న సింహాసనంలో రాయల అర్థాంగిగా కూర్చోడానికి అర్హత లేదు. ఇది ఆమె కులగోత్రాల విషయం. చిన్నాదేవి తల్లి తండ్రులెవరు? వాళ్ల కులగోత్రాలేమిటి? అన్నది ఎవరికీ తెలిసి వుండలేదు. అలాంటి అజ్ఞాత కులసంజాతను పట్టపురాణిగా చేసుకోడానికి తిమ్మరుసు కిష్టంలేదు. అందువల్లనే తిమ్మరుసు చిన్నాదేవిమీద రాయలకున్న అనుపమ ప్రేమను చూసి ఆమెను భోగకాంతగా వుంచుకోవడానికి తన అభ్యంతరం లేదని చెప్పినప్పుడు కృష్ణదేవరాయలు కోపంతో "అప్పాజీ, చిన్నాదేవిని నాభోగకాంతగా భావించాలా? ఎవరిని నేను త్రికరణపూర్వకంగా వరించి, గాంధర్వరీతిలో సూర్యచంద్రుల సాక్షిగా పెళ్ళాడి, ధర్మార్థకామమోక్షాదులతో సహధర్మ చారిణి అని అనుకున్న ఆచిన్నాదేవిని భోగకాంతగాభావించి ఏ నరకానికి వెళ్లను? దీనికంటే ఘోరనరకం-ఆత్మవంచన వేరేకావాలా?......అప్పాజీ, మీరేమనుకున్నాసరే. నేను చిన్నాదేవిని శాస్త్రోక్తంగా పెళ్లాడి రాణిపదవి నిస్తాను—అలా ఒకవేళ చెయ్యలేకపోతే నేను ఈ జన్మలో పెళ్ళిచేసుకోవడమేలేదు" అని నిష్ఠురంగా అన్నాడు.

ఈమాటకు తిమ్మరుసు నోరు కట్టుబడిపోయింది. బుద్ధి కుంఠితమైపోయింది. రాయలు చిన్నాదేవి విషయంలో తన అభీష్టమేమిటన్నది స్పష్టంగా చెప్పివేశాడు. అతడు తన నిర్ణయాన్నిమార్చుకునేలా చెయ్యడానికి సాధ్యంకాలేకపోయింది. కృష్ణదేవరాయలు చెప్పినంతా చేసేవ్యక్తి. అతడు తన ప్రణయినికి యిచ్చినమాటను దక్కించుకోవడానికి ఏత్యాగమైనా చేస్తాడని తెలిసింది. ఈ ధర్మసంకటంనుంచి బయటపడే దారి తెలియక తిమ్మరుసు చాలా చింతపడసాగాడు.

ఎన్నోతూర్లు తిమ్మరుసుగూడా ఆలోచిస్తూండేవాడు. ఈ చిన్నాదేవికి రాజవంశీయుల బిడ్డలకుండవలసిన లక్షణాలన్నీ వున్నాయి. ఆమె రాజపుత్రికేనని ముఖంలోని రాజకళ, వర్చస్సులు ఘోషిస్తున్నాయి. ఆమెఉదాత్తగుణగణాలు రాయల ధర్మపత్నిగా కావడానికి తగినవిగానే వున్నాయి. వీటిజతకు ఆమె కులగోత్రాల విషయమూ స్పష్టంగా తెలిసివస్తే ఆమెను రాయలు పెళ్ళాడడానికి తిమ్మరుసు సమ్మతించేవాడు. కాని—చిన్నాదేవి కులగోత్రాల విషయం ఆమె సద్గుణాలన్నిటినడుమా మచ్చలా వుండిపోయింది. ఇది తెలిసి తెలిసీ ఆత్మవిరుద్ధంగా ఆమెను రాయలకు పెళ్ళిచేసి పవిత్రమైన రత్నసింహాసనాన్ని అపవిత్రపరచడమా? అనే ధర్మసంకటంలో నుంచి బయటపడే దారి కనుపించక అతడూ రాయలలాగానే వ్యాకుల పడసాగాడు.

రాయలు సింహాసనానికి రాకముసుపు వీరనరసింహుని భయంతో అజ్ఞాతవాసం చేస్తూండేవాడు. ఈఅజ్ఞాతవాసంలో వుండగా చిన్నాదేవికి తను సింహాసనానికి వచ్చిన వెంటనే

ఆమెను మహారాణి పదవికి తీసుకుపోయేలా రాయలు మాట యిచ్చాడు. అదేవిధంగా రాయలు వీరనరసింహుని అనంతరం సింహాసనానికి వచ్చినప్పుడు తన మాటప్రకారం నడచుకోవడానికి నిశ్చయించాడు.

రాయల నిశ్చయాన్ని విని తిమ్మరుసుకు దిగులుపట్టు కుంది. అతనికి అన్నహారాలుసైతం అక్కరలేకపోయాయి. రాయల వివాహ సమస్య ఇంత తీవ్రతరమౌతుందని అత డనుకోలేదు. అతని హృదయం ఆ ప్రణయజీవులకోసం బాధ పడసాగింది. అయినా ఆహృదయపు భావనలకు రాజధర్మాన్ని బలి యివ్వడానికి తిమ్మరుసు సిద్ధపడలేదు.

కాని—రాయల ఆలోచనా విధానమే వేరు. చిన్నా దేవి అజ్ఞాతకులసంజాత అన్న ఒక్క కారణంవల్ల ఆమె సుగుణాలన్నిటినీ నిర్లక్ష్యంచేయడాని కతడు యిష్టపడలేదు. క్షత్రియుడైన అతని మనస్సును ఆమె అపహరించిందంటే ఆమెకూడా క్షత్రియరమణే అయివుండాలని అతని అంత రాత్మ చెబుతోంది. ఆమెయోగ్యతను కొల్చే సాధనం ఆమె గుణగణాలేకాని ఆమెవంశచరిత్ర కాదని రాయల అభిమతం. రాయల భావనలో చిన్నాదేవి బురదలో జన్మించిన కమలంలా—పరిశుద్ధురాలు, పొదుగులోనిపాలలా పవిత్రురాలు; మృగనాభికస్తూరిలా పూజనీయమైనది. ఆమెకులహీనురాలైనా ఆమె నిర్మలాంతఃకరణ, దైవికమైన ప్రేమకు కళంకంలేదని రాయల వాదం.

చిన్నాదేవి తల్లి సుభద్రాదేవి విజయనగరానికి వచ్చి నప్పుడు ఆమెనిండు గర్భిణి. ఆమె ఎవరు? ఏదేశస్థురాలు?

ఇలాంటివాటిలో ఏ ఒక్కటీ ఎవరికీ తెలియదు. వీటినిగురించి ప్రశ్నించినా ఆమె ఆవిషయంలో ఉత్సాహంకనబరచేది కాదు. ఇందువల్ల, ఈవిషయాలు సుభద్రాదేవి మరణించే వరకూ గోప్యంగానే వుండిపోయాయి.

సుభద్రాదేవి జీవితంలో చాలా బాధపడినస్త్రీ. ఆమె నిండు గర్భిణిగా, అనాధలా విజయనగరానికి వచ్చింది. ఎవరో ధర్మాత్ముల ఆశ్రయం పొంది అక్కడే ఒక ఆడశిశు వును ప్రసవించింది. ఆశిశువే చిన్నాదేవి.

చిన్నాదేవి జన్మించిన ఒకటి రెండు సంవత్సరాలకే వాళ్ళఆశ్రయదాత మరణించాడు. దీనివల్ల సుభద్రాదేవిమళ్ళీ వీధులపాలైంది. నిలుచుకోవడానికి నీడలేక, అనాధలైన ఆతల్లీ—బిడ్డలు, బీదతనపుటగ్నిలో కాలిపోయారు. ఆమహా పట్టణంలో వాళ్ళకు పట్టెడన్నం దొరుకడంకూడా కష్టమై పోయింది. సుభద్రాదేవి మానాభిమానాలను వదలి జీవి తాన్ని సాగించివుంటే ఆమె అన్న వస్త్రాలకుగా అంత కష్ట పడవలసివచ్చేదికాదు. అంతటి హేయ జీవితం జీవించడం కన్న మరణించడమే మంచిదని ఆమెమతం. మరొకరి అను కంప, సహానుభూతులను ఆమె అపేక్షించేదికాదు. తను చమటకార్చి, కష్టపడి పనిచేసి పొట్ట సాకుకోవాలని, ఏకాలా నికీ పరుల నాశ్రయించకూడదనీ ఆమె నిశ్చయం. అందు వల్లనే ఆమెతన ఆశ్రయదాత మరణించిన తర్వాత మరొక చోట ఉద్యోగం సంపాదించి మర్యాదగా జీవించడానికి ప్రయత్నించింది. కానీ—నిండుయౌవని అయిన సుభద్రా దేవికి మానరక్షణ చేసుకుంటూ జీవించడం కష్టమేఅయింది.

ఆమె వెళ్ళిన వైపంతా విషయలంపటుల కాముకుల దృష్టి వెన్నాడుతూనే వుంది. ఆదృష్టినుంచి తప్పించుకోవడం కష్టమే అయింది. అలాంటివారి క్రూర దృష్టినుంచి తనను కాపాడమని ఆమె పంపాపతిని ప్రార్థించింది.

ఆమె ప్రార్థన పంపా విరూపాక్షునికి వినిపించినట్లుగా వుంది. ఆమెకు యోగ్యులైన ఆశ్రయదాతలు దొరికిరి, ఆమె కష్టాలన్నీ అప్పటికే పరిహారమైపోయాయి.

సుభద్రాదేవికి ఆశ్రయ మిచ్చిన వ్యక్తి మరెవరో కాదు, వీరనరసింహుని చేతిక్రింద దండనాయకుడుగా వున్న రాయసంకొండమరుసు. అతడు మొదట వ్రాయసకాడుగా వుండి తర్వాత తన స్వశక్తిసామర్థ్యాలతో, కొంత కొంతగా పురోగమించి దండ నాయకపదవిని పొందాడు. అతనికి గణిత శాస్త్రాన్ని ఉపయోగించుకునే కళ తెలిసినట్లే, కత్తిని ఉపయోగించుకునే కళకూడా తెలిసింది. క్రిందటి కృష్ణదేవ రాయల దిగ్విజయాలలో ఉత్కళ ఉదయగిరి, పొట్నూరు యుద్ధాలలో భాగం వహించాడు. సింహాద్రి, శ్రీకూర్మం, పొట్నూరులలో రాయల కీర్తినిచాటే విజయస్తంభాలను స్థాపించే భాగ్యం అతనికి లభించింది.

అతడు సమరవిద్యా పారంగతుడైనట్లే, ఉదారాంతః కరణుడుకూడాను. కొండమరుసు భార్య తన బిడ్డకు పిన్న తల్లిని తీసుకురాకూడదనీ, చిరంజీవిని ప్రేమతో పెంచాలనీ భర్తదగ్గర మాటతీసుకునే అకాలమృత్యువుకు గురైంది. సర్వదా యుద్ధాలలో నిమగ్నుడైన తనసుంచి ఏ గృహ సౌఖ్యమూ భార్యకు లభించలేదని తెలుసుకుని అతడు మళ్ళీ

పెళ్ళిచేసుకునే ఆలోచన చెయ్యలేదు. అంతేకాక ప్రియపత్నికి మరణాకాలంలో యిచ్చిన మాటను పాలించాలని దానికి ఒప్పజెప్పడాని కిష్టంలేక తన బిడ్డను ప్రేమతో తల్లికొరతను తీర్చేలా చూసుకునే వ్యక్తికోసం అన్వేషిస్తున్నప్పుడే అతనికి సుభద్రాదేవి పరిచయమైనది. సుభద్రాదేవి ఉదారచరితుడూ, దైవభీరువూ అయిన కొండమరుసు బిడ్డను చూసుకునే పనిని సంతోషంతోనే ఒప్పుకుంది. ఆమె చిరంజీవి విజయభద్రుణ్ణి తన కుమారుడనే భావించి ప్రేమతో పెంచింది. విజయభద్రునికి చిన్నాదేవి అభిమానపు సోదరి అయింది. కొండమరుసుకు ప్రియకుమార్తె అయింది.

కానీ—సుభద్రాదేవి భాగ్యం చివరివరకూ అలాగే సాగలేదు. చిన్నాదేవి పది సంవత్సరాల ప్రాయంలో వుండగానే సుభద్రాదేవి మంచంపట్టి పడుకున్నది. మళ్ళీ లేవలేకనే ఇహలోకయాత్రను ముగించుకుంది. కానీ, మరణించడానికి ముందు కొండమరుసుకూ, చిన్నాదేవికీ తన చరిత్రనంతా చెప్పి మరణించింది.

కొండమరుసుకు సుభద్రాదేవి చరిత్రవిని ఆశ్చర్యమైనది. తను ఎవరిని పరదేశి, అనాథ అని అనుకున్నాడో ఆమె మరెవరూకాదు. పరిత్యక్త రాజపుత్రి అని తెలిసినప్పుడతనికి కలిగిన విస్మయం అంతా యింతాకాదు—

సుభద్రాదేవి ఉత్తరదేశపు ఏదోరాజ్యపు రాజపుత్రి. ఆమె ప్రాప్తవయస్సుకురాగా తన అంతస్థుకు, ఘనతకు తగిన రాజకుమారునితో తల్లితండ్రులు ఆమెకు వైభవంగా వివాహంచేశారు. పెళ్ళయిన కొన్ని సంవత్సరాలు దంపతు

అన్యోన్యంగా గమనిస్తూవచ్చారు. ఒకసారి పుట్టినింటికి వచ్చినప్పుడు జరిగిన సంఘటన ఒకటి ఆమె భవిష్యత్తును మట్టిపాలుచేసింది.

సుభద్రాదేవిని బాల్యంనుంచీ ఒక సమీపపు రాజ బంధువు ప్రేమిస్తూండేవాడు. అతని దుర్గుణాలను చూసి అసహ్యపడిన సుభద్రాదేవి అతన్ని పెళ్ళాడడానికి తిరస్కరించింది. అప్పటినుంచీ అతనికి సుభద్రాదేవిమీద ప్రతీకార వాంఛ కలిగింది. భగ్నప్రేమికుడైన అతడు ఆమెమీదపగ తీర్చుకోవడానికి తగిన సమయంకోసం నిరీక్షించసాగాడు. ఆమెను ఆపేక్షించి అవమానితుడైన అతడు; రాజధానిని విడిచి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈసంఘటనావిషవృక్ష ఫలాన్ని ముందుకు సుభద్రాదేవి అనుభవించవలసివచ్చింది.

క్రోధంతో, సుభద్రాదేవిమీద పగపట్టి, అతడు రాజ్య త్యాగంచేశాడు. ఆరాజబంధువు ఆమె భర్తవున్న రాజ్యానికివచ్చి ఉపాయాంతరంగా అతని స్నేహాన్ని సంపాదించి అక్కడే స్థిరనివాసమేర్పరచుకున్నాడు. అతడు క్రమ క్రమంగా ఆమెపట్ల ఆమెభర్త అనుమానంపడేలా చేశాడు. ఆమెను 'జారిణి' అన్న అపాదనకు గురిచేసి, రాజ్యంనుంచి వెళ్ళగొట్టే ప్రయత్నంలో అతడు సఫలీకృతుడయ్యాడు. అతడు సృష్టించిన అబద్ధపులేఖలను నిజమని నమ్మి, సుభద్రాదేవి భర్త ఆమెను గర్భిణిఅనికూడా చూడక ఆమెను రాజ్యంనుంచి వెళ్ళగొట్టాడు. తనమీద తేబడిన అపాదనకు ఆధారం లేదని ఎంతచెప్పినా దానికి సమర్థనసాగుకలేదు. ఆమె బ్రతుకు వేసారి, ఆత్మహత్య చేసుకోవడానికి ఒకనదిదగ్గరకు

రాగా, అక్కడ స్నానాన్హికాలకు వచ్చిన ఒక సన్యాసి దృష్టిలోపడి ఆమె బ్రతికింది. ఆమెతన గర్భంలోవున్న శిశువుకోసమై చావకుండా బ్రతికింది. ఆమెనుపిలుచుకుని వచ్చి ఆసన్యాసి విజయనగరంలోని తన మిత్రుని ఆశ్రయంలో విడచి వెళ్ళిపోయాడు. అక్కడే చిన్నాదేవి పుట్టినది. ఆశ్రయదాత మరణించిన తర్వాత ఆమె కొండమరుసు ఆశ్రయానికి వచ్చినది. కేవలం పదిసంవత్సరాల బాలిక అయిన చిన్నాదేవికి, తన తల్లి చెప్పిన సంగతులు మహాత్మ్యమేమిటని అప్పుడు తెలియకపోయినా ఆతర్వాత వాటి విలువ తెలిసి వచ్చింది.

సుభద్రాదేవి తన చరిత్రనంతా కొండమరుసుకు చెప్పి తన కుమార్తెను కాపాడే జవాబుదారిని అతనికి అప్పజెప్పి నిశ్చింతగా ప్రాణంవదలింది.

ఆమెకిచ్చిన మాట ప్రకారం కొండమరుసు చిన్నాదేవిని తనకడుపునపుట్టిన బిడ్డలానే చూచుకుంటూవచ్చాడు. ఆమెకు సంగీత, సాహిత్య, నృత్యకళలలో శిక్షణనిచ్చాడు. ఆమెకు క్షత్రియ రమణుల కుండవలసిన వీరోచిత విద్యలను— గుఱ్ఱపుస్వారి, ధనుర్విద్యలను తనే స్వయంగా నేర్పించాడు. అదిచాలక విజయభద్ర, చిన్నాదేవులను యోగ్యులైన గురువుల వద్ద విద్యార్జనకు విడచిపెట్టాడు.

చిన్నాదేవి గురుకులంలో శిక్షణ పొందుతున్నప్పుడే ఆమెకు కృష్ణదేవరాయల పరిచయమైనది. అదీ విచిత్ర విధానంతో—

అప్పటికి రాయలింకా అజ్ఞాతవాసంలోనే వున్నాడు. అతనికి యిలా తలదాచుకుని తిరగడం కష్టంగానేవుంది. అతడు ఒక్కొక్క సారి సమీపంలోవున్న అడవికి మృగయా వినోదానికిగా వెళ్ళుతూండేవాడు. ఒక్కసారి వేటకు వెళ్ళిన రాయలకు ఒక లేడి ఎదురైంది. దానిని వెన్నంటి తరుముకుని రాయలు చాలా దూరం వెళ్ళాడు. ఆ లేడి పరుగెత్తి, పరుగెత్తి అలసిపోయి, భయ విహ్వలంతో చివరికి ఒకచోట నిలచిపోయింది. రాయలు దానిమీద బాణంసంధించి ఇక ప్రయోగించబోతున్నంతలో అతని ధనస్సు 'ఫంగ్' మని రెండుగా విరిగిపోయింది. రాయలు ఆశ్చర్యంతో చూస్తూండగానే ఎదురుగా నవ యౌవనస్థ, వనదేవతలా కనుపిస్తున్న చిన్నాదేవి! ఆమెకూడా మృగయావినోదానికిగానే అక్కడికి వచ్చింది. విజయభద్రుడు కారణాంతరాలవల్ల వెనుకనే నిలచిపోయాడు. ఆమె జింకను వెన్నంటివస్తున్న రాయలనుచూసి అక్కడికి వచ్చింది.

చిన్నాదేవి, ధనస్సునువిరిచిన తర్వాత తననే మంత్రముగ్ధునిలాచూస్తున్న రాయలను చూసి నవ్వి—

"మీరు క్షత్రియ వీరులైవున్నా, అడవిలో ఏజంతువును వేటాడాలన్నది తెలిసినట్టుగా లేదు. ఎవ్వరికీ కీడుచేయని నిండుగర్భంతో పారిపోవడానికి లేక చిక్కి భీతిల్లుతున్న లేడిమీదనా మీశౌర్య ప్రదర్శన" అని చిరుకోపాన్ని నటిస్తూ అన్నది. ఆమె మాట ఆమెపనిని సమర్థించేలావుంది.

ఆమె మాటలు విని రాయలకు ఆశ్చర్యంవేసింది. ఆమె మాటలలో సత్యముందని తెలిసి క్షమాపణ కోరుకునే

వానిలా దీనుడై ఆమెనుచూశాడు. ఆమె ఎవరో దేవాం గనగా వుండవచ్చునని భ్రమించాడు. కానీ—ఆమె దేవాం గనకాదు. తనలానే మానవి అని తెలిసినప్పుడతనికి చాలా ఆశ్చర్యమైంది.

"నాఅసభ్యపు మాటలవల్ల మీకు బాధకలిగివుంటే దయవుంచి క్షమించండి. కానీ — ఆహరిణిని చంపడానికి వెళ్ళిన మీతో విధిలేక ఆమాట అనవలసి వచ్చింది."

—ఇదివరకు క్షత్రియ లలనలా మాటలాడిన ఆ సుందరి, ఇప్పుడు సామాన్య ముగ్ధలా క్షమాపణకోరింది.

రాయలకు ఆమె యెవరు? ఎక్కడనుంచి వచ్చింది? అని తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది. అెప్పవెయ్యకుండా ఆమెనేచూస్తూ నిలబడ్డాడు—సభ్యతనుగూడామించి.

అతని తదేక దృష్టిని ఎదురించలేక ఆబాల సిగ్గుపడింది. ముఖం కెందామరలా ఎరుపైంది. లజ్జతో రక్తిమ దాల్చిన ఆముఖాన్నిచూసి రాయలకు మాటలుకూడా రాలేకపోయాయి. స్త్రీ సౌందర్యపు అభిమానదేవతే తన ఎదుట నిలబడివున్నట్టుగా అతనికి అనిపించింది. ఆమె సరళ సౌందర్యాన్ని చూసి, మోహితుడయ్యాడు. అంతసేపటికి ఆమెను వెతుక్కుంటూ అక్కడికి వచ్చాడు విజయభద్రుడు. విజయభద్రుడు అక్కడికి రావడంతో చిన్నాదేవికి కాస్త ధైర్యంవచ్చింది. వాళ్ళసంకోచాన్ని వదలి పరస్పరం పరిచయం చేసుకున్నారు. కృష్ణదేవరాయలు తను ఒక జమీందారు పుత్రుడనీ, ప్రస్తుతపరిస్థితిలో ఏపనీలేకుండా వూరకనే వుంటున్నాడనీ తనచరిత్రను చెప్పుకున్నాడు. అతని మాటను

వాళ్ళిద్దరూ నమ్మారో—లేదో తెలియదు. వాళ్ళు ఏ దాపరికమూ లేకుండా తమ చరిత్రనంతా తెలియజేశారు.

కృష్ణదేవరాయలు అజ్ఞాతవాసంలో వుండిన ప్రదేశానికి ఆ గురుకులం దగ్గరలోనే వున్న సంగతి తెలిసి రాయలు మనసులోనే సంతోషించాడు. అప్పుడు వాళ్ళను విడచి వెళ్ళడానికి రాయలకు మనసు రాలేదు. తన హృదయాన్ని ఆ యువతి దొంగిలించుకుని పోతున్నట్టు అతని కనిపించింది.

ఇలా ఆరంభమైన వాళ్ళ పరిచయం క్రమేణా అనురాగంగా పరివర్తన చెందింది. రాయలు తన నిజస్థితిని చిన్నాదేవిముందు దాచలేకపోయాడు. అతడు మగవాడే కాక భవిష్యత్సార్వభౌముడని తెలిసి, ఆమెకు విస్మయానందాలు ఏకకాలంలో జనించాయి. ఇంతటి సార్వభౌమునికి తను తగిన వధువా? సార్వభౌముణ్ణి ప్రేమించి తను కృతకృత్యురాలౌతుందా? అన్న అనుమానం ఆమెకు కలుగకపోలేదు. తన మనోరథాన్ని ఒకసారి ఆమె బయటపెట్టగా, రాయలు ఆమెను తను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తున్నాననీ, తను సింహాసనమెక్కిన వెంటనే విధిపూర్వకంగా, శాస్త్రోక్తంగా పాణిగ్రహణం చేసుకుంటాననీ మాటయిచ్చాడు.

అప్పుడే వాళ్ళు గాంధర్వ విధానంలో, సూర్యచంద్రులసాక్షిగా పెళ్ళాడారు.

ఇది జరిగిన కొన్నిమాసాలకే కృష్ణదేవరాయల అజ్ఞాతవాసానికి ముగింపు కలిగింది. అతడు విజయనగర సార్వభౌముడయ్యాడు.

కృష్ణదేవరాయలు సింహాసన మెక్కిన వెంటనే అతని వివాహపు సమస్య ఉద్భవించింది. దీనిని ఎవరి మనస్సుకూ కష్టంకలుగకుండా ఎలా పరిష్కరించడమా అని తిమ్మరుసు చింతిస్తున్నప్పుడే అతనికి ఒక ఆలోచన పారింది.

కృష్ణదేవరాయలు మరొక రాజపుత్రికను పెళ్ళాడి పట్టమహిషిగా చేసుకున్నతర్వాత, చిన్నాదేవిని విధిపూర్వకంగా చేబట్టి, రాణిగా చేసుకోవడానికి తన అభ్యంతరంలేదని తిమ్మరుసు తెలియజేశాడు.

ఈ సలహా సమ్మతం కాకపోయినా, విధిలేక రాయలు ఒప్పుకున్నాడు.

తిమ్మరుసే స్వయంగా నిల్చి అనేకదేశాల రాజపుత్రికల భావచిత్రాలను తెప్పించుకుని పరిశీలించి చివరికి శ్రీరంగపట్టణపు కుమార వీరయ్యకుమార్తె తిరుమలాదేవే రాయలకు అనురూపమైన వధువని నిర్ణయించి, ఆమెతో రాయల వివాహాన్ని వైభవంగా జరిపించాడు.

ఈ వివాహానంతరం రాయలు శాస్త్రోక్తంగా చిన్నాదేవిని పెళ్ళాడి, ఆమెకు నాగలాపురంలో ఒక అంతఃపురాన్ని కట్టించాడు.

ఉత్కళ విజయానంతరం గజపతి కుమార్తె జగన్మోహినిని పెళ్ళాడాడు. ఇంతైనా అతని మోహపురాణి చిన్నాదేవే!

రాయలు తిరుమలాదేవిని పెళ్ళాడిన కొంతకాలానికే ఆమెకు 'తిరుమలాంబ' అన్న పుత్రిక జన్మించింది. ఆమె

ప్రాప్తి వయస్సుకు వచ్చిన వెంటనే రాయలు అరవీడు వంశపు రామభూపాలునికి ఆమెను వివాహంచేసియిచ్చాడు.

తిరుమలాదేవికి తిరుమలాంబ తర్వాత ఒకరిద్దరు బిడ్డలు కలిగినా వాళ్ళుపుట్టిన వెంటనే మరణించారు. తిరుమలాంబ పుట్టిన ఎన్నో సంవత్సరాల తర్వాత మళ్ళీ యిప్పుడు మహారాణికి పుత్రోదయమైంది. ఇది రాయలకు సంతోషవార్తఅయింది. ఇతఃపూర్వమే రాయలకు చిన్నాదేవిలో పుత్రోదయమైనా, పట్టమహిషిలో ప్రథమ పుత్రసంతాన మవడంవల్ల ఈ పుత్రోత్సవాన్ని వైభవంగా జరిపించడానికి రాయలే రాజధానికి బయలుదేరివచ్చాడు. అక్కడ రాయలు దిగ్విజయపు సంతోషవార్త! ఇక్కడ పుత్రోత్సవపు శుభవార్త! ఈ రెండు శుభవార్తల వల్ల రాయల హృదయం సంతోషభరితమైంది.

## 9

కృష్ణదేవరాయలు రాజధానిలో పుత్రోత్సవ నిమిత్తంగా జరిగిన ఉత్సవాలలో భాగం వహించి, కొంతకాలం రాజకీయ జంజాటం లేకుండా వున్నప్పుడే రాయల మనస్సును వేధించునంతటి ప్రసంగం ఒకటి వచ్చిపడింది. రాయచూరు దిగ్విజయంతో రాయల ఖ్యాతి భారతావ్యంతం వ్యాపించింది. అతని కీర్తిచూసి ఓర్వలేని వ్యక్తులు ఎక్కువయ్యారు. ఇదివరకు రాయల విషయంలో అంతటి స్నేహంలేకపోయినా

బిజాపుర సుల్తాను అభివృద్ధినిచూసి సహించని ఇతర బ
మనీ సుల్తానులు, రాయచూరు యుద్ధంలో బిజాపుర సుల్తా
నుకు జరిగిన పరాజయాన్నిచూసి సంతోషించారు.

బహామనీ సుల్తానుల పరస్పరవైరము, ద్వేషాసూయ
లతో రాయలకు అనుకూల పరిస్థితి ఏర్పడింది. రాయలు
తనకు ప్రబలవిరోధియైన బిజాపుర సుల్తానును అణగ ద్రొక్కి
దక్షిణాపథానికంతా ఏకైక సార్వభౌముడుగా ప్రకాశించాడు.
అతని అభివృద్ధిని చూసి స్వతంత్ర రాజ్యాలైన బీదర్,
బీహార్ల సుల్తానులకు సహనం చచ్చిపోయింది. వాళ్ళు,
రాయలను యిలానే పెరుగనిస్తే ముందుకు తమ స్వాతంత్రా
నికికూడా భంగం రావచ్చునని బెదరి రాయల బలాన్ని
విరచి వెయ్యడానికి సర్వసన్నాహాలూ చెయ్యసాగారు.
రాయబారులను పంపించారు.

ఈ సారాంశమంతా ఒకే విధంగావుంది. కృష్ణదేవ
రాయలు అదిల్‌శహాన్‌మీద గెల్చిన అఖండదిగ్విజయానికి
అతణ్ణి అభినందించారు. రాయలు బిజాపుర సుల్తాను గర్వాన్ని
అణచి, అతనిమీద పగతీర్చుకున్నందు కభినందించారు
కానీ—రాయలకృత్యంలో వారికి మనస్సమాధానం కాని
అంశమేమిటంటే, రాయలు సుల్తానుకు సంబంధించిన ప్రదే
శాలను వశపర్చుకునివుండడం. అదిల్‌శహాను నుంచి రాయలు
పొందిన ప్రదేశాలను తిరిగి యిచ్చివెయ్యవలసినదని, అతనితో
గౌరవపూర్వకమైన సంధిచేసుకుని స్నేహంగా వర్తించాలనీ
వినతిచేసుకున్నారు. ఈ వినతిని రాయలు తిరస్కరిస్తే,
తామంతా ఒక్కటై రాయలమీద పడి, బలాత్కారంగా

నైనా, తమ కోరికను నెరవేర్చుకోనేటట్లుగా తెలియజేశారు. అది ఒకవిధంగా రాయలను బెదిరించడమే అయింది.

ఈ పత్రాల బెదరింపులకు రాయలు బెదరిపోలేదు. అతడు బహామనీసుల్తానులకు వినోచితమైన ప్రత్యుత్తరాన్ని పంపించాడు. వాళ్ళసలహాను పూర్తిగా తిరస్కరించడమే కాక వాళ్ళు ఏమి కూడా దండెత్తి రావలసిన ప్రమేయమే లేదనీ, తనే వాళ్ళున్నచోటుకు వచ్చి యుద్ధాన్ని ఇవ్వనున్నట్లూ ప్రతిపత్రాలు పంపించాడు.

ఈ జవాబువల్ల బహామనీ సుల్తానులకు రాయలను పళ్ళుకొరికేటట్లే ప్రసంగంవచ్చింది. రాయలు తను బెదరింపులకు లొంగే వ్యక్తి కాడనీ వాళ్ళకు తెలిసింది. తాము తొందరపడి రాయలమీద చెయ్యిచేసుకుంటే తమకూ బీజాపుర సుల్తానుకు పట్టిన గతేనని అనుకున్నారు. రాయలంటే వాళ్ళకు సింహస్వప్నమైంది. అందువల్లనే వాళ్ళు సఖాలలో మేలుకున్నారు. అందులోనూ రాయచూరు యుద్ధంలో తన అపారసైన్యం పోగొట్టుకుని పరదేశిలా యుద్ధరంగంనుంచి పారిపోయిన అదిల్‌శహానుకు రాయల పేరెత్తడానికికూడా భయంగావుండేది. అతడు వాళ్ళవీళ్ళ మూలంగా సంధికి ప్రయత్నించి విఫలుడై, చివరికి తనమిత్రుడైన అసద్‌ఖానును రాయల ఆస్థానానికి రాయబారిగా పంపించాడు.

బిజాపురసుల్తాను రాయబారపు లేఖతో అసద్‌ఖాన్ విజయనగరానికి వచ్చిచేరాడు. తిమ్మరుసు అతణ్ణి ఉచితరీతిగా ఆహ్వానించి, అతన్ని రాజోచితమైన శిబిరంలోవుంచి, రాయ

లకు విషయాన్ని అందజేశాడు. రాయలు ఈ విషయాన్ని విని ఏవిధమైన ఆసక్తినీ చూపలేదు. దీనివల్ల తిమ్మరుసుకు చాలావిషాదం కలిగింది.

దాదాపు ఒక మాసంరోజులు కాచుకునివున్నా బిజాపుర సుల్తానువద్దనుంచి వచ్చిన రాయబారిని చూడడానికి వెళ్ళలేదు. కావాలనే రాయబారినినిర్లక్ష్యంతో చూడసాగాడు రాయచూరు యుద్ధంలో పరాజితుడై పారిపోయిన సుల్తాను విషయంలో రాయలకు ఒకవిధమైన తిరస్కారముంది. అతడు ఉద్దేశపూర్వకంగా రాయబారిపట్ల తిరస్కారాన్ని చూపసాగాడు.

తిమ్మరుసుకు రాయల ఈ ప్రవర్తన మంచిదిగా తోచలేదు. రాయబారిని విచారించమని అనేక తూర్లు చెప్పి విఫలుడయ్యాడు. రాయలు రాయబారిపట్ల చూపుతున్న ఉదాసీనతను చూసి అతనికి ఖేదమే అయింది. శత్రువుమీద ఎంత కోపమున్నా దానిని రాయబారిమీద చూపడం ఉత్తమరాజధర్మంకాదు. ఈ విషయంలో రాయలు తన ఘనతకు తగని విధానంలో వర్తిస్తున్నాడనే తిమ్మరుసు భావన.

ఇలావుండగా ఒకరోజు అసద్‌ఖానే తిమ్మరుసుతో మాట్లాడడానికని అతని నివాసానికి వచ్చాడు. తిమ్మరుసు మూలంగానైనా ప్రభువులు తన రాయబారానికి దృష్టిమరల్చేలా చెయ్యాలని వచ్చాడు. ఒక్క మాసంరోజులు అతడు రాయల పిలుపుకోసం కాచుకుని విసిగిపోయాడు. తన రాయబార మేమిటని విచారించడాని కవకాశమివ్వని రాయలు దానికి మన్నన నిస్తాడా? అని ఆలోచన చెయ్యసాగాడు.

అక్కడ సుల్తాను రాయబార మేమయిందోనని తెలుసుకోవ డానికి ఆత్రుతపడుతున్నాడు. ఇక్కడ రాయలు దర్శనాని కవకాశ మివ్వలేదు. ఇలానే కాలం వ్యర్థమైపోతే తను సుల్తాను ఆగ్రహానికి గురికావలసివుంటుందని ఆలోచించి, తిమ్మరుసు మూలంగా ప్రభువుల సందర్శనం చేసుకోవడానికి వచ్చాడు.

తిమ్మరుసు రాయబారి అసద్‌ఖానును ఆదరంతో ఆహ్వానించి, అతని క్షేమసమాచారాలను విచారించాడు.

"మా కిక్కడ దేనికీ తక్కువలేదు...... కానీ, మేము వచ్చినపనిమాత్రం అలాగే వుండిపోయింది...... ఇదే మా చింత......" అని సంకోచపడుతూ అన్నాడు అసద్‌ఖాన్.

ఆచింత ఏమిటన్నది తిమ్మరుసు విచారించలేదు. అది అతనికి తెలిసేవుందని అతని ముఖమే చెబుతోంది.

"మేము ఇక్కడికి రావడం మీ విశ్వాసపు భారాన్ని మోసుకోవాలని కాదు...... మీ రనుకున్నట్లుగా మేము గురుతరమైన రాజకార్యానికి వచ్చివున్నాము. మేమువచ్చి మాసంరోజులైనా ఖామందులువారికి మామీద దయ రాలేదు. బహుశః ప్రభువులు మమ్మల్ని మరచేపోయినట్లు తోస్తోంది. కాబట్టి, ఈ విషయం హెచ్చరించడానికి మేము రావలసివచ్చింది. మాస్థితి—సేవకులస్థితి ఎంత సూక్ష్మమైన దన్నది తమకే తెలుసు. బిజాపురసుల్తానునుంచీ రోజూ రాయ బార మేమైనదనీ ఆదేశాలు వస్తూనే వున్నాయి. మేము అతనికి ఏమీ చెప్పలేని స్థితిలో వున్నాము. దీనివల్ల సుల్తా నాకు, మాకార్యంలో ఎక్కువదక్షత వహించడంలేదని,

అసమ్మతపడే పరిస్థితి సంభవించింది......తమరు మాకు ఖామందులతో కలుసుకోవడానికి వీలుకలుగజేస్తే తమకు మేము చాలా కృతజ్ఞులమై వుంటాము" అని వినయంగా అన్నాడు అసద్ ఖాన్.

రాయలు ఏ రాయబారినీ ఈవిధంగా చూడలేదు. రాయలెందుకు సుల్తాను రాయబారిని ఈవిధంగా చూస్తున్నా డన్నది తిమ్మరుసుకు పరిష్కరించలేని సమస్య అయింది. రాయల ఈ ప్రవర్తనపల్ల తిమ్మరుసు తలవంచేలా అయింది.

"రాయబారులూ, తమరు విసుగుపడకండి. ప్రభువులు పుత్రోత్సవపు గడబిడలో తమ రాయబారమంతటి గొప్ప రాజకార్యాన్నికూడా అంతగా మనస్సుకు పట్టించుకోలేదు. ఉండనీ, సాధ్యమైనంత త్వరలో తమను విచారించడానికి ప్రభువులతో విన్నవించుకుంటాను." అని సమాధానపరచి రాయబారిని పంపించివేశాడు.

రాయబారి వెళ్ళిపోయిన తర్వాత తిమ్మరుసుకు యింటిలో వుండడాని కిష్టంలేక రాయలను దర్శించి అన్ని సంగతులూ తెలియజెయ్యడానికి 'భువనవిజయం' వైపుకు తనే వెళ్ళాడు.

భువనవిజయం ఉన్నతమైన ప్రదేశంలోవుండి, అనేక ఉప్పరిగెలతోనూ, బంగారపు కలశాలతోనూ శోభిస్తోంది. దానిచుట్టూ బలమైన కోటవుంది. ఈ కోటలోపల అంతః పుర కట్టడాలు వ్యాపించి వున్నాయి.

కోటకు నాలుగువైపులా నాలుగు మహాద్వారాలు ఒకొక్క ద్వారంమీద ప్రకాశిస్తున్న బంగరు కలసగోపు

రాలు. ఈ ద్వారాలవద్ద సర్వవేళలా కావలికాచే పహారా వాళ్ళు. రాజనగరుకు రావలసినవారు మహాద్వారాన్ని దాటే రావాలి.

ఈమహాద్వారపు సమీపంలోనే మందుగుండుల ఖణిజాలూ, గుమాస్తాల, బంట్రోతుల, ఉన్నతాధికారుల నగారానౌబతుల కచేరీలూ వున్నాయి. వాటి సమీపంలోనే ఖైదీలనువుంచే తాత్కాలిక చెఱసాల కూడా వుంది.

మహాద్వారపు మరొకపార్శ్వానికి రాజుల అతిథులకనే ప్రత్యేకంగా నిర్మితమైన భవ్యమైన విడిది గృహాలు. అంతేకాక ప్రభువులు జరిపించే దానధర్మాలకోసం వున్న ధర్మశాలలు.

మహాద్వారంనుంచి రాజభవనపు ముఖ మంటపం వరకూ నేలమీద అమృతశిల, చంద్రకాంత శిలలను పరచిన ప్రశస్త రాజమార్గం. విశాలమైన ఆవరణాల మధ్య అనేక అపూర్వమైన పూలచెట్లూ, మల్లికా మంటపాలూ, నీరు చిమ్మేయంత్రాలూ శోభిస్తున్నాయి.

ముఖమంటపాన్ని ప్రవేసిస్తే, స్మృతి తప్పించునంతటి కళాకౌశలంతో ప్రకాశించే మహాద్వారం. ఎక్కడచూసినా గోడలకు పల్చటి తెరలు, నేలకు పర్షియాదేశపు శ్రేష్ఠమైన రత్నకంబళ్ళు, దంతపు స్తంభాలమీద, అనేక కళామయమైన చిత్రాలు, భిత్తికమీద వ్రేలాడుతున్న రంగురంగుల గాజు దీపాలూ, రకరకాల పుష్పగుచ్ఛాలూ, గోడ పైపైనున్న వాతాయనాలూ వున్నాయి.

రాజభవనపు ద్వారాన్నిదాటి లోపలికివెళ్ళితే ఒక వైపున రాజసభామందిరం, మరొక వైపున రాజాంతఃపురం.

సభామందిరం విశాలమై రెండుమూడువేల సభాసదులు చేరడానికి అనుకూలంగావుంది. సభామందిరం మధ్య సింహాసనం. దానికిరువైపులా ప్రతిష్ఠిత వ్యక్తుల ఆసనాలు. అక్కడక్కడా రకరకాల పూగుత్తులుగల సువర్ణకరండములు. సింహాసనంవెనుక గోడమీద భువనేశ్వరి తైలచిత్రం రంజిస్తోంది. అక్కడినుంచి రాజాంతఃపురానికి రావడానికి మరొక మార్గముంది.

రాజాంతఃపురంలో సుసజ్జితమైన, దివ్యాలంకృతమైన గదు లనేకం వున్నాయి. అక్కడ పనిచేసే అంతఃపుర స్త్రీలసంఖ్య పది పన్నెండువేలకు పైగావుంది. వారందరికీ అక్కడ వసతి సౌకర్యాలు ఏర్పాటు చెయ్యబడ్డాయి. దేశవిదేశాలనుంచి తీసుకురాబడిన అనర్ఘమైన వస్తువులక్కడవున్నాయి. ఎటుచూసినా నిలువెత్తు స్వర్ణవిగ్రహాలు, మణిమయ పీఠాలు. ఎక్కడచూసినా కస్తూరి జవ్వాజివత్తుల సుగంధ మలయ మారుతం.

నృత్యమందిరం వైభవోపేతంగా అలంకరింపబడివుంది. ఆ ప్రశస్తమైన భవనానికంతా, అమృతశిలలను పరచారు. ఉత్తమమైన రత్నకంబళ్ళు వాటిని మూసివున్నాయి. సూక్ష్మమైన తెరలతో కప్పబడిన వాతాయనాలమూలంగా గాలి—వెలుతురు వస్తోంది. గోడకు తాపితమై వున్నట్టున్న వెండిస్తంభరాజి, నృత్యపు వివిధ భంగిమలలో కళాత్మకంగా నిరూపించివున్న మదనికా విగ్రహాలూ, నృత్యాన్ని తిలకించే

వారికోసం అనేక సుఖాసనాలున్నాయి. రాయల ఒక సుఖాసనంలో కూర్చునివున్నాడు. నృత్యంలో తన్మయుడైన రాయలను ఒక కంచుకివచ్చి పలుకరించి, తిమ్మరుసు రాయలను చూడడానికై వచ్చివున్న విషయం తెలియజేసింది. తిమ్మరుసునకు నగరంతటా అంతఃపురంలో స్వైరం ప్రవేసించడానికి అనుమతవుంది. కృష్ణదేవరాయలకు మాత్రమేకాక ఈ రాజనగరుకే అతడు అప్పాజీ. తిమ్మరుసును అక్కడికే పిలుచుకు రావడానికి ఆజ్ఞ అయింది.

తిమ్మరుసు నృత్యమందిరాన్ని ప్రవేశించి ప్రభువులకు అభివాదనచేసి:

"ప్రభువులు నాట్యమగ్నులై వుండగా, వచ్చితొందర పెట్టవలసి వచ్చింది." అని నవ్వుతూ, రాయలు చూపించిన ఆసనంలో కూర్చున్నాడు.

"అప్పాజీగారూ నన్ను చూడడానికి వచ్చారంటే ఏదో గొప్పరాజ కారణమే వుందన్నమాట!"

"అవును ప్రభూ, సరిగా ఊహించారు. ఒక గొప్ప విషయాన్ని తమతో విన్నవించుకోవాలనే వచ్చాను."

"అది అదిల్ శహాన్ రాయబారపు విషయమే కదా!"

ఈమాటవిని తిమ్మరుసు చకితుడయ్యాడు.

"అవును ప్రభూ!"

"దానికేమిటి తొందర, నిదానంగా పరిశీలిద్దాం!"

"రాయబారిని యిలా కాచుకుని వుండేలా చెయ్యడం తమ ఘనతకు తగినది కాదు ప్రభూ! అతడు ఏదోగొప్ప విషయాలుగల లేఖను తెచ్చినట్టుంది."

"మనకు తెలియని గొప్పవిషయ మేముంటుంది? బహుశః సుల్తాను సంధి కోసం, శాంతి భిక్షకోసం ఈ రాయ బారిని పంపించాడు. అంతే."

"ప్రభువులకు యివి తెలియని విషయాలేమీకావు. అయినా రాయబారికి తమను వచ్చిచూసే అవకాశమిస్తే రాయబార మేమిటైనదీ నిర్ణయమవుతుంది."

"ఉండనీ. మన విరామకాలంలో రాయబారిని పిలి పించుకుందాం."

"విరామమని కూర్చునే సమయం కాదుప్రభూయిది. రెండు రాష్ట్రాలసంధి, విగ్రహాల భవిష్యత్తు దానినుంచి సాధించేలావుంది."

"మీరు చెప్పినట్టుగా ఈరాయబారం మహత్త్వారిత మైనదైతే — రేపటిరాజసభలో దాన్ని పరిశీలిద్దాం. ఈ విషయం రాయబారికి తెలియజెయ్యండి" అని అన్నాడు.

ఈమాటలతో తిమ్మరుసు ముఖంలో మందహాసం గోచరించింది. ఇదిచూసి "ఈపాటి చిన్న విషయానికిగా అప్పాజీగారు ఇంతదూరం దయచెయ్యాలా?" అని నవ్వాడు.

"ఇది చిన్న విషయంకాదు ప్రభూ!"

"ఇది చిన్న విషయంకాక మరేమిటి? బిజాపురసుల్తా నుని రాయబారంలో ఏ గొప్పవుంది? సుల్తాను రాయచూరు యుద్ధంలో తగిలిన ఆఘాతంనుంచి ఇంకా కోలుకోవున్నట్టే లేదు. మనశక్తిని గ్రహించినవాళ్ళెవ్వరూ అతనికి ఆశ్రయ మివ్వలేరు. ఇది ఖండితం. ఇప్పుడు సుల్తాను రాజ్యకోశా లున్నా, దిక్కులేని పరదేశిలా దుఃఖిస్తున్నాడు. అతనికి

ఇప్పుడు కావలసినది సంధి. తన గొడవకు మనం రాకుండా వుండడానికి కావలసిన ఒప్పందం చేసుకోవాలనే ఈ రాయబారం! దీన్లో ఏ గొప్పవుంది అప్పాజీ?"

"అలా కాదు ప్రభూ! ఇప్పుడు సుల్తాన్ అదిల్ శహాను ఓటమిపొంది, మనదయాభిక్ష యాచిస్తున్నాడు. కానీ—పరిస్థితుల ఒత్తిడివల్ల యిలా చేస్తున్నాడే కానీ మన స్ఫూర్తిగా కాదు. బీజాపురపు క్రిందటి సుల్తానులు ఎంతటి బలవంతులన్నది చరిత్రకే తెలుసు. వాళ్ళు విజయనగర సార్వభౌములను ఎన్నిసార్లు కప్పములు, కానుకలు చెల్లించేలా చేశారు అన్నది మరువకూడదు. శత్రువు యిప్పుడు దురదృష్టవశాత్తూ నేలపడివుండగా అతని శక్తిని నిర్లక్ష్యించి మళ్ళీ కోపింపచెయ్యడం అవివేకమే. సింహము ముసలిదైతే నేమి! గుంటలో పడివుంటే నేమి? ఒక్కసారి కోపించి నిలబడిందంటే, ప్రాణంమీద ఆశ వదలి పోరాడుతుంది... ... ఎంతటి ఏనుగనైనా వెనుక ముందులు చూడకుండా మీదపడి గాయపరుస్తుందన్న సత్యాన్ని మనం మరువకూడదు ప్రభూ!"

"అయితే సుల్తానుకు ఇంకా మనమీదపడే చైతన్యమూ—ధైర్యమూ వుందని మీరంటున్నారా?"

"నామాటల అర్థం అలా కాదు ప్రభూ! సుల్తాను రాయచూరులో జరిగిన పరాభవంతో శక్తి గుండిపోయాడు. బహుశః తానుగానే యుద్ధానికి రాలేడు. కానీ, సంధిగా— గౌరవమైన ఒప్పందానికి వచ్చినా రావచ్చు. ఈస్వర్ణ సంధి అవకాశాన్ని జారవిడుచుకోకూడదు. నాలుగు యుద్ధాల

నుంచి సాధించలేని మైత్రి—నెమ్మది ఈ ఒక్క సంధితో సాధింపపడుతుంది. రెండు రాష్ట్రాలకూ అన్యోన్య వృధాహాని తప్పుతుంది. ఇదే జీవనమార్గం. పగ అనే బీజాన్ని ఒక్క తూరి వేశామంటే దానినుంచి పగఅనేవృక్షమే పెరుగుతుంది కానీ శాంతి వృక్షంపెరుగదు. నావినమ్రమైన సలహా ఏమిటంటే, ఓడిపోయి స్నేహ—శాంతి భిక్షులకు వచ్చివున్న సుల్తానును గౌరవంతో చూసి అతనితో శాశ్వత ఒప్పందం చేసుకుందాం. దీనివల్ల ఉభయ రాజ్యాలకు కళ్యాణం కలుగుతుంది.''

"అయితే మీదృష్టిలో మనం చేబట్టిన యుద్ధం జీవన మార్గంకాదా? దీనివల్ల శాంతికలుగదా?''

"ప్రభువులకు తెలియని విషయాలేమీ లేవు.''

"అప్పాజీ, నాకీమధ్య సంశయంవస్తోంది. ఈరోజు మీమాట దానిని ధృఢ పరుస్తోంది ''

"ఏసంశయం ప్రభూ?'' ఆశ్చర్యంగా అడిగాడు.

"తాము పూజ్యులైన వ్యాసరాయస్వాముల శిష్యులవడానికి తలచుకుంటున్నట్టు విన్నాను. నిజమేనా?''

"ఆ భాగ్యం ఈ పామరునికుంటే, ఇతనివంటి పుణ్యశాలి మరొకడులేడు. మహామునులూ, సాక్షాత్ ప్రణవ స్వరూపులూ, అవతారపురుషులూ అయిన వారిపాదసన్నిధిలో శిష్యుడయ్యేందుకు నాకు వేళఎక్కడిది ప్రభూ! అయినా ఎప్పుడో ఒక్కతూరి శ్రీమఠంలో జరిగే పూజ; పునస్కారాలకు వెళ్ళి ప్రసాదం స్వీకరించి వస్తున్నాను. అంతే దానికంటే ఎక్కువపుణ్యం నాకులేదు—''

"అవును అప్పాజీ. వాళ్ళు మహామునులు. వాళ్ళ తపః ప్రభావంతో నా దురభిప్రాయం నివారణ అయింది. పవిత్రమైన రత్నసింహాసనాన్ని అధిష్ఠించడానికి నాకుండిన అసంతృప్తి వారి కృపవల్ల తొలగిపోయింది. అంతటి దైవాంశ సంభూతులు రాజభవనంలో వుండడం మా పుణ్యఫలమే అనాలి."

"నేను శ్రీమఠానికి వెళ్లుతున్న విషయం తమకు ఎలా తెలిసింది ప్రభూ?"

"మా కెలాగో తెలిసింది అప్పాజీ. మీరు కాషాయవస్త్ర సన్యాసం చేసి వేదాంత పురాణాలలో మీ వేళను గడుపుతున్నారనీ విన్నాను. ఆమాట నిజమైతే, అప్పాజీగారూ సన్యాసులే అవుతారనీ భయపడ్డాను. అందువల్లనే సూటిగా ఈవిషయంగా అడిగాను" అని రాయలు నవ్వాడు.

"సమరంలో ప్రాపంచిక వ్యవహారంలో ఎక్కువ పొందిన ఈ దేహానికి సన్యాసం సరైన ఔషధమౌతుందా? ఇదివరకూ చెప్పబోయేదలా పెరిగిన ఈ శరీరానికిప్పుడు ప్రాపంచిక సుఖ నశ్వరత తెలిసివస్తోంది. ఇకనైనా పుణ్యసంచయం చెయ్యడానికి భగవంతునిమీద మనస్సు నిల్పుతున్నాను. అంతే."

"అలాగైతే నా ఊహ తప్పు కాదన్నమాట!"

"ఏ ఊహ ప్రభూ?"

"మీరు రాజకీయంలో, యుద్ధవిషయంలో చూపుతూ వచ్చిన తాటస్థ్య నీతికి — నిరాసక్తికి మీలో కలిగిన పరి వర్తన మేమిటని ఆలోచిస్తున్నాను. అప్పాజీగారు ఏం లేదు

లైన తర్వాత నేనూ మీలానే సన్యాసం స్వీకరించి, అడవికి వెళ్ళుతాను'' అన్నాడు నవ్వుతూ.

తిమ్మరుసు సంధానం సఫలమైంది. మరుదినం జరిగిన విశేషదర్బారులో రాయబారి అసద్‌ఖాన్‌ను ప్రభువులతో కలుసుకోవడానికి ఆహ్వానించాడు.

సభలో విచారించే అదిల్‌శహాను రాయబారమేమిటని తెలుసుకోవడానికి సభాసదులందరు నిర్ణీతవేళకు ముందేవచ్చి తమఆసనాల నలంకరించారు. రాయలునిశ్చితవేళకు రాజసభకు వచ్చి రత్నఖచితమైన సింహాసనంలో కూర్చున్నాడు.

అసద్‌ఖాన్ ప్రభువులకు సలాంచేసి, తలవంచి నిల్చు న్నాడు. అనంతరం రాయల ఆజ్ఞప్రకారం, తెచ్చివున్న రాయబార పత్రాన్ని ప్రధానామాత్యులైన తిమ్మరుసుచేతి కిచ్చాడు. ఆతర్వాత తనకని ఏర్పాటుచేసిన ఆసనంలో కూర్చున్నాడు.

ప్రభువుల ఆనతిమేరకు తిమ్మరుసు అదిల్‌శహాను పంపిన పత్రాన్ని గంభీరంగా చదివాడు.

''స్వస్తి శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వరే త్యాది బిరుదాంకితులైన విద్యానగర రత్న సింహాసనాధీశులు సార్వభౌమ శ్రీకృష్ణదేవరాయ భూపాలుర సన్నిధికి—

బిజాపుర సుల్తాను ఇస్మాయిల్ అదిల్‌శహాను విశ్వాస పూర్వకంగా వ్రాస్తున్న లేఖఏమిటంటే —

తమరు సత్యసంధ; న్యాయశీల ప్రభువులని భరత ఖండంలో అంతా ఖ్యాతిగాంచారు. లోకమే తల ఊపగల తమ న్యాయనిష్ఠను మామీదకూడా వుంచాలని ప్రార్థన!

మనం పరస్పరం చేసుకునివున్న శాంతి సంధిని ఇంత వరకూ పాలిస్తూవచ్చాము. ఏదో స్వల్ప కారణానికిగా సార్వభౌములు నామీద ఆక్రోశపడి, మన ఒప్పందాన్ని ఉల్లంఘించి యుద్ధం ఘోషించి, రాయచూరు తదితర సరిహద్దు ప్రాంతాలను ఆక్రమించుకున్నారు. మేముచేసి వుండవచ్చునన్న అపరాధానికి ఎక్కువగా శిక్షనే విధించారు. మహాశూరులూ, సమర్థులూ అయిన తమతో చేసుకుంటున్న విన్నపమేమంటే రెండు రాష్ట్రాల అభివృద్ధి మన యిరువురి స్నేహసౌహార్ద్రతల మీద నిల్చివున్నాయి. కాబట్టి సార్వభౌములు ఇదివరకు జరిగినది మరచిపోయి స్నేహ భిక్షను యివ్వాలి. అలాగే సార్వభౌములు మానుంచి వశపరచుకుని వున్న సరిహద్దు ప్రదేశాలనూ, ఏనుగులనూ, గుఱ్ఱాలనూ, ఖైదీలుగా చిక్కిన యుద్ధభటులనూ తిరిగి మాకు అప్పగించి మాతో గౌరవమైన ఒడంబడిక చేసుకుని స్నేహితుల్లా వర్తించుకోవాలని కోరుతున్నాము.

ఇట్లు
విశ్వాసనీయులు—
ఇస్మాయిల్ అదిల్‌శహాన్"

ఈలేఖనువిని సభికులంతా క్షణకాలం స్తబ్ధులయ్యారు. అందరూ రాయలనుంచి ఏ ఉత్తరం వస్తుందోనని కుతూహలంతో రాయలనే చూస్తూ కూర్చున్నారు.

కృష్ణదేవరాయలు కొంతసేపు ఆలోచిస్తూకూర్చుని అనంతరం "మాన్య ఆస్థానికులారా, సభాసదులారా! ఇప్పుడు

తమకందరికీ బిజాపురసుల్తాను ఇస్మాయిల్ అదిల్‌శహాన్ పంపించివున్న లేఖాంశాలు తెలిసివున్నాయి. వీరులూ, సాహసవంతులూ అదిల్‌శహానుగారుమాతో స్నేహాకాంక్షులై సంధికి వచ్చివున్నారు. మేమూ సుల్తానులలానే స్నేహ సౌహార్దతలకోసం ఆతృతగానే వున్నాము. అతడు తమలేఖలో తెలిపివున్నట్టే క్రితం జరిగిపోయినదానిని మరచిపోయి, అతని కోరికలానే అతనినుంచి వశపరచుకునివున్న ప్రదేశాలనూ, యుద్ధోపకరణాలనూ తిరిగి యివ్వడానికి నాఆక్షేపంలేదు. కానీ— ఒకే వక్కాణరతు. అదేమంటే సుల్తానులు నిజమైన స్నేహసౌహార్ధతలు కోరుతున్నట్టయితే, వాటిగుర్తుగా మా రాజధానికివచ్చి, మానుంచి స్నేహతాంబూలం పుచ్చుకుని మాపాదచుంబనం చెయ్యాలన్నదే మా ఆశయం. దీనిలో ఏదురాలోచనాలేదు. ఇది మా స్నేహసౌహార్దతల సంకేతం, అంతే. సుల్తానులు మా యీ ఆశయాన్ని కార్యగతం చేసే ట్టయితే, ఆయన కోరిన గౌరవపూర్ణమైన ఒడంబడికకు మేము సిద్ధంగావున్నాము'' అని చెప్పి, బిజాపురసుల్తానుకు యిదే నిరూపణాన్ని పంపించేలా ప్రధానామాత్యులైన తిమ్మరుసుకు ఆదేశించి, అక్కడినుంచి కాలు తీసాడు.

తిమ్మరుసు—అసద్‌ఖానులాదిగా అందరూ రాయలు ఆజ్ఞాపించిన విచిత్ర నిరూపణానికి, నిశ్చేష్టులై నోళ్ళు తెరుచు కుని నిలబడ్డారు.

# 10

ప్రధాన మంత్రి సాళ్వ తిమ్మరుసుకు సార్వభౌమ కృష్ణదేవరాయలు వ్యక్తపరచిన అభిప్రాయంతో చాలా విషాదమైంది. శత్రువుల విషయంలో మాత్రం రాయలు అగౌరవంగా ప్రవర్తించాడు. ఓడిపోయి శరణని సంధికివచ్చిన అదిల్‌శహానును మరింత భంగపరచి, అవమానం చెయ్యడం మూలంగా తనపాతవైరాన్ని సాధించడానికి పూనుకున్నాడు. నిండుసభలో (రాయల) పదచుంబనం చెయ్యడం మూలంగా సుల్తానును అవమానపరచి, అతణ్ణి పదాక్రాంతునిగా చేసుకోవడమే రాయల ఆశయమా? ఈ విధమైన ప్రవర్తనతో స్నేహం మెప్పూ అభివృద్ధికావు. ప్రతీకారప్రుటగ్నికి మరికొంత ఆజ్యాన్ని పోసినట్టే అవుతుంది. ఇంతటి అవమానాన్ని సుల్తాన్ అదిల్‌శహాన్ ఎప్పటికీ సహించలేడు. రాయల దుడుకు ప్రవర్తనవుంచి ఉభయరాష్ట్రాలకూ లభించుచున్న స్నేహం, శాంతి, నెమ్మదుల సదవకాశం తప్పిపోతుంది, అని తిమ్మరుసు పరితపించాడు. మళ్ళీరాయలను కలుసుకుని అతని నిజమైన అభిప్రాయాన్ని తెలుసుకుని ఆతర్వాతనే రాయబారికి లేఖను యివ్వవచ్చునని ఆలోచించుకుని, రాయలను అంతఃపురంలో కలుసుకున్నాడు.

“ఈవిషయంలో మీరెందుకు కళవళపడాలి అప్పాజీ? నేను వ్యక్తపరచిన అభిప్రాయాలలో అవమానం కలిగేలాంటి విషయమేముంది?” అని అడిగాడు.

"ప్రభువులన్యథా భావించకూడదు. శత్రువు నిశ్శక్తుడై వున్నప్పుడు ద్వేషాన్ని మరచి అభయహస్తమిచ్చి, ఉద్ధరించ వలసినది తమకర్తవ్యం. తమరూ స్నేహసౌహార్ద్రతలపట్ల ఆతురత చూపుతున్నట్టు ఆనతిచ్చారు. ఇది సంతోషించవలసిన విషయమే. కానీ—స్నేహమనునది రెండు సమానవ్యక్తుల నడుమ వికసించే కుసుమం. హెచ్చుతగ్గులనుకుంటే దాని మొగ్గవాడిపోతుంది! కాబట్టి ప్రభువులు ఓటమిపొంది శరణాగతుడౌతున్న అదిల్‌శహానుకు స్నేహాభిక్ష పెట్టేట్టయితే, అతనిని సమానమైన వ్యక్తినిగా పరిగణించాలి."

"మేము ఎవరినీ హెచ్చుతగ్గులని పరిగణించలేదు. మేము బిజాపుర సుల్తానులు తెలియజేసిన అన్ని షరతులనూ ఉదారహృదయంతో ఒప్పుకొని, అతని ఆశయంలానే శాంతి సంధికి సమ్మతించామే!"

"ప్రభువులు శాంతిసంధికి సమ్మతించారు. నిజమే. కానీ, చేసుకునే ఒప్పందాలు పరస్పరం గౌరవయుతంగా వుంటేకదా వ్యక్తుల ఘనత మిగిలేది?"

"అంటే... ..."

"ప్రభువులు స్నేహాభిక్ష నివ్వడానికి నిశ్చయించారు. కానీ, స్నేహప్రీతివిశ్వాసాలు, సహజమైన భావాలు బలాత్కరించడంవల్ల పొంగివచ్చేభావాలుకావు."

"అయితే మా స్నేహసందేశం కృతకమైనదా?"

"నేను ఎలా చెప్పను ప్రభూ?"

"అయితే మీ రసడమైనా ఏమిటి?"

"ప్రభువులు సుల్తానుతో స్నేహం పొందడానికి తలుస్తున్నట్లయితే, అతనిని తమతో సమానస్థమైన గౌరవంగల వ్యక్తినిగా చూసుకోవాలి. ప్రభువుల ప్రీతి విశ్వాసాలు అయాచితంగా వుండాలి. నిర్వ్యాజంగా వుండాలి."

"అంటే?"

"ప్రభువులు ఏ పరిగా పెట్టకుండా ఒప్పందం చేసుకోవాలి."

"నేను పాదచుంబనం కోరినది మాత్రం అతనికిగల స్నేహవిశ్వాసాల సంకేతమునకే కానీ మనోదృష్టితో కాదు."

"ప్రభువులు సుల్తానులను స్నేహితునిలా చూచుకోవడానికి సమ్మతించివుంటే పాదచుంబనం నూచుకుందుకు ప్రభూ? దీనివల్ల స్వయంసుల్తానుడైన అదిల్ శహాను ఆత్మగౌరవానికి దెబ్బతగులకుంటే లేదా? ఇంతటి అవమానాన్ని వాళ్ళు సహించడానికి సిద్ధులుగా వున్నారా? ఇప్పుడు తాము పగతీర్చుకుంటున్నారో-సంధి చేసుకుంటున్నారో తెలియడంలేదు."

"మీరు ఎలా అనుకుంటున్నారు అప్పాజీ?"

"నామనస్సులో వున్నది దాపరికం లేకుండా, స్పష్టంగా చెబుతున్నానని తమరన్యథా భావించకండి. కర్తవ్యపరుడనై తమకు అహితకరమైన మాటను చెప్పవలసి వచ్చింది. ప్రభువులు సుల్తానుతో పైకి స్నేహపుమాట చెబుతున్నా, వాస్తవంగా అంతరంగంలో ఇంకా ప్రతీకారపుటగ్ని అర్థలేను. రగులుతూ నేవుంది."

"అవును. అప్పాజీ, మీరు నిజమైనమాటనే అన్నారు. నా హృదయాంతరాళంలో అణగివున్న భావాలనే చెప్పారు.

మీతో దాపరికమెందుకు? అదిల్‌శహానుతో నేను ఎప్పుడూ స్నేహాన్ని కోరలేదు. ఇప్పుడూ కోరడంలేదు. సిద్దిమర్కారును స్నేహితుడని భావించి గౌరవించాను. చివరికైన చేమిటి? విద్రోహం? ఎంత నిర్మల హృదయులుగావున్నా విద్రోహులు విద్రోహులే!...అందులోనూ మహమ్మదీయులను నమ్మడానికి సాధ్యమే లేదు. ఇది నా స్వానుభవం. అంతే కాక క్రిందటి సుల్తానులు మా క్రిందటి సార్వభౌములకు చేసివున్న అవమాన, అన్యాయ, అపచారములను మరువ గలనా? సంగ వంశపు దేవరాయ భూపాలురను బిజాపురపు అహమ్మద్‌షాహీ బహమనీ సుల్తాను చూసిన విధానం ఈ రత్నసింహాసనంమీద కూర్చున్న ఏ దేశాభిమాని మరువ గలడు? దురదృష్టంవల్ల యుద్ధంలో అపజయంపొంది పట్టు బడిన యువరాజును గాడిదమీద కూర్చోబెట్టి, తన కాలు పట్టుకునేలా చేసిన అవమానాన్ని దేశప్రేమికుడైన ఏ మను ష్యుడు మరువగలడు? అప్పటినుంచీ ఈ అవమానపుటగ్ని ప్రజ్వలిస్తూనేవుంది. అప్పుడు రక్తంతో వ్రాసిన ఆ 'పగ' చరిత్రను ఇప్పుడు రక్తంతోనే చెరిపివేయ్యాలని నిశ్చయిం చాను. ఇప్పుడు దైవానుగ్రహంవల్ల సదవకాశం లభించి వుండగా దాన్నివ్యర్థపర్చడమా అప్పాజీ?" అని ఉద్వేగంతో అన్నాడు.

"మహాప్రభూ! పగకు వశులయ్యారంటే వివేకం నశించిపోతుంది. ఒక్కతూరి శాంతచిత్తంతో ఆలోచించి చూడండి. పగతీర్చుకోవాలి, నిజమే. కానీ — పగ ఎవరి మీద తీర్చుకోవాలి? క్రితం ఎవరో సుల్తాను చేసిన దుష్కృ

త్యాన్ని ఇప్పుడు మీరు చేస్తే దీనినుంచి పగతీరినట్టవుతుందా? అదిల్‌శాహోనుకు పూర్వులు చేసినతప్పుకు అదిల్‌శాహోనును దండించడం న్యాయమా? రాజ్యకళ్యాణపుదృష్టితో ధర్మావతారులైన తమరు సావధానంగా పర్యాలోచించాలి. పరాజితుడైన శత్రువుమీద పగతీర్చుకోవడంవల్ల సామ్రాజ్యానికి హాని సంభవించడంలేదా? ఇప్పుడు ప్రభువులు పగకోసం బిజాపూర సుల్తాను నొకనిని పాదచుంబనంతో అవమాన పరచి నట్టయితే రేపు తమకూ యిదే దుస్థితి రావచ్చునని తక్కిన బహమనీ సుల్తానులందరూ తమ వైయక్తిక మనస్తాపాలను ప్రక్కకుత్రోసి బిజాపురసుల్తానుని పరంగా దాడిచేస్తే మన స్థితి ఏమిటౌతుంది? ఇది తొందరపడవలసిన విషయంకాదు ప్రభూ! మనం యిప్పుడు తొందరపడిచేసిన నిర్ణయానికి ముందటివాళ్ళు కష్టాలనుభవించవలసిన సందర్భం సంభవించవచ్చు. కాబట్టి ప్రభువులు బాగా ఆలోచించాలి.”

“అప్పాజీ, మేము ఇవన్నీ పర్యాలోచించే ఈవిధానం సరైనదని నిర్ణయించాము. రాజ్యహితానికి దీనివల్ల ఎంత మట్టుకు సాధకబాధకాలన్నది పరిశీలించడానికి మీవంటి రాజోద్యోగులకు వదలివేశాను. ఇప్పుడు మాకు కావలసినది పగ—మా పూర్వులకు జరిగిన అవమానానికి తగిన పగ. ఈ మూలంగా వారిఆత్మను శాంతపరచడం! ఈ విషయంలో ఎవరెన్ని చెప్పినా నేను నా నిశ్చయాన్ని మార్చుకోలేను. ఇది ఖండితం” అని రాయలు కఠోరంగా అన్నాడు.

రాయలు వీరప్రతిజ్ఞను చేసేవిధానంలోనే ఈ నిర్ణయాన్ని చెప్పివుండడం, రాయలను విచలితపరచడానికి ఎవరి

నుంచీనూ సాధ్యంలేదని స్వానుభవంవల్ల తిమ్మరుసు తెలుసు కున్నాడు. "తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తుంది. దీనిలో పురుషప్రయత్నానికి మించిన ఏదో దైవశాసన ముంది. అందువల్లనే సాధించడానికి సాధ్యమైన శాంతి, స్నేహ, సౌహార్ధతలు, వైరానికి చోటిస్తున్నాయి. అమృతం హాలాహలమైంది. పంపాపతి అభీష్టమెలావుందో అలా జరుగనీ"—అని తిమ్మరుసు భారమైన హృదయంతో యింటికి మరలాడు.

అప్పుడే ఈ విషయమైన లేఖను సిద్ధపరచి రాయల రాజముద్రతో రాయబారియైన అసద్ ఖానుకు పంపించాడు.

ఈ లేఖను అసద్ ఖాన్ సకాలంలో అదిల్ శహానుకు అందజేశాడు. ఈపత్రాన్ని చదువుకుని అదిల్ శహానులో కలిగిన పరిణామమేమిటన్నది తెలియకపోయినా, అదిల్ శహాను నుంచీ రాయలకువచ్చిన మరు జవాబునుచూసి రాయలూ తిమ్మరుసూ చకితులయ్యారు.

ఆ లేఖలో అదిల్ శహాను రాయల ఔదార్యాన్ని శ్లాఘించి, కృష్ణదేవరాయలంతటి సార్వభౌమునితో స్నేహితుడుగా వుండునంతటి గౌరవం తనకు దొరికినందుకుగా సంతోషాన్ని వ్యక్తపరచాడు. ఇందుకుగా తను ఏపని చెయ్యడానికైనా సిద్ధంగా వున్నట్లూ, తను రాయల పాదచుంబనాన్ని అగౌరవమని భావించడంలేదనీ తెలియజేశాడు. కానీ, తను రాయల యిష్టప్రకారం రాజధానికి రావడానికి అనానుకూలత లున్నాయనీ, రాయలను ఏ ప్రదేశంలో కలుసుకోవలసినదీ తెలియ జెయ్యమని కోరాడు.

ఈ లేఖను చదువుతున్న రాయలు అదిల్‌శహాను నయగారపు మాటలకు వశుడయ్యాడనే చెప్పాలి. అన్నీ తన ఆశయప్రకారమే జరుగుతున్నాయని తెలిసి రాయలు సంతోషించాడు. కానీ — లేఖను చదివిన తిమ్మరుసుకు అంత సంతోషం కలుగలేదు. అతనికా పత్రంలో ఏదో మోసం అణగివున్నట్టుగా అనిపించింది. ఆత్మాభిమానమున్న ఏవ్యక్తీ రాయల కోరికను సంతోషంగా నెరవేర్చలేడన్న వాస్తవ సత్యాన్ని గ్రహించిన తిమ్మరుసుకు అదిల్‌శహాను లేఖలోని విషయాలు — ఆశ్చర్యాన్ని కలుగజేశాయి. పత్రాన్ని వేగంగా అశ్వారోహకుని ద్వారా పంపించబడివుంది. అంతే కాక పత్రంలో అదిల్‌శహాను విజయనగరానికి రావడానికి సమ్మతించక మరొకచోట కలుసుకోవడాని కాశించాడు. వీటి అర్థమేమిటి? ఈ లేఖప్రకారమే రాయలు నడుచుకుంటే అతడు ఏదో అపాయానికి లోనుకావచ్చునన్నభయం కలుగసాగింది. ఆ పత్రపు ఆంతర్యాన్ని గ్రహించి రావడానికి వెంటనే గూఢచారులను పంపించాడు.

గూఢచారులు సంగ్రహించుకుని వచ్చిన వార్త తిమ్మరుసు ఊహను నిజంచేసింది. సుల్తాను రాయలను ఉపాయంగా ఏదో తంత్రంలో చిక్కించడానికి ప్రయత్నిస్తున్నాడనీ, అందువల్లనే రాయబారపు కపట నాటకమాడుతున్నాడనీ తెలిసింది. సుల్తాను తంత్రాల విషయమై వివరాలు దొరుకక పోయినా, అతనిలో దురుద్దేశమున్నదని దృఢపడింది, అతనితంత్రానికి ప్రతితంత్రంచేసి అతనిదురుద్దేశాన్ని బయలుపరచి తగిన శాస్తిచెయ్యాలని తిమ్మరుసు నిశ్చయించు చు

కున్నాడు. ఈసంగతిని రాయల చెవిలోవేసి జాగ్రత్తగా వుండు నట్లుహెచ్చరించి, అనంతరం తనుఎలాప్రవర్తిస్తే అతని విద్రోహాన్ని బయల్పరచ వచ్చునని పర్యాలోచించి నిర్ణయానికి వచ్చాడు.

ఆ నిర్ణయ ప్రకారం కృష్ణదేవరాయలు బిజాపుర సుల్తానుని తన సామ్రాజ్యపు సరిహద్దు ప్రదేశంలో వచ్చి కలుసుకోవలసినదనీ, తన పరివారంతోకలసి వచ్చి వుండవల సినదనీ తెలియజేసి కలుసుకోవలసిన రోజునుగూడా నిర్ణయించి వ్రాసి పంపించాడు.

నిశ్చితవేళకు బిజాపుర సుల్తానును కలుసుకోవడానికి రాయలు సైన్యసమేతంగా వెళ్ళాడు. కావాలనే సైన్యాన్ని రెండుభాగాలుగాచేసి, ఒక భాగాన్ని తనతో తీసుకువెళ్లాడు. ఇంకొక భాగాన్ని తిమ్మరుసు తనవెంట పెట్టుకుని శత్రువు ఆకస్మికంగా పైనపడితే కలుసుకోవడానికి స్వల్పదూరంలో రాసాగాడు.

ఇలా వెళ్ళినరాయల సైన్యం నిశ్చితవేళకు సరిహద్దు ప్రదేశపు ప్రముఖదుర్గమైన ముద్గల్లుకు సమీపంగావచ్చి చేరింది. రాయలు తనువచ్చివున్న వార్తను సరిహద్దు కావలి భాగంలోవున్న అదిల్‌శహానుకు తెలియ జెయ్యడానికి దూత లను పంపించాడు. దూతలు తేనున్న ప్రత్యుత్తరం కోసం కాచుకుని కూర్చున్నాడు.

ఇక్కడ రాయల రక్షణార్థపు గుంపుతో వచ్చిన గోవిందరాజు ఊరకనే కూర్చుని వుండలేక — విశ్రాంతిలో

న్మైమగువక — శత్రువుల చర్యలు కనిపెట్టడానికి తన ఆప్తులైన కొంతమందితో వెళ్ళాడు.

గోవిందరాజు పరిహాద్దు కవతల రాయలకు స్వాగతమివ్వడానికి సిద్ధంగా కూర్చునివున్న బిజాపుర సుల్తానుని తెలుసుకోవడానికి దొమ్మరివాళ్ళ వేషం వేసి, మిత్రులను వృత్తి బాంధవులనుగా చేసుకుని, వృత్తికి తగిన ఏర్పాట్లతో వెళ్ళి సుల్తాను వేసివున్న పాళ్యంవద్ద వచ్చిదిగాడు.

గోవిందరాజుని మిత్రులు, గెడెకంబాలమీద సాహస ప్రదర్శన చెయ్యడానికి వృత్తిలో ప్రవీణులైన దొమ్మరి వాళ్ళను తమతోనే తీసుకొచ్చారు. అసలు సుల్తానుని శిబిరపు సమీపంలో గెడెకంబాన్ని నిలబెట్టి తమ డోలుమీద దెబ్బలుకొట్టి ఆటకు ఆహ్వానం చెయ్యగానే సమీపంలో శిబిరపు పనిలోవున్న పనివాళ్ళు చాలామందీ, సైనికులూ గుంపులు కూడుకుని దొమ్మరాట చూడడానికి చేరారు.

ఆ ప్రదేశంలో ఒక భవ్యమైన రాజభవనపు పనిజరుగుతోంది. దానిని సార్వభౌముల వైభవానికి తగిన రీతిలో అలంకరించారు. రాజసౌధపు అన్నిఅలంకారాలూ ముగుస్తూ వచ్చి వున్నాయి. మరుసటిరోజు అక్కడ సార్వభౌమ శ్రీకృష్ణదేవరాయలకు ఆతిధ్యమివ్వాలని అదిల్‌శహాను నిర్ణయించాడు. అందువల్లనే అదిల్‌శహాను కట్టడపు పనిదసము సౌకర్యాలను పరిశీలించడానికి రానున్నాడు. దానికోసం పనివాళ్ళు చాలా గడబిడలో వున్నారు.

అయినప్పటికీ దొమ్మరాటను చూడడానికి పనివాళ్లు మేస్త్రీల కళ్ళుగప్పి తప్పించుకుని వస్తున్నారు. ఏమీ పనిలేని

సైనికులు గుంపులు గుంపులుగా నిలబడి ఆకస్మికంగా లభించిన ఈ మనోల్లాసాన్నాస్వాదిస్తున్నారు.

దొమ్మరాట చాలా అద్భుతంగా జరుగుతూవుంది. వాళ్ళెవరూ దొమ్మరవేషంలోవున్న గోవిందరాజునుకానీ, అతని పక్షపు వాళ్ళనుకానీ గుర్తించడానికి సమర్థులు కానంత మనోరంజకంగా జరుగుతోవుంది. గోవిందరాజు నుదుట ఒక ఇత్తడి బిళ్ళను కట్టుకొని, తలవెంట్రుకలను సవరించుకుని, శరీరానికంతా బూదిపూసుకుని వున్నాడు. కాళ్ళు చేతులకు దొమ్మరివాళ్ళు వేసుకున్నట్టే వెండిగొలుసులను ధరించాడు. చూడడానికి అతడు పుట్టుదొమ్మరివానిలానే కన్పిస్తున్నాడు. పిల్లదాని తండ్రి డోలుకొడుతుంటే గోవిందరాజు ఈల వేస్తున్నాడు. దొమ్మరిపిల్ల గెడెకంభంమీద సాహసప్రదర్శన చేస్తోంది. గోవిందరాజు స్నేహితులు అనేక వ్యాయామాలను, చాకచక్యాలను ప్రదర్శించి అందరిమెప్పు పొందారు.

దొమ్మరాట ముగిసిన తర్వాత పనివాళ్ళు తమ పని శాలలకు వెళ్ళిపోయారు. సైనికులు తమ శిబిరాలకు తరలారు. అయినా కొంతమంది సైనికులు ఆపిల్లదాని సౌందర్యానికి వశులై అక్కడక్కడే తిరుగుతున్నారు. వాళ్ళు పిల్లదాని తండ్రిని స్నేహం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. అలాంటి సైనికులనుంచీ గోవిందరాజు అనేక ఉపయుక్తాంశాలను సంగ్రహించుకున్నాడు.

మధ్యాహ్నంభానుడు నెత్తిమీదికొచ్చాడు. దొమ్మరి సంసారం వంట ప్రయత్నంలో నిమగ్నమైవుంది. దొమ్మరి పిల్లనే వంటచెయ్యడానికి కూర్చున్నది. ఆమెకు కావలసిన

పదార్థాలను సమకూర్చేనెపంలో గోవిందరాజు, ఇతర సైనికులు నిమగ్నులై, అలాగే వాళ్ళు సైనికశిబిరంలో అంతటా తిరిగి తమకు కావలసిన విషయాలను ఉపాయాంతరంగా సంగ్రహించుకున్నారు. ఇక్కడ బొమ్మరిపిల్ల వంటపనిలో నిమగ్నురాలై వున్నట్టే అక్కడ గోవిందరాజుకూడా తన పనిలో నిమగ్నుడై వున్నాడు.

సైనికుల మాటలవల్ల సుల్తాను సార్వభౌము కృష్ణదేవరాయలకు క్రొత్తగా నిర్మింపబడివున్న ఈ విడిదిమందిరంలో ఆతిథ్య మివ్వడంలో ఏదో మోసమున్నట్టుగా తెలిసింది. దాన్ని శోధించే కార్యంలో అతడు నిమగ్నుడయ్యాడు.

గోవిందరాజు అక్కడా యిక్కడా తిరుగుతూ క్రొత్తగా కట్టబడివున్న రాజసౌధంలోకి వచ్చి అక్కడి శిల్ప కౌశలాన్ని, కళాకృతి వైభవాలనూ చూసి సంతోషిస్తూ అక్కడంతా బాగా తిరిగి పరీక్షగా చూశాడు. అతన్ని పని వాళ్లు బొమ్మరివాడని అతని విషయంలో ఎక్కువ ఆసక్తి కనబరచలేదు. అయినా అచ్చటి పనివాళ్ళ మేస్త్రీ సుల్తాను అక్కడికి రానున్నాడనీ, త్వరగా ఆ ప్రదేశంలోనుంచి వెళ్ళి పోవలసినదనీ చెప్పి, అతన్ని అక్కడినుంచి పంపి వెయ్యడానికి చూశాడు. వాళ్ళలో ఏదో భీతి వున్నట్టు గోచరించింది. అది ఏమిటైనదీ తెలుసుకోవడానికి గోవిందరాజు కెక్కువసేపు పట్టలేదు. త్వరగా వెళ్ళిపోతున్నట్టుగా చెప్పి కూలివాళ్ళ కళ్లు గప్పి అక్కడా యిక్కడా పడి చివరికి సార్వభౌముల శయనాగారానికని ఏర్పాటుచేసిన గదికి వచ్చిచేరాడు. అక్కడ పని వాళ్ళు ఎక్కువమంది లేరు. ఉన్న ఒకరిద్దరు తమ పనులలో

లీనమైవున్నారు. గోవిందరాజు వాళ్ళకు జాడ తెలియకుండా నేలను సూక్ష్మంగా పరిశీలించుకుంటూరాగా ఒక భాగంలో రహస్యప్రదేశముండడం గోచరించింది. దానికొక మార్గ ముండడంకూడా కనిపించింది. అతడు ముందు వెనుకలు చూడ కుండా ధైర్యంచేసి చిన్నవాకిలిలావున్న ఆసొరంగద్వారాన్ని ప్రవేశించాడు. అది అతణ్ణి ఒక భూగృహంలోకి తెచ్చి విడ చింది. ఆ భూగృహంనిండా మందుగుండు సామానులుకూ- ప్రేలెడి సామగ్రులనూ నింపివున్నారు. దానిని చూడగానే సుల్తాను ఆతిథ్యపు ఆంతర్యమేమిటన్నది గోవిందరాజుకు తెలిసిపోయింది. ఆ భూగృహాన్ని శోధిస్తూపోగా ఒక చిన్న ద్వారం కనిపించింది. దానిమూలంగా దాటి మరొక సొరంగ మార్గానికి వచ్చాడు. దానిని క్రొత్తగా నిర్మించి వుండడం వల్ల భూమియింకా తడారలేదు. సొరంగంపొడుగునా మందు గుండు సామానులను వుంచివుండడం గోచరించింది. అక్కడ కావలసినంత గాలి వెలుగు లేకపోవడంవల్ల ముందుకు వెళ్ళ డానికి చాలా కష్టతరమైంది. ఇలా అతడు చాలాదూరం వచ్చిన తర్వాత బయటిద్వారం ఒకటి కనిపించింది. ఆ ద్వారాన్ని ఒక సైనికుడు కాపలా కాస్తున్నట్టు కనిపించింది. రాళ్ళగుట్టలమధ్య 'గవి' లా కనిపించే ఆ సొరంగంనుంచీ ఎలా తప్పించుకొని వెళ్ళడమని ఆలోచిస్తుండగానే సొరం గంలో శబ్దం వినిపించింది. అదేమిటోనని చూడడానికి ఆ కావలిభటుడు లోపలికివచ్చినవెంటనే అలాంటి సమయం కోసమే కాచుకునివున్న గోవిందరాజు అతనిమీదపడి నిరా యుధునిగాజేసి, నోటిలో గుడ్డలు తురికి, కాళ్ళు చేతులను

బంధించి అతణ్ణి సారంగంలో ఒకచోట విడిచి, ఎవరికీ కనుపించకుండా సారంగంనుంచి తప్పించుకున్నాడు.

ఈ విషయాలన్నీ వెంటనే తిమ్మరుసుమూలంగా రాయలకు తెలియజెయ్యబడింది.

పరస్పరం కలుసుకోవడానికని నిర్ణయింపబడిన రోజు నిరీక్షించినట్టుగా, బిజాపురసుల్తాను స్వతః రాయలను ఆహ్వానించడానికి రాకుండా రాయబారి అసద్‌ఖానును పంపించాడు. అసద్‌ఖాను రాయలకు సలాంచేసి సుల్తాను రాయల ఆగమనంకోసం తన శిబిరంలో కాచుకుని వున్నట్టూ, అతని ఆతిథ్యం స్వీకరించిన తర్వాత రాయలసభకు సుల్తాను వచ్చునట్లూ తెలియజేశాడు. సుల్తాను విశ్వాసపు కానుకగా, అనేక జాత్యశ్వాలనూ, ఏనుగులనూ, గోల్కొండ వజ్రపుగనుల నుంచి తీసిన అమూల్యములైన వజ్రాలతో తాపితమైన ఒక ఖడ్గాన్నీ, పర్షియా సుగంధ ద్రవ్యాలనూ రాయలకు అర్పించాడు. రాయలు ఈ స్నేహపు కానుకను సంతోషంగా స్వీకరించి అదిల్‌శహాను ప్రీతివిశ్వాసాలకు తను ఋణస్థుడుగా వున్నట్టు తెలయజేశాడు. సుల్తాను ఆతిథ్యాన్ని స్వీకరించడానికి తను ఆతురుడై వున్నట్టూ, మొదట సుల్తానేవచ్చి తమ ఆతిథ్యాన్ని స్వీకరించాలని తమ అపేక్ష వున్నట్టూ, తమ ఆమంత్రణాన్ని సుల్తాను తిరస్కరించగూడదనీ వినయంగా విన్నవించాడు.

ఈ విషయాలన్నీ విని అదిల్‌శహానుకు ఆలోచనపట్టుకుంది. తన పన్నుగడ రాయలకు తెలిసిపోయిందా? అని భయపడ్డాడు. రాయలు తనవద్దకు మొదట రాకుండా తననే

అతని శిబిరానికి ఆహ్వానించడం చూస్తే తనలానే రాయలూ తనను బంధించడానికి పన్నుగడ పన్ని వుండవచ్చా? అను కున్నాడు. సుల్తానుకు రాయల ఆమంత్రణం మేరకు అతని శిబిరానికి వెళ్ళడానికి ధైర్యం లేకపోయింది. మొదట రాయల పన్నుగడ ఏమిటన్నది తెలుసుకుని రావడానికి అశద్ ఖానును పంపించాడు.

అసద్ ఖాను రాయల సముఖానికివచ్చి రాయల కోరిక ప్రకారం, అతిథ్యాన్ని స్వీకరించడానికి సుల్తాను వస్తున్నట్టుగా తెలియజేశాడు. ఈవ్యవధిలో అక్కడా యిక్కడా విచారించి రాయలకు సుల్తానుని విద్రోహం తెలిసిందన్న విషయాన్ని ఎలాగో గ్రహించాడు. కొంతసేపటి తర్వాత అతడు సుల్తాను నెందుకో రావడానికి తడమాడుతున్నాడనీ, తనేవెళ్ళి అతణ్ణి తీసుకొస్తాననీ చెప్పి రాయల ఎదుట నుంచీ తప్పించుకుని వెళ్ళిపోయాడు.

విజయనగర సరిహద్దును దాటుకోగానే, సుల్తాను వద్దకు పరుగెత్తుకువెళ్ళి. రాయలు సుల్తానును బంధించడానికి పన్నుగడ చేసివున్నాడనీ, అక్కడేవుంటే ప్రాణాపాయమనీ, వెంటనే సైన్యంతో సహా బిజాపురానికి వెనుదిరిగి వెళ్ళి పోవాలనీ చెప్పాడు. ఈమాటను నమ్మిసుల్తాను సైన్యసమే తంగా బిజాపురంవైపు వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ తన పన్నుగడ బయటపడగూడదని, రాయలకని నిర్మించిన సౌధా నికి చిచ్చుపెట్టి పేల్చివేసి వెళ్ళిపోయాడు.

ఒక్కతూరిగా వినిపించిన ప్రేలుడు శబ్దంతో జరిగిన విషయాలను ఊహించి తెలుసుకుని రాయలు సైన్యసమే

తంగా సుల్తాను శిబిరంమీద పడడానికి వచ్చేవేళకు సుల్తాను తప్పించుకుని వెళ్ళిపోయాడు. రాయలకు ఆశిబిరంలో విలువ గల వస్తువులనేకం లభించాయి. శిబిరపు సైనికులందరూ తమ సుల్తాను ననుసరించి పారిపోయారు!

రాయలకుమళ్ళీ నిరాసే అయింది. బిజాపుర సుల్తాను రాయలచేతికి చిక్కకుండా తప్పించుకుని వెళ్ళడం అతనికి చాలా వ్యధను కలుగజేసింది. కానీ తిమ్మరుసు, గోవింద రాజులకు రాయలు అదిల్‌శహాను తంత్రంనుంచీ బయటపడ్డా డనీ సంతోషమే అయింది. రాయలు తన ప్రాణాలను మిగి లించిన గోవిందరాజును వీరోచితంగా సత్కరించాడు.

రాయలు సుల్తానుని విద్రోహానికి తగిన శిక్ష విధించ డానికి నిర్ణయించుకుని బిజాపురంమీద దండెత్తడానికి నిశ్చ యించాడు.

రాయలప్రచండ సైన్యం బిజాపురం వైపు ఒకటి రెండు నెలలు సంతతంగా ప్రయాణించి ఆతర్వాత బిజాపురం వద్దకు వచ్చి దండువిడిసింది. అప్పటికీ సుల్తాను సైన్యం ఎదు రించడానికి రాలేదు. రాజధాని వద్దకు వచ్చి దండువిడిసినా రాజధాని నుంచీ ఏ ప్రతిఘటనా సంభవించక పోవడంచూసి రాయలకు ఆశ్చర్యమైనది. విషయసంగ్రహణ చేసుకుని రావ డానికి వెళ్ళిన గూఢచారులు వచ్చి రాయలకు అన్ని సంగ తులూ తెలియజేశారు. గూఢచారులు సంగ్రహించుకుని వచ్చిన విషయాన్ని విని రాయలకు విస్మయమైంది.

బిజాపుర సుల్తాను అదిల్‌శహాన్ రాయలు బిజాపురం మీద దండెత్తి వస్తున్నసంగతి తెలియగానే బెదరి, రాజ

ధానిని వదలి, పిరికిపందలా పారిపోయి తలదాచుకున్నాడు. రాజధాని దిక్కులేని అనాధ శిశువులా దుఃఖించింది. ఈసంగ తిని విని రాయలు సంతోషించాడు.

రాయలు మొదట బిజాపురాన్ని ప్రవేశించి, దానిని స్వాధీన పరచుకోవడానికి దండు కదిలించి సైన్యసమేతంగా వెళ్ళాడు.

బిజాపుర పౌరులు యుద్ధం చెయ్యకుండా, ఏ ప్రతి ఘటననూ వ్యక్తపరచకుండా రాయలను స్వాగతించారు. వాళ్ళకు పిరికిపందలా తమను వదలి పారిపోయిన సుల్తాను కంటే శత్రువులే ప్రియంగా కనిపించి వుండాలి.

బిజాపురం జనభరితమైన సుందర నగరం. అదివిశాల మైన రాజ వీధులతో, శ్రీమంతుల సౌధపంక్తులతో అనేక ఉద్యానవనాలతో శోభిస్తోంది. అక్కడి ప్రజల సంపద్విలాస వైభవాలు జగద్విఖ్యాతమైనవి. ఇది చాలా పురాతనమైన నగరం. అక్కడ దేశవిదేశాలనుంచి వచ్చిన ప్రవాసులూ, వర్తకులూ స్థానమేర్పరచుకున్నారు. ఊరు విలాసాలకేంద్ర మని పేరుపొందింది. ఇలాంటి సుందరనగరాన్ని శత్రువు కప్పగించి పారిపోయిన సుల్తానును తలచుకుని రాయలకు కని కరం కలిగింది. ఇంతకంటే హెచ్చుగా ఈ విషయం తిమ్మ రుసుకు చాలా వ్యధను కలుగజేసింది. రాయల ప్రతిజ్ఞను విని బిజాపురసుల్తాను తన సంపదనంతా శత్రువు వశంచేసి పర దేశిలా దుఃఖపడవలసిన ప్రసంగం వచ్చినందుకుగా శత్రు వును గురించి తిమ్మరుసు సహానుభూతిని వ్యక్తపరచాడు. రాయలు తనసైన్యానికి నగరంలో తమ అనుకూలతకు తగిన

శిబిరం వెయ్యడానికి సూచించి తను అదిల్‌శహాను భవనం లోనే నిల్చాడు.

సుల్తాను సౌధం నిర్జనంగా వుంది. అదిల్‌శహాను ఆత్రుతలో తనకు చిక్కిన సంపదనంతా తనతో తీసుకు పోయినా అక్కడి అనుకూలతకు ఏ కొరతా లేదు. రాయలు దీర్ఘకాలపు ఆయాసాన్ని పరిహరించుకోవడానికి సుల్తానుని సౌధంలో విశ్రాంతి తీసుకున్నాడు. యుద్ధం లేకుండా లభించిన ఈ విజయం రాయలకు సంతోషాన్ని కలిగించింది. రాయలు నిశ్చింతగా నృత్యసంగీతాది మనోరంజనాల వైపుదృష్టి మరల్చి, తను యుద్ధానికి వచ్చివున్న విషయాన్నే మరచి పోయాడు.

కానీ—రాయలు బిజాపురంలో ఎక్కువ రోజులు వుండడానికి వీలులేక పోయింది. తనకు యిష్టం లేకపోయినా బిజాపురాన్ని వదలి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది.

బిజాపురం బయలు ప్రదేశంలోవున్న నగరం. ఇది జనభరితమైనదైనా, ప్రజా జీవనానికి కావలసిన వస్తువులన్నీ విదేశాలనుంచే రావలసివుండ. ప్రతినిత్యం వంటకుకావలసిన కట్టెలు దొరకుట దుర్లభమైనది. ప్రజలకు నీటిని సరఫరా చేస్తోంది—నగర సమీపంలోవున్న పెద్ద జలాశయం. ఇది సంవత్సరంలోని అన్ని రోజుల్లోనూ నీటితో నిండి వుండేది. సుల్తాను నగరాన్ని విడిచి వెళ్ళిపోతూ, శత్రువులకు యిబ్బందులు కలుగజయ్యటానికి జలాశయపు తూములనుంచి నీటిని వదలివేసి జలాశయంలో నీరులేకుండా చేసి వెళ్ళిపోయాడు. అతని ఉద్దేశం ఫలించింది. నగర ప్రజకు మునుపే కావలసి

నంత నీరు దొరకడంలేదు. వేలసంఖ్యల్లోవున్న రాయల సైన్యానికి నీటినిసరఫరాచేసే విధమెలాగా? దీనికి తగినట్టుగా ఆరోజులలో వర్షంవచ్చే సూచనకూడా కనుపించలేదు. నగరంలోని బావులూ, కొలనులూ, గుంటలూ అతిత్వరలో ఖాళీ అయిపోయాయి. ఒక బిందె నీటికి బంగారం వెల అయింది. ఊళ్ళో సేకరించిన కట్టెలకు సుల్తాను చిచ్చుపెట్టి బూదిచేశాడు. అది బయలు ప్రదేశం కావడంవల్ల కట్టెలను దూరప్రదేశంనుంచి తీసుకురావలసి వచ్చింది. బిజాపురం చుట్టూ అడవి ప్రదేశం కాకపోవడంవల్ల కట్టెలకుకూడా తొందర అయినది. నీరులేకుండా గంజిలేదు! గంజికాచడానికి కట్టెలులేవు. ప్రజలు హాహాకారాలు చెయ్యసాగారు. ఈకష్టాల ననుభవించలేక ఎంతోమంది స్త్రీలు బిడ్డలనెత్తుకుని, ఇల్లు వాకిళ్ళను విడచి, సాధ్యమైనంత సంపదను తీసుకుని నగ రాన్ని విడచి వెళ్ళిపోయారు. అందువల్ల అర్థం ఊరు నిర్జన మైనది. దీనికితగినట్టుగా సైనికుల హింసలు వేరే. ముందె వ్వుడూలేని విధంగా వాళ్ళప్రవర్తన మితిమీరిపోయింది. రాయలు ఈ తూరి సైనికుల స్వేచ్ఛావర్తనను ఆపడానికి ఎందుకో ప్రయత్నించలేదు. ఇల్లు వాకిళ్ళ లూటీ, స్త్రీలమీద అత్యాచారం, హత్యను, బందిపోటులు నగరంలో పరిపాటై పోయాయి. ప్రజలు భీతిజెందారు. శత్రువుల హింసలను సహించలేక, వాళ్ళు నగరాన్ని వదలి పారిపోసాగారు. సుఖ సంపదల కాలవాలమైన బిజాపురం, స్మశాన సదృశమైంది.

ఇదంతా కళ్ళారాచూసి వ్యాకులపడిన తిమ్మరుసు ఈ విషయాన్ని తెలియ జెయ్యడానికి రాయల వద్దకు వచ్చాడు.

రాయలు తిమ్మరుసును ఆదరంతో ఆహ్వానించి సత్కరించాడు.

"ఓ! అప్పాజీగారు దారితప్పి ఇక్కడికి వచ్చినట్టుగా కనిపిస్తోంది."

"ఎందుకు ప్రభూ?"

"మన మిక్కడికి వచ్చినది మొదలు మాకు తమ దర్శనలాభమే లేకపోయింది. పోనీ, తమరు వచ్చినకారణం?"

తిమ్మరుసు మౌనాన్ని భంగపరచి ఇలా అన్నాడు:

"ప్రభువులతో ఒక విన్నపముంది. ఇక్కడి ప్రజల గోడు, కష్టం చూడడానికి సాధ్యంలేకుండా వుంది. అలాంటి యిబ్బందులే మన సైన్యానికీ సంభవించాయి. త్రాగడానికి నీరులేకుండా, తినడానికి తిండిలేకుండా, ప్రజలు మరణిస్తు న్నారు. వాళ్ళను సంస్కారం చెయ్యడానికి కట్టెలులేక, శవాలు కుళ్ళి, దుర్వాసన క్రమ్ముకున్నాయి. ప్రజల ఆర్త నాదం ప్రభువుల చెవిని యింకా పడలేదని తెలుస్తోంది. సైని కులు క్షుద్బాధవల్ల ప్రజలను పరిపరి విధాలుగా హింసిస్తు న్నారు. వాళ్ళలో క్రమశిక్షణ, ఐకమత్యములు నశించి పోయాయి. కట్టెలకోసం కట్టిన సౌధాలనూ, ఉద్యానవనా ల్లోని వృక్షాలనూ నాశనం చేస్తున్నారు. నగరాన్నిచూస్తే శ్మశానంలా కనిపిస్తోంది. ప్రభువు లికనైనా తమ విలాసజీవ నాన్ని చాలించి ప్రజలనూ, సైనికులనూ ఈ కష్టంనుంచి తప్పించాలి. మొదట యిక్కణ్ణుంచి సైన్య సమేతంగా వెళ్ళి పోతే ప్రజలూ జీవిస్తారు, సైనికులూ జీవిస్తారు."

తిమ్మరుసు మాటలు రాయలహృదయాన్ని తాకాయి. అతడు తన నిర్ణయాన్ని తెలియజెయ్యడానికి ముందు నగర ప్రదక్షిణం చేసుకుని రావడానికి ఆశించాడు. అదే విధంగా తిమ్మరుసుతో వెంటనే గుఱ్ఱాన్నధిరోహించి వెళ్ళాడు.

తిమ్మరుసు చెప్పిన సంగతులు అక్షరశః సత్యమైనవి.

ఇంద్ర నగరంలాంటి బిజాపురం యిప్పుడు పాడుబడి పోయింది. ఎక్కడచూసినా శిథిల గృహాలు. వీథులలో ఆహారం లేక చచ్చిపడివున్న కుక్కనక్కలూ; బీదసాదల శవాలు; అంతేకాక ఆకలిదప్పులతో బడలిన ప్రజలు! ఈ భీకర దృశ్యాన్ని చూసి—రాయల మనస్సుకు చాలా బాధ కలిగింది. అతడు మౌనంగా అన్నీ తిలకించి భారమైన హృదయంతో భవనానికి తిరిగివచ్చాడు.

"ఔను అప్పాజీ, నేను యిక్కడ యింతకాలం దండు విడిసి చాలా అపచారం చేశాను. రేపు వేకువఝామునకు యిక్కడనుంచీ వెళ్ళడానికి ఆజ్ఞాపించు" అని అనుజ్ఞ యిచ్చాడు.

అదేవిధంగా, మరుసటిరోజు ఉదయం రాయల సైన్యం బిజాపురాన్ని విడచి వెళ్ళడానికి సిద్ధమైంది.

రాయలు సైన్యం ముందుకు వెళ్ళడానికి ఆజ్ఞ యిచ్చాడు.

సైన్యం జయఘోషతో, రణవాద్యాలను మ్రోగిస్తూ సాగింది. వాళ్ళవెనుక వాళ్ళు శిథిలపరచిన బిజాపురనగరం—శ్మశానంలా, అస్తవ్యస్తంగా నిలబడివుంది. ఇది రాయల ప్రచండ దిగ్విజయపు సంకేతమైంది!

# 11

కృష్ణదేవరాయలు బిజాపురాన్ని విడిచిపెట్టి ముద్గల్లుకు వెనుదిరిగాడన్న వార్తవిని తలదాచుకొనివున్న అదిల్‌శహాను మళ్ళీ సైన్యసమేతంగా బిజాపురానికి ఆగమించాడు. బిజాపురంలో ఏవిధమైన శబ్దమూ లేకుండా శ్మశానవాతావరణం ఆవరించింది. కోటయొక్క మహాద్వారాలు జీవరహితంగా నిలబడి వున్నాయి. కోటగోడ అక్కడక్కడా పాడుచెయ్యబడి వుంది. కోటనుదాటి లోపలికి రాగానే కంటికగబడిన దృశ్యం హృదయవిదారకంగావుంది; ఎక్కడచూసినా శిథిలగృహాలు. రాళ్ళు, ముండ్లతో కూడుకున్న వీథులు. నిర్జనమైన మార్గాలు కనుపిస్తున్నాయి. ఇంకా బ్రతికివున్న ప్రాణులేమిటంటే— మరణించినవారి దేహంనుంచీ మాంసాన్ని చీల్చితింటున్న కుక్కలు—నక్కలు; రాబందులు. వాటిదే రాజ్యం. కొన్నిచోట్ల అవి తిని మిగిలిన శవాల దుర్వాసన. శవాలను ఎవరు మన్ను చెయ్యాలి? అదీ దరిద్రుల శవాలను!

చుట్టుపట్ల ఎక్కడా వర్షంలేక క్షామదేవత కాహ్వాన మిచ్చినట్టయింది. మొదటనే నగరపు బీదప్రజకు కావలసినంత ఆహారంలేదు. దీనిమీద రాయల లక్షలసంఖ్యలోని సైన్యం మూడు మాసాలకాలం దండువిడిసింది. ఇంతమంది సైన్యానికి ఆహారాన్ని చేకూర్చడమే కష్టమైంది. ఇక వాళ్ళ ఏనుగలు, గుఱ్ఱాలు, ఒంటెలకు ఆహారాన్ని చేకూర్చడ మెక్కడ? సైనికులు ప్రజలగోడు వినకుండా దయ, దాక్షిణ్యాలు లేక తమకు కావలసిన ఆహారవస్తువులను ఎక్కడున్నా

లాక్కుని పోతున్నారు. నగరంలో ఆహారసామగ్రులు ముగిసిన తర్వాత చుట్టుపట్ల పల్లెలలో లూటీ ప్రారంభమైంది. తమ ప్రాణాలకుకూడా గండం సంభవించవచ్చునని భయపడిన పల్లెప్రజలు తమ గ్రామాలను వదలి పారిపోయారు. కొంతమంది ప్రజలు, శ్రీమంతులు రాయలసైనికులు అపేక్షించినది యిచ్చివేసి ప్రాణాలను మిగిలించుకున్నారు— సుల్తానుకు రాయలసైనికుల ఆక్రమణపు దారుణకథను తెలియజెయ్యడానికి సుల్తాను గుప్తాన్నధిష్ఠించి నగరాన్ని చూసి రావడానికి వెళ్లాడు. నగరంలోని భవ్యభవనాలు మాంసం లేని అస్థిపంజరాల్లా, జీవంలేక ఛిన్నాభిన్నమై నిలబడి వున్నాయి. తన ప్రియరాజధానికి సంభవించిన దురవస్థను చూసి అదిల్‌శహాను కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

అతడు తన సౌధానికి వచ్చాడు. సౌధంమాత్రం భగ్నం కాలేదు. అతనికాశ్చర్యం కలిగింది. రాయలు అక్కడే విడిదిచెయ్యడంవల్ల తక్కినసౌధాలకు సంభవించిన దుస్థితి దానికి సంభవించకుండా సౌధం మునుపటిలానే సుస్థిరంగావుంది.

తన రాజధానికి సంభవించిన దురవస్థను తలచుకుని సుల్తానుకు చాలా వ్యథ కలిగింది. తను పిరికిపందలా పారిపోవడంకంటే ధీరునిలా పోరాడి రణరంగంలో ప్రాణాలను వదలివుంటే, తనరాజధానికి సంభవించిన భగ్నావస్థను చూచే ప్రమేయమే లేకపోయేదని పరితపించాడు. అతనికి తనమీాద తనకే కోపంవచ్చింది. తన పిరికిపందతనానికి

నొచ్చుకున్నాడు. కోపంతో రాయలమీద పళ్ళుకొరికాడు. తను తొందరపడి ప్రవర్తించినందుకు తననే నిందించుకున్నాడు. కానీ—కార్యం మించిపోయింది. తొందరపడిచేసిన పనికి చింతించి ప్రయోజనంలేదు. అయినా, సుల్తాను అన్నపానీయములను వదలి చింతిస్తూ కూర్చున్నాడు. ఇది గమనించిన అసద్‌ఖాన్ సుల్తానును సంతోషపరచ ప్రయత్నించాడు.

"తమరీమాత్రానికంతా భయపడి చింతించనక్కర లేదు హుజూర్. అల్లా హృదయంలో మన అహంకారాన్ని ఈ విధంగా అణచాలని తలచాడేమో! అదేవిధంగా జరిగింది. తమరు ధైర్యంగా వుండాలి. చెయ్యిజారిపోయిన ప్రదేశాలను ఎలాగైనా వశపరచుకోవాలి. ఆ సన్యాసుల మీద పగతీర్చుకోవాలి. ఈ విషయమై ఆలోచించాలేగానీ, గడచినదానికి వగచి ప్రయోజనంలేదు."

"అవును అసద్‌ఖాన్, ఆ కాఫర్లమీద పగ తీర్చుకోవాలి. నా హృదయంలో ద్వేషాగ్ని రగులుతోంది. కానీ— ఎలా పగతీర్చుకోవాలో తెలియడంలేదు" అన్నాడు.

"నాకు అనుజ్ఞ యివ్వండి హుజూర్! శత్రువులమీది పగతీర్చుకునేవరకూ తమకు ముఖం చూపడంలేదు!"

"నీవొక్కడివే ఏంచెయ్యగలవు అసద్‌ఖాన్? అల్లాయే మనవిషయంలో కోపించివుండగా మనమేం చెయ్యగలం? ఎవరికి తెలుసు—ఆ కాఫర్లు రాయచూరు యుద్ధంలో అభేద్యమైన కోటను భేదించి మనలను ఓడిస్తారని. వాళ్ళకు సైతానే

సహాయపడుతుండాలి — మనంచేసిన ఒక్కకార్యంకూడా యశోవంత మవడంలేదు!''— అని ఖిన్నునిలా అన్నాడు.

''అవును హుజూర్. మన అదృష్టం బాగుండలేదు. అలా కాకపోయివుంటే ఆ రాయలను మనం నిర్మించిన ఆ సౌధంలోనే సమాధిచెయ్యవలసినది. కానీ—మన పన్నుగడ ఎలా కనిపెట్టాడోమరి. ఇంతకూ అతడు బ్రతకడంవల్ల ఖామందులవారికే కష్టం సంభవించింది!''

''అంతా మన నుదిటివ్రాత అసద్ ఖాన్. మన పూర్వపుసుల్తానులు విజయనగర రాజులమీాదజరిపిన అత్యాచారానికి మనం ఈ శిక్ష ననుభవించవలసివచ్చింది. వాళ్ళ పాపపుఫలాన్ని మన మనుభవింపవలసివచ్చింది. మన పూర్వీకులు అదిల్ శహాన్ బహమనీ ఆ దేవరాయలను ఆ విధంగా అవమానపరచక వున్నట్టయితే మనకు ఈ దుర్గతి వచ్చి వుండేదికాదు'' అని విషాదంగా అన్నాడు.

''తమరింత హతాశులు కావలసినపనిలేదు,హుజూర్. నేను తమసేవలో వున్నంతవరకూ తమరు చింతించ నక్కర లేదు. ఇప్పుడైనా ఏమీా మించిపోలేదు. మన ప్రయత్నం మనం చేద్దాం.''

''ఇంకా ఏం మిగిలింది, అసద్ ఖాన్. క్రితమే రాయల పాదాన్ని చుంబించివుంటే నేను బ్రతికుండుటకు వీలుండేది. పోగొట్టుకున్న రాజ్యకోశాలను మళ్లీ పొందివుండవచ్చు. మనం రాయల కోరికను ధిక్కరించి, ఈ స్థితికివచ్చాం. ఇప్పుడు రాయలవద్దకువెళ్ళితే, మనల్ని బంధించి ఆ జన్మాంతమూ ఖైదులో వేస్తాడు. ఇది ఖచ్చితం. ఇలా వుండగా

మునుపటిలా మిత్రత్వమంతటి ఒప్పందాన్ని చేసుకోవడానికి సాధ్యముందా?"

"ఉంది హుజూర్. సాధ్యముంది—నామీద నమ్మక ముంచి అనుజ్ఞయివ్వండి. అసాధ్యమన్నది సాధ్యంచేసుకుని వస్తాను." అని సుల్తానుకు ధైర్యంచెప్పి, అతనినుంచి క్రొత్త రాయబారానికి అనుమతి సంపాదించాడు—

రాయలతో కలుసుకోవడానికని అసద్ ఖాన్ ముద్గల్లుకు వెళ్ళాడు.

అసద్ ఖాన్ వీరయోధుడు. అంతేకాక మహత్వాకాంక్షి. అతడు పుట్టుకతో ముందుకువచ్చినవాడు కాదు. స్వశక్తితో ముందుకువచ్చినవాడు. పల్లెమసీదులో ఖాజీ సాహేబ్ గావుండిన సామాన్య బీదకుటుంబంలో పుట్టినవాడు అసద్ ఖాన్. అతని తండ్రి పదిమందికి కావలసినవాడైనా బీదతనపుబాధమాత్రం పోలేదు. అతని అల్పస్వల్ప ఆస్తి యావత్తూ బిడ్డల పెళ్ళిళ్ళలో కరిగిపోయింది. అసద్ ఖానుకు మిగిలిన ఆస్తి ఏమిటంటే ఖాజీసద్దవున్న ఖురాన్ మాత్రమే. అతడు అదెంతటి అమూల్యసంపదో తెలుసుకుని వుండడం వల్లనే కొడుకుకు ఖురాన్ పాఠంచెప్పి, దాని జతకు న్యాయ శాస్త్రాలలో పారంగతునిగా జేశాడు. అతడు బాల్యంలోనే తన సమానవయస్కులకంటే బుద్ధిమంతుడనిపించుకున్నాడు. ఖురానును అనూలాగ్రంగా నోటిపాఠం చేసుకుని వుండడం వల్ల పెద్దవారి మన్ననలకూ, గౌరవానికి పాత్రుడయ్యాడు. ఇలా వుండగా అతని తండ్రి హఠాత్తుగా ఏదోరోగానికి బలి

అయ్యాడు. అతని తల్లి కుమారునితో కుమార్తె యిల్లు చేరుకుంది.

బిజాపురంలోవున్న అల్లునికి సుల్తానురక్షణాసైన్యంలో ఉద్యోగం — అసద్ ఖాన్ తరుణవయస్కుడైన తర్వాత ఆతడు తన పలుకుబడినుపయోగించి, అసద్ ఖానుకుసైన్యంలో ఒక పని నిప్పించాడు. అదిల్ శహాను తండ్రి కాలంలో జరిగిన మూడు నాలుగు దిగ్విజయాలలో అతడు తనశక్తి, సామర్థ్యాలను ప్రదర్శించి అతని విశ్వాసానికి పాత్రుడయ్యాడు. సామాన్య సైనికుడుగా వుండినవాడు. అదిల్ శహాను సింహాసనానికి వచ్చేవేళకు సైన్యంలో అతడు ప్రముఖసేనాధిపతి అయ్యాడు. అతణ్ణి అదిల్ శహాను బెల్గాం దుర్గాధిపతిగా చేశాడు.

అసద్ ఖానుని ఏకైకవాంఛ ఏమిటంటే తనుబిజాపుర సమస్త సైన్యానికీ మహాసేనాధిపతి కావాలన్నది. రెండవ సుల్తానులా ప్రకాశించడానికి ఆపదవి నుంచిమాత్రమే సాధ్యమౌతుంది. అందువల్లనే దండనాయకుని పదవి నాశిస్తున్న అతణ్ణి బెల్గాం దుర్గాధిపత్యం తృప్తిపరచలేదు. అతని ఆశలు నెరవేరే కాలం వచ్చింది. అతని మహాత్వాకాంక్షకు కంటక ప్రాయులుగా వుండిన సేనాధిపతులందరూ రాయచూరు యుద్ధంలో మరణించారు. ఇక మిగిలిన ఒకేఒక్క సేనాధిపతి—సలబత్ ఖాన్, రాయలకు ఖైదీగా చిక్కి విజయనగరపు చెఱసాలలో కృంగుతూ పడివున్నాడు.

సలబత్ ఖాన్ వీరాగ్రణిఅయిన సేనాధిపతి. ఎంతటి వీరుడో అంతటి నిస్పృహవంతుడుకూడాను. అతనికి మొదటి

నుంచీ అసద్‌ఖాన్ మీాద సంశయం. అతని కుతంత్రబుద్ధిని చూసి విశ్వాసపాత్రుడుకాడని తెలుసుకుని అతణ్ణి దూరంగా వుంచాడు. సలబత్‌ఖానంటే సుల్తానుకు అమిత ప్రేమ; గౌర వాలుండేవి; అంతే నమ్మికకూడా వుండేది. అతనికి వ్యతి రిక్తంగా కుట్రజరిపించి సుల్తాను మనస్సును చెఱపడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు అసద్‌ఖాన్.

కానీ—రాయచూరు యుద్ధంలో సలబత్‌ఖాన్ సింహ పరాక్రమంతో యుద్ధంచేసి పట్టుబడిన తర్వాత మిగిలిన సేనాధిపతి—అంటే అసద్‌ఖాన్. అతనివిషయంలో విశ్వాసం లేకపోయినా సుల్తాను విధిలేక అతణ్ణి రాయలవద్దకు రాయ బారిగా పంపించాడు. ఈ కార్యాన్ని దక్షతతో నిర్వహిం చడంవల్ల అసద్‌ఖాన్ విషయంలో సుల్తానుకు సదభిప్రాయం కలిగింది. అంతేకాక మిగిలివున్న అతడే సుల్తానుని ఆప్త మిత్రుడూ నమ్రసచివుడూ అయ్యాడు.

అసద్‌ఖాన్ మితపరివారంతో ముద్గల్లువచ్చి విడిశాడు. అదిల్‌శహాన్ నుంచి మళ్ళీరాయబారం వచ్చివుండడం విని రాయలకూ తిమ్మరుసుకూ ఆశ్చర్యమైనది. తాము బిజా పురంమీాద దండెత్తి ధ్వంసంచేసినా, బిజాపుర సుల్తాను సంధికని రాయబారిని పంపించి వున్నాడుకదా అనిఆశ్చర్యం! పరాజితుడై బాధనొందిన సుల్తాను ప్రాణం మిగిలించుకోవ డానికి చేస్తున్న చివరి ప్రయత్నమిది అని రాయలు ఆలో చించాడు. పిరికి పందలా దయాభిక్షను వేడడానికి దూతను పంపించి వున్నాడని రాయులుతలచాడు. పిరికిపందకు దూతగా వచ్చివున్న రాయబారిని రాయలు తిరస్కారంగానే

చూశాడు. వచ్చి ఒక మాసంరోజులైనా అతన్ని తనతో కలుసుకోవడానికి పిలువలేదు.

రాయలు తన, తన ప్రభువు విషయంలో ప్రత్యక్షంగా చూపుతున్న తిరస్కారంవల్ల అసద్‌ఖానుకు శరీరం దహించుకుపోతున్నా విధిలేక, పళ్ళుకరచుకుని అవమానాన్ని సహించాడు. రాయలు చూపిన అనాదరణను చూచీచూడని వానివలెనే నిర్లక్ష్యంతో వుండసాగాడు. ఈ తూరి తన పక్షంగా రాయలతో మాట్లాడటానికి తిమ్మరుసును కలుసుకోలేదు. తిమ్మరుసును కలుసుకుంటే తనపన్నుగడ బయటపడుతుందని తెలిసి అతడు భయపడ్డాడు. రాయలు దర్శనమిచ్చేవరకూ ఆచోటు వదలి పోకూడదని హఠంపట్టి కూర్చున్నాడు.

ఒకనెల గడచిన తర్వాత రాయలను సందర్శించే సుయోగం అసద్‌ఖానుకు లభించింది.

అసద్‌ఖాన్ రాయల సందర్శనానికి సరైన త్రోవ త్రొక్కకుండా అడ్డదారిపట్టాడు. అతడు బిజాపురంనుంచీ తెచ్చిన ద్రాక్షారసం, విలాసినుల నృత్యం వీటివల్ల కొండమరుసు కుమారుని పరిచయం చేసుకున్నాడు. అతని మూలంగా రాయలకు తన సందేశాన్ని అందజేశాడు. తను చాలా గొప్ప రాజకార్యనిమిత్తమై వచ్చివున్నట్టు తెలియజేశాడు. అందువల్ల రాయలు ఒకరోజు అసద్‌ఖానుకు సందర్శనలాభం కలుగజేశాడు. అదీ అసద్‌ఖానుని కోరికప్రకారం తాత్కాలిక సందర్శనం!

అతడు తన నయగారపు మాటలతో రాయలను ఏమ రించి-అతని మనస్సు నపహరించుకున్నాడు.

అదిల్ శహాను స్వభావతః మంచివాడు. కానీ-కాస్త భీరువు. ఇతరులు చెప్పేడిమాటలు విని ఆవిధంగా నడుచు కోవడం అతని స్వభావం. వాస్తవంగా అతనికి రాయల విష యంలో ప్రీతి, గౌరవాలున్నాయి. రాయలంతటి సార్వ భౌముని స్నేహం తనకు లభిస్తే తను భాగ్యశాలి! అని అను కునేవాడు. అందువల్లనే స్నేహంకోసం రాయలపదచుంబనం చెయ్యడానికి వెనుదియ్యలేదు......కానీ......అదిల్ శహాన్ రాయల విషయంలో చాలాభయపడ్డాడు. రాయల స్నేహపు మాటలు కపటములనీ, రాయలవద్దకు అదిల్ శహానువస్తే అతణ్ణి బంధించి చంపుతాడనీ, ఎవరో కావాలనే రాయల విషయంలో అదిల్ శహాన్ మనస్సును చెడిచారు.........వగైరా, వగైరా......విషయాలను వర్ణించిచెప్పి రాయల మనస్సును వశపరచుకున్నాడు.

"హుజూర్! బీదలమైన మామీద దయచూపండి. ఇతర బహమనీ సుల్తానులను చూచుకున్నట్టే మా సుల్తానును కూడా చూచుకుని స్నేహభిక్షనివ్వాలి" అని దైన్యంగా ప్రార్థించాడు.

"మా మాటప్రకారం చేసివుంటే మీ సుల్తానుకు యీ దుర్గతి వచ్చివుండేదికాదు. అతడే స్వయంగా తెచ్చు కున్న దుర్గతియిది. మేముఅతణ్ణి స్నేహభావంతోనే చూశాం. అతడు మా స్నేహాన్ని తిరస్కరించాడు. యుద్ధం అనివార్య

ష్మైంది. బిజాపురంమీాద దండెత్తవలసి వచ్చింది. కానీ—మీాసుల్తానులు నగరాన్ని వదలి పారిపోయి యుద్ధాన్నితప్పించారు. ఇప్పుడూ సమయం మించిపోలేదు. నువ్వు చెబుతున్నట్టుగా మీాసుల్తానుకు మాతో మైత్రి కలుపడానికి కోరికగా వుంటే ఇప్పుడూ అతడు మేము కోరినవిధముగా నడుచుకోనీ. అతని నుంచిగెల్చిన సమస్తాన్నీ అతనికి అప్పగించి, అతనితో గౌరవపు ఒడంబడిక చేసుకోవడానికి ఇప్పుడు సిద్ధంగా వున్నాము" అన్నాడు రాయలు.

"ఖామందులవారు మామీాద చూపిన అభిమానానికి మేము చాలా ఋణస్థులం తమ కోరికను జరిపించడానికి మా సుల్తాను సిద్ధంగావున్నారు. ఆయన మునుపుకూడా సిద్ధంగానే వున్నారు... కాని... ద్రోహుల మాటలు విని తమ మైత్రిలో దురుద్దేశాన్ని ఆరోపించి చెడ్డారు. ఈ తప్పు సుల్తానులది కాదు. మిథ్యారోపణలతో మనస్సుచెడిచిన ఆ విద్రోహిది."

"మావిషయంలో కల్పితవిషయాలు చెప్పిసుల్తాను మనస్సును చెడిచిన ఆద్రోహి ఎవరు!"

"అతడొక విశ్వాసఘాతకుడు హుజూర్!"

"అతడెవరు? ఎక్కడున్నాడు?"

"ప్రస్తుతం ఖామందులవారి ఉప్పు తింటూ రాజధానిలోనే వున్నాడు."

"మాఉప్పు తింటూ మాకేద్రోహం తలపెట్టే ఆస్వామిద్రోహి ఎవడు?" అని కోపంగా అన్నాడు రాయలు.

ఒక్క క్షణం చెప్పాలా? వద్దా? అన్నట్టుగా ఆలోచిస్తూ కూర్చున్న అసద్‌ఖాన్‌ను చూసి రాయలు :

"వాస్తవాంశాన్ని విశదపరచడానికి భయపడవలసిన పనిలేదు. ఆద్రోహి ఎవరైనాకానీ అతణ్ణి పట్టితెచ్చి, తగిన విధంగా శిక్షించి, అతడు చేసిన అపరాధకల్పన అతని మనస్సుకు వచ్చేలా చేస్తాను. ఆవిషయంలో సంసయమక్కరలేదు" అన్నాడు.

"ఆద్రోహి మరెవరోకాదు, తమకు ఖైదీగా పట్టుబడి రాజధాని చెఱసాలలో క్రుంగుతూ పడివున్న సలబత్ ఖాన్."

"ఏమిటీ—సలబత్ ఖానా?"

"అవును, హుజూర్!"

"ఖైదీగా పట్టుబడినది మొదలు సర్వవేళలా కావలివాళ మధ్య పడివున్న అతనికి మాకు వ్యతిరిక్తంగా కుట్రజరిపించడానికవకాశ మెక్కడుంది?"

"అదే అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నవిషయం, హుజూర్! సలబత్ ఖాన్ సామాన్యుడుకాడు. అతనిమీద సుల్తానుకు చాలా విశ్వాసముంది. అందునుగురించే అతన్ని ప్రముఖసేనాధిపతిగా చేసి యుద్ధానికి పంపించడం. అతనికి తమను చూస్తే మొదటనుంచీ ద్వేష, తిరస్కారాలు పూర్తిగా వున్నాయి. అందువల్లనే తమరు సుల్తానులతో స్నేహాచింతన చేసి వుండడం విని, ఆపాలలో పులుసు పిండి లేనిపోని ఆరోపణలను సుల్తానుల తలలో నిండించాడు. సుల్తానులు తమను కలుసుకోవడానికివస్తే ప్రాణాలకే అపాయమనీ ముద్గల్లువద్ద తమను ఆహ్వానించడానికి సిద్ధంగావున్న అతన్ని భయపెట్టి పారిపోయేలా చేసినవాడు అతడే! లేకపోతే సుల్తానులు ఆరోజు తమసౌధంలోనే మిమ్మల్ని ఎదుర్కొని ఒడం

బడికి చేసుకుని వుండేవారు. సుల్తానుల బ్రతుకును పాడుచేసిన వాడే ఆనీచుడు!''

"చెఱసాలలోవున్న అతడు సుల్తానులతో సంబంధం పెట్టుకోవడానికి ఎలాసాధ్యం?''

"అది అత్యంత రహస్యవిషయం. చెఱసాల పని వాళ్ళను లోబరచుకుని వాళ్ళమూలంగా తెలియజేస్తుండ వచ్చునని నా ఊహా!''

"ఇది కేవలం మీ ఊహామాత్రమే అయితే?''

"నా మాటలమీద ఖామందులవారికి నమ్మకంలేక పోతే ఈ పత్రాలను చదివిచూడవచ్చు. వీటిని సలబత్ ఖాన్ తమరాజధానినుంచి వ్రాసివున్నాడు—అంతా అతని స్వహస్త లిఖితమైనవే!'' అని తను తెచ్చివున్న లేఖల దస్తరాన్ని రాయలచేతి కిచ్చాడు.

ఆలేఖలను చూసి రాయలముఖం కోపంతో జేవు రించింది.

"ద్రోహీ నాకళ్ళముందరే ఇంతటి విద్రోహమా?'' అన్నాడు.

"అవును హుజూర్. సలబత్ ఖాన్ చెఱసాలలో వుంటూనే ఇంతటికార్యాలను జరిపించాడు. అతనిలోని ప్రజా కర్షణ శక్తివుంది. అతని గూఢచారులు నగరంలోనే కావలసి నంతమంది వున్నారు.''

రాయల హృదయంలో ఇదివరకూ అణగివుండిన క్రోధాగ్ని యిప్పుడు రగుల సాగింది.

"ఇంతటి విద్రోహిని చిత్రహింసచేసి వధ్యశిలకు తీసుకు పోవాలి" అని పళ్ళుకొరికాడు.

రాయల ఆజ్ఞ అప్పుడే లిఖితరూపందాల్చి, వార్తా వహునితో విజయనగరపు చెఱసాలోన్నతోద్యోగి కంద జెయ్యడానికి వెళ్ళింది.

ఈ విషయం విని అసద్‌ఖాను ముఖం ఒక్కతూరిగా ముడుచుకు పోయింది.

# 12

అసద్‌ఖాను ముఖం ముడుచుకుపోవడానికి కారణం లేకపోలేదు. రాయల ఆజ్ఞలిఖితరూపం దాల్చిందంటే అక్కడికి సలబత్‌ఖాను అయుస్సు ముగిసినట్లేనని అతడు అనుకున్నాడు. సలబత్‌ఖాను నిజంగా విద్రోహి అయివుంటే అతనినుంచీ సుల్తానుకూ రాయలకూ జరుగనున్న మైత్రికి అడ్డువుంటే, అంతటి ఘాతుకుని చావునుంచి అసద్‌ఖాను గాబరా పడవలసిన పనిలేదు. అతనిచావుకు సంతోషపడవలసివుంది. కానీ—అతని ముఖం కళవళాన్ని చూపిస్తోంది. దీనికి కారణం అతని మోసకృత్యం. అతడు తనకూ సుల్తానుకూ మధ్యవున్న ప్రతిబంధకం నివారించుకోవడానికి రాయలను మోసపరచి సలబత్‌ఖాన్ హత్యకు రాయలనుంచి ఆజ్ఞను వెలువరింపజేశాడు. అతని ఆశయం సలబత్‌ఖానును పరిమార్చడం—ఇలా నెరవేరింది. ఇకతను ముద్దల్లులో ఎక్కువ

కాలం నిలచివుంటే, తన మోసకృత్యం బయటపడి రాయ లకు చిక్కి అదేశిక్షను తనూ అనుభవించవలసి రావచ్చునని అతడు సాధ్యమైనంత త్వరగా అక్కడనుంచి వెళ్ళిపోవడానికి ప్రయత్నించేశాడు. కానీ—రాయలు అతణ్ణి పంపించడాని కిష్టపడక అతని ప్రయాణాన్ని పొడిగిస్తూ వచ్చాడు. దీనికి కారణమేమిటి?

అసద్‌ఖాన్ రాయల కోరికప్రకారం నడచుకోవడానికి సమ్మతించివ్రాసియిచ్చిన సుల్తానుని లేఖను కృష్ణదేవరాయల కిచ్చాడు అంతే. దానిలో అసద్‌ఖాన్‌ను గురించి సందేహపడ వలసినంతటి అంశాలు ఒకటి రెండువున్నాయి. వీటిని అసద్ ఖాన్ అంతగా గమనించివుండలేదు. ఆలేఖలో సలబత్‌ఖాన్ పేరులేకపోయినా, అతనిని గురించి పరోక్షంగా వ్రాసిన మాట ఒకటివుంది. అదేమిటంటే, సుల్తాను తనురాయల కోరికప్రకారం నడచుకోవడానికి సిద్ధంగావున్నట్టూ, రాయలు యుద్ధంలో గెల్చిన ప్రదేశాలనూ, కొల్లగొట్టిన సంపదనూ, రాయచూరు యుద్ధంలో ఖైదీలుగా పట్టుబడిన ప్రముఖదండ నాయకులనూ విడుదల చెయ్యవలసినదని స్పష్టంగా వ్రాసి వున్నాడు.

మొదట ఈ లేఖ విషయంలో రాయలకు సంశయం కలుగలేదు. దీర్ఘంగా ఆలోచిస్తూండగా లేఖలోని చివరిమాట సుల్తాను సలబత్‌ఖాన్‌ను గురించి వ్రాసిన మాటని హఠా త్తుగా గోచరించింది. యుద్ధంలో ఖైదీలుగా పట్టుబడిన అసం ఖ్యాక సైనికులలో దండనాయకు డతడొకడే. తక్కిన వారంతా యుద్ధరంగంలోనే మరణించారు.

అసద్‌ఖానుని ద్రోహపు్రకల్పన రాయల మనస్సుకు వచ్చేవేళకు విజయనగరంనుంచే, సలబత్‌ఖానును రాజాజ్ఞ ప్రకారం ఉరితీయించ బడిందన్నవార్త వచ్చింది. దీనితో మరొక విషయంకూడా తెలిసింది. చరమ ఘడియవరకూ సలబత్‌ఖాన్ ధైర్యంగానే వున్నాడు! అతడు తనమీది రాజద్రోహారోపణను ఒప్పుకోక, తను చెఱసాలలోవుండగా, అలాంటి ఏ విద్రోహపు అకృత్యానికీ పాల్పడలేదని ఒట్టువేసి చెప్పాడు! తను రాయల సుల్తానుల మైత్రికి అడ్డురాలేదనీ, కానీ-సుల్తాను తన ఆత్మాభిమానానికి కళంకం కలిగే ఏ ఒడంబడికకూ సమ్మతించగూడదని క్రితం ఒకతూరి అతనికి సలహాయిచ్చినది నిజమేననీ, చెఱసాలలోనుంచి లేఖవ్రాసి సుల్తాను మనసును చెరపినది అబద్ధమనీ-ఉరికంబంవద్ద నిలబడినప్పుడు కూడా అన్నాడు. అదంతా నమ్మక చెఱసాల అధికారి రాజాజ్ఞను నెరవేర్చివేశాడు.

ఈవార్త విని రాయలకు అసద్‌ఖానుని మోసకృత్యం తెలిసివచ్చింది. అతణ్ణి పిల్చుకురావడానికి రాయలు దూతలను పంపించాడు.

కానీ-ఆవేళ కప్పుడే అసద్‌ఖాన్ రాయల కళ్ళుగప్పి ముద్గల్లునుంచి తప్పించుకొని పారిపోయాడు.

తను ముద్గల్లునుంచీ బయలుదేరడానికి రాయలు నిరాకరించినప్పుడే అతనికి అనుమానంవేసింది. బహుశః తన మోసకృత్యమేమైనా రాయలకు తెలిసిపోయిందేమోనని అతడు శంకించాడు. అందుకోసం తనను విజయనగరంనుంచి సలబత్‌ఖాన్ మరణవార్త వచ్చేవరకూ నిలిపివుంచాలని అను

కొని వుండవచ్చునని ఆలోచించాడు. అదేవిధంగా సలబత్ ఖానుని హత్యావివరాలు—అతడు మరణించడానికి ముందు చెప్పిన కొన్నిమాటలు ముద్గల్లునుచేరి అసద్ ఖానుని చెవిలో పడ్డాయి. రాయలు తన మోసకృత్యాన్ని బయల్పరచి, తనను సలబత్ ఖానుని హత్యాకారియని శిక్షించడానికి చూస్తూ వున్నాడని ఆలోచించి, రాయలకు చెప్పకుండా ముద్గల్లు నుంచి పారిపోయాడు.

అతడు ఏదో సాకుచెప్పి, రాజసేవకులను మోసగించి ఉపాయాంతరంగా ముద్గల్లునుంచి బయటపడి బిజాపురాన్ని చేరుకుని రాయల విషయాలన్నీ సుల్తానుకు తెలియజేశాడు.

అసద్ ఖానుని రాయబారం ఏమైందోనని కాచుకుని కూర్చునివున్న సుల్తానుకు అసద్ ఖాన్ అబద్ధపు వర్తమా నాన్నే తెలియజేశాడు. తన తలను మిగిలించుకోవడంకోసమై అతడు మరొక కపట నాటక మాడవలసివచ్చింది. రాయలకు సుల్తానుమీద కోపం, అసమ్మతులు తగ్గలేదనీ, అదిల్ శహాన్ పెద్దలుచేసిన అవమానానికి అదిల్ శహానును శిక్షించడమే రాయల ఉద్దేశమనీ, అదిల్ శహాన్ తనకు పట్టుబడిన వెంటనే అతనిని అవమానంచేసి. అతణ్ణి ఉరితీయించడానికి రాయలు నిశ్చయించివున్నాడనీ తెలియజేశాడు. ఈ మాటలను బల పరచడాని కన్నట్టుగా సలబత్ ఖానుని హత్యావిషయంకూడా తెలియజేశాడు. సలబత్ ఖాన్ రాయలకు ఏద్రోహం చెయ్యక పోయినా, అతడు సుల్తానుమీది ద్వేషం తీర్చుకోవడానికి అతణ్ణి చిత్రహింసలుచేసి చంపాడనీ చెప్పాడు.

ఈవార్తవిని సుల్తాను ఒక్కతూరిగాకూలబడిపోయాడు. కొంతసేపు సలబత్ ఖానుని చావును నమ్మలేక మళ్ళీ మళ్ళీ ప్రశ్నించాడు. సలబత్ ఖాన్ సుల్తానుకు విశ్వాసనీయుడైన వాడు. తన సద్గుణాలతో సుల్తాను మనస్సును చూరగొన్న వాడు. అతడు సుల్తానుని ప్రాణమిత్రుడు. సలబత్ ఖానునంతటి వీరుణ్ణి నిష్కారణంగా రాయలు చిత్రహింసచేసి చంపాడంటే అతనికి తనమీద ఇకెంత కోపం వుండవచ్చు అని వితర్కించాడు. అతని కాషణంలో అసద్ ఖానుని మాటలన్నీ సత్యమైనవిగానే తోచాయి. వదలివెళ్ళిన మిత్రునికోసం శోకించి అతని ఆత్మకు శాంతినికోరి ప్రార్థించాడు.

అప్పటికీ అతని హృదయక్షోభ నెమ్మదించలేదు. రాయలెందుకు సలబత్ ఖానును క్రూరంగా శిక్షించాడన్నది పరిష్కరించరాని సమస్య అయింది. తన సేనాధిపతులమీద రాయలకు ఈవిధంగా కోపంవుంటే అసద్ ఖాన్ సురక్షితంగా వచ్చిన విధమెలా? రాయలతన్ని బంధించి శిక్షించకుండా వుండేవాడా? రాయలు తన లేఖకు జవాబు వ్రాసిపంపక వుండేవాడా? రాయలు లేఖవ్రాయడానికి ముందే అసద్ ఖాన్ పారిపోయివుండవచ్చా? వగైరా ప్రశ్నలు సుల్తాను తలలో నిండిపోయాయి. తన మోసం బయటపడితే, తన ప్రాణానికి గండం రావచ్చునని భయపడి అసద్ ఖాన్ సమయోచితమైన అబద్ధపు కథనే చెప్పాడు.

రాయలు తనను తిరస్కారంగాచూసి ముద్గల్లుకు పోగానే ఖైదుచేశాడనీ, తను చెఱనుంచి తప్పించుకుని వచ్చాడనీ తెలియజేశాడు. సుల్తానుని లేఖను, రాయలు తిరస్కార

భావంతో చూశాడనీ, తన కత్తితోనే సుల్తానుకు జవాబిచ్చినట్టుగా చెప్పాడనీ తెలియ జేశాడు. అందువల్ల సుల్తానుని మనస్సుకు పూర్తిగా సమాధానం కాకపోయినా తాత్కాలిక సమాధానం కలుగకుండా వుండలేకపోయింది.

కానీ—ఈసమాధానం సుల్తానుకు చాలాకాలం లేకపోయింది. ముద్గల్లునుంచీ వచ్చిన రాయల దూతలు సుల్తానుకు కనిపించారు. వాళ్ళు రాయల వద్దనుంచి సందేశపత్రాన్ని తెచ్చివున్నారు. వాళ్ళ యజమానిగా గోవిందరాజు వచ్చాడు.

గోవిందరాజును సుల్తాను ఆదరంతో ఆహ్వానించి అతడు తెచ్చిన లేఖను చదువుకున్నాడు.

దానిని చదువగానే సుల్తాను ముఖం వివర్ణమైనది. రాయలు అసద్‌ఖాన్ తనను ఎలా మోసగించి, సలబత్‌ఖానును హత్యచేయించాడన్న విషయం వివరంగా వ్రాసివున్నాడు. అంతేకాక సుల్తాను తనతో మైత్రినభిలషించడం నిజమైతే ద్రోహియైన అసద్‌ఖానును గోవిందరాజుతో ఖైదీనిగాచేసి పంపించవలసినదనీ, ఆనీచుణ్ణి తను శిక్షించాలని వున్నట్లూ తెలియజేసి వున్నాడు. అసద్‌ఖానును రాయలకు అప్పగించని పక్షంలో అతని అకృత్యాలన్నిటికీ సుల్తాను ప్రోత్సాహమున్నట్లుగా తను భావించి, ఆద్రోహిని శిక్షించడానికి తనే మళ్ళీ దండెత్తి వచ్చునట్టుగా బెదురు పెట్టాడు.

ఈ పత్రపు బెదరింపు కేవలం వట్టి బెదరింపుగాదని బాగా తెలుసు.

రాయలు వ్రాసినట్టుగా అసద్ ఖానును, గోవిందరాజు చేతికప్పగి స్తేమాత్రం తన ప్రాణాలు దక్కుతాయి. లేకపోతే అసద్ ఖానుని మోసకృత్యంలో తనకూ భాగం వుండనుకుని రాయలు తనమీద దండెత్తిరావడం నిజం. ఈతూరి రాయలు దండెత్తివస్తే తనరాజ్యం ధూళి పటలమైపోతుంది. తను దిక్కులేని పరదేశిలా దుఃఖించవలసి వస్తుంది. తను రాయలచేతికి చిక్కితే ఇక తనగతి అంతటితో పూర్తిఅయి నట్టేనని ఈవిధమైన ఆలోచనలంతాచేసి, అసద్ ఖానును గోవిందరాజు కప్పగించడ మొక్కటే సరైన దారి అని అసద్ ఖానును బంధించి తీసుకురావడానికి భటులను పంపాడు.

అసద్ ఖానును రాయల కప్పగించడంలో స్వార్థపు జతకు తన మిత్రుడైన సలబత్ ఖానును అన్యాయంగా చంపించిన ఆ విశ్వాసఘాతకునికి శత్రువు చేతిలోనే ఆశిక్ష విధింపబడడం సంతోషమే అయింది.

ఈ విషయం అసద్ ఖాన్ ఎలా తెలుసుకున్నాడో, అతడు బిజాపురం నుంచి సరైనసమయానికి తప్పించుకుని సుల్తానుని పన్నుగడ లన్నిటినీ నాశనం చేశాడు. అతడెక్కడికి వెళ్ళాడన్నది ఎవరికీ తెలియని విషయమైంది. సుల్తాను గోవిందరాజును వట్టిచేతులతో పంపించవలసి వచ్చింది. దీని పరిణామ మేమిటన్నది సుల్తానుకుకూడా తెలుసు!

అసద్ ఖానును రాయల కప్పగించకపోతే రాయల క్రోధం తనమీద తిరిగి అసద్ ఖానుని శోధనకుగా తనే దండెత్తి రావడం ఖచ్చితమని అనుకున్నాడు. ఈవిపత్తునుంచి బయట పడడానికి తను అసద్ ఖానును వెతికితీసుకొచ్చి అప్ప

గించడ మొక్కటేదారి. కానీ—అసద్ ఖాన్ ఎక్కడ దాగి వున్నాడన్నది ఎవరికీ తెలియదు. రాయలు ఆతని శోధనకు వెళ్ళడానికి ముందే తను అసద్ ఖానును పట్టి అతనికప్పగించి ఆమూలంగా సంధిని సాధించాలని నిశ్చయించి వెంటనే కార్యాచరణకు ప్రారంభించాడు.

ఇంతలో రాయలు తన సకలసైన్య సమేతంగా అసద్ ఖానుని శోధనకు వెళ్లాడని తెలిసింది. అసద్ ఖాన్ బిజాపురం నుంచీ పారిపోయి, గుల్బర్గ్ లో దాగివున్నాడన్న విషయం గూఢచారుల నుంచి రాయలకు తెలిసింది. తాము గుల్బర్గను ముట్టడిస్తే, గుల్బర్గ్ తమ వశంకావడంతో అసద్ ఖాన్ కూడా పట్టుబడతాడని రాయలు గుల్బర్గ్ మీద దండెత్తడానికి సైన్యసమేతంగా వెళ్లాడు.

ఈ వార్తను విని సుల్తాను తల్లడిల్లిపోయాడు. సుల్తానుకు ఈపరిస్థితిలో ఏమిచెయ్యడానికీ తోచలేదు. తను గుల్బర్గ్ రక్షణకు వెళ్ళడానికి తన వద్దవున్న సైన్యం రాయలను ఎదురించడానికి చాలినంతలేదు. వృథాగా రాయలతో పోరాడితే అపజయం తథ్యం, తను రాయల గొడవకు పోకుండావుండడమే క్షేమకరమని సుల్తాను బిజాపురం నుంచి రాయల చర్యలను గమనిస్తూకూర్చున్నాడు.

గుల్బర్గ్ను సులభంగా వశపరచుకోవచ్చుననివున్న రాయల ఊహ వ్యర్థమైంది. అది శక్తివంతుడైన అదిల్ ఖాన్ అన్న దళపతి పాలనకు లోబడివుంది. అతడు అదిల్ శహానులా పిరికిపందకాడు. ప్రాణం పోయినా శత్రువులకు కోటను వశంచెయ్యకూడదన్న వీర ప్రతిజ్ఞఅతనిది. అతడు

తనకు సహాయానికిగా బహమనీ సుల్తానులకు లేఖవ్రాసి, వాళ్ళ సహాయం లభించేవరకూ దుర్గాన్ని కాపాడాలని నిశ్చయించాడు. శత్రువులు గుల్బర్గ్ మీద దండెత్తడానికి వస్తున్నారన్న వార్తను విన్నవెంటనే అతడు కోట వాకిలిని భద్రపరచి, ప్రతిఒక్క ఆయకట్టు ప్రదేశాలలోనూ సైనికులనూ ఫిరంగులనూ నిలిపి, ముందుజాగ్రత్తను తీసుకున్నాడు. అంతే కాక కోటలో కావలసినంత ఆహారపదార్థాలను సేకరించి వుంచాడు.

బిజాపుర సుల్తాను చేసినట్టే గుల్బర్గ్ దళపతికూడా యుద్ధంలేకుండా నగరాన్ని వశపరుస్తాడని భావించిన రాయలకు నిరాసే అయింది. అయినా గుల్బర్గ్‌ను రక్తపాతం లేకుండా వశపరచుకునేట్టుగా చెయ్యాలసి దుర్గాధిపతికి యుద్ధాహ్వాన మివ్వడానికి ముందే నయంగా ఒకమాట చెప్పాలని రాయబారిని పంపించాడు. గుల్బర్గ్‌లో దాక్కొని వున్న రాజద్రోహి అసద్‌ఖానును బంధించి తమకు అప్పగిస్తే యుద్ధంలేకుండా స్నేహితుల్లా వుండవచ్చునని చెప్పి పంపించాడు.

దీనికి దుర్గాధిపతి యిచ్చిన జవాబువల్ల రాయల స్వాభిమానానికి వాత పెట్టినట్టయింది. యుద్ధానికనే వచ్చి వున్న రాయలు తన ముందు ఏకపటనాటక మాడినా వాటికి వశుడై, దుర్గాన్ని అప్పగించడంలేదనీ, దుర్గపు సమస్తరక్షణా భారం తనదేసనీ, యుద్ధంచేసే దుర్గాన్ని వశపరచుకోవాలి కానీ, బొబ్బలతో, బెదరింపులతో ఏమీ ప్రయోజనం లేదనీ వీరోచితమైన జవాబునే చెప్పాడు దళపతి.

వీటి పరిణామంగా యుద్ధం అనివార్యమైంది. రాయల సైనికులు యుద్ధాన్ని ఘోషించి గుల్బర్గ్‌మీద వెళ్ళిపడ్డారు. అప్పుడువాళ్ళకు అదిల్‌ఖాన్ ఎంతటివీరుడన్నది తెలిసింది.

అదిల్‌ఖాన్ తక్కువ సంఖ్య సైన్యాన్ని కలిగివున్నా దుర్గాన్ని సులభంగా విడచిపెట్టలేదు. అతడు రాయల సైన్యానికి బలమైన పోరాటాన్నేయిచ్చాడు. కానీ—రాయల అధికసంఖ్యలోని సుశిక్షిత సైన్యంముందు గుల్బర్గ్ చాలా కాలం నిలువలేక పోయింది. దుర్గద్వారాలను మదపుటేను గుల సహాయంతో పగుల గొట్టడమైనది. చివరికి నగరాన్ని రాయల సైనికులు ప్రవేశించేతీరారు. నగరంలో తప్పిచారి మిగిలిన సైనికులతో బలమైన యుద్ధంజరిగింది. ఈయుద్ధంలో అదిల్‌ఖాన్ మరణించాడు. అతని తలను ఖండించి, దానిని నగరంలో ఊరేగింపు చేశారు. ప్రజలను కట్టుబాటులో వుంచడానికి ఈ పని ఒక్కటి చాలు.

ప్రజలు ముందుకు తమకేమి ఆపదకాచుకుని వుందో నని భీతిల్లారు.

కానీ—ప్రజ భయపడవలసిన పని లేకపోయింది. రాయలకు గుల్బర్గ్‌ను బిజాపురంలా ధ్వంసంచెయ్యడాని కిష్టం లేకపోయింది. అంతేకాక గుల్బర్గుమీద దండెత్తి పోవడం లోనిఉద్దేశం అసద్‌ఖానును ఖైదుచెయ్యడం. అతడుపట్టుబడితే తమఉద్దేశం నెరవేరినట్టేనని దుర్గం వశమైన వెంటనే అసద్ ఖాన్ కోసం ప్రతిఒక్కయింటినీ, వీధినీ విడువకుండా వెతి కారు. అయినప్పటికీ అసద్‌ఖాన్ జాడ కనిపించలేదు.

అసద్‌ఖానుని అదృష్టం బావుండి అతడు అక్కడి నుంచీ గూడా సకాలంలో తప్పించుకున్నాడు.

రాయలసైన్యం దుర్గాన్ని ప్రవేశించే వేళకు అసద్ ఖాన్ దుర్గంలో నే లేడు. అసద్‌ఖాన్ మారువేషంతో తన దుర్గమైన బెల్గాంకు పారిపోయాడు. ఒక్కరోజు ఆలసించి వుంటే అతడు రాయలకు పట్టుబడివుండవలసి వచ్చేది. అసద్ ఖానుని పలాయనంతో చేతికివచ్చిన అన్నం నోటికి లేక పోయింది. రాయలు కోపంతో పళ్లుకొరికాడు.

రాయలు సైన్యసమేతంగా కొంతకాలం గుల్బర్గలో దండు విడిశాడు. గుల్బర్గనువశపరచుకున్నా రాయల ఆశయాల్లో ఒకటీ నెరవేరలేదు. సులభంగాబంధించి అసదుఖానును తనకు అప్ప గించవలసిన అదిల్‌శహాన్ ఉదాసీనం చెయ్యడంవల్ల అతడు తప్పించుకునిపోయాడని రాయలకు అదిల్‌శహాన్ మీద కోపం వచ్చింది. ఆకోపాన్ని మరోవిధంగా తీర్చుకున్నాడు.

పూర్వపు బహామనీ రాజ్యపు రాజవంశానికి సంబంధిం చిన ముగ్గురు గోల్కొండ రాజకుమారులను బిజాపురసుల్తాను అదిల్‌శహాన్ చాలా కాలంనుంచీ గుల్బర్గలో చెఱసాలలో వుంచి వున్నాడు. రాయలు వాళ్ళను చెఱనుంచి విడుదల చేసి వాళ్ళలో పెద్దవాడైన అల్లావుద్దీన్‌కు పట్టంకట్టి అతణ్ణి బహామనీ చక్రాధిపత్యపు సార్వభౌముడని ఘోషించాడు. అందువల్ల స్వతంత్రరాజ్యాలైన బీదర్, బీహార్, బిజాపూర్, అహమదునగర్ యివి అల్లావుద్దీనుని ఆశ్రితరాజ్యాలయ్యాయి. ఈ కార్యంతో సుప్రీతుడైన కృష్ణదేవరాయలు "యువన రాజ్య

ప్రతిష్ఠాపనాచార్య" "అష్టవిగ్రహ మనోవల్లభ" బిరుదులను ధరించాడు.

అల్లావుద్దీనును సింహాసనంమీద కూర్చోబెట్టి బహమనీ రాజ్యాల చక్రవర్తి అని ఘోషించటంవల్ల తక్కిన సుల్తానులకు రాయలమీద అసమ్మతి కలిగింది. ఇక చేతులు ముడుచుకుని కూర్చుంటే తమ అస్తిత్వాన్నే రాయలు నాశనంచేస్తాడని భయపడ్డారు. వాళ్ళు అదిల్‌శహానుకు లేఖ వ్రాసి తాము తమ సేనాబలంతో అతని సహాయానికి వచ్చునట్లుగా తెలియజేసి, అతడు మళ్ళీ రాయలమీద దండెత్తిపోవాలని ప్రోత్సహించారు. సుల్తానులు ఈ సన్నాహంలో మునిగివుండగానే, కృష్ణదేవరాయల గమనం బెల్గాం దుర్గం వైపుకు పోయింది.

బెల్గాం దుర్గం మొదటినుంచీ అసద్‌ఖానుకు చెందిన దుర్గం. అసద్‌ఖాన్ బెల్గాం దుర్గాన్ని చేరుకుని అక్కడ ప్రబలుడవడానికి ప్రయత్నించాడు. చుట్టుపట్ల రాజ్యాలను జయించి బెల్గాం రాజ్యంగా చేసుకోవడానికి ప్రయత్నాలు చేశాడు. బెల్గాం రాజ్యపు సరిహద్దు ప్రాంతాలైన బిజాపుర, విజయనగరాలను ఆక్రమించుకునే గుండె ధైర్యంలేక, గోవాను ఆక్రమించుకోవడానికి సైన్య సమేతంగా వెళ్ళాడు. గోవా అసదుఖానుని వశమైతే, పోర్చుగీసుల మూలంగా జరుగుతున్న విజయనగరపు అశ్వ వ్యాపారానికి యిబ్బంది కలుగుతుందని ఆలోచించి గోవాను ఆక్రమించుకోవడానికి వెళ్ళిన అసదుఖానుని ఆక్రమణను ఆపి, అతన్ని బంధించి

తీసుకురావడానికి రాయలు గోవిందరాజును తగిన సైన్యంతో పంపించాడు.

గోవిందరాజు అసదుఖానును బంధించి తీసుకు రావడానికి గోవా వైపుకు సైన్య సమేతంగా వెళ్ళాడు.

# 13

కృష్ణదేవరాయలకు వేటాడడమంటే చాలా ప్రీతి. వేటలో అతనికి నిష్ణాత జ్ఞానముంది. ఒక పర్యాయ మతడు వేటకు వెళ్ళాడంటే కొన్నివారాల పర్యంతం అడవిలోనే వుంటూ వుండేవాడు. ఎన్నోసార్లు ప్రాణంమీద ఆశను కూడా వదలి వేటాడుతూండేవాడు. ప్రాణాపాయం సంభవించిన ఒకటిరెండు సందర్భాలలో దైవవశాత్తూ వాటినుంచి తప్పించుకున్నాడు. అతడు వేటాడడానికి ఉత్తమాశ్వాలను వాటికివేసే కడివాణము, జీను మొదలైన వాటిని ఓమెజ్, శిరాజ్, గుజరాత్, పైతల్ నగరాలనుంచి తెప్పిస్తూండేవాడు. అంతేకాక రాయలవద్ద చాలా వేటకుక్కలున్నాయి. వాటికి వాటివాటి శక్తిసామర్థ్యాల ననుగుణమైన పేర్లుంచబడ్డాయి. వ్యాఘ్రు, అసురపోత, హనుమంత, భైరవ, సంపంగి, వాయువేగి, సాళ్వ మొదలైన పేళ్ళుగల నూరారు కుక్క లున్నాయి. వేటకుక్కలను పిలుచుకుని అడవి పందులను వేటాడడమంటే రాయలకు చాలా ప్రియమైన వినోదం. ఒకతూరి యిలాగే అడవిపంది వేటకు వెళ్ళిన రాయలు గుట్టిం

మీాదనుంచి జారి స్పృహతప్పి పడిపోయాడు. అప్పుడు గాయపడివున్న అడవిపంది రాయలమీాద ఆక్రోశంతో లేచి వస్తోంది. దాని కోరలకు రాయలు చిక్కివుంటే రాయల కథ అంతటితో పూర్తిఅయివుండేది. అలాంటి విషమసమయంలో రాయలు స్వారీచేస్తున్న గుఱ్ఱం సహాయపడి అతణ్ణి కాపాడింది. అది ముందరికాళ్ళను ఎత్తి రాయలవద్దకు పంది రాకుండా గిట్టలతో కొట్టి ఇతరులకు రాయలు విపత్తులో వుండడాన్ని తెలియజేసింది. రాయలను వెతుక్కుంటూ వచ్చిన మిత్రులు వెంటనే పందినిచంపి గుఱ్ఱాన్ని కొనియాడారు. స్పృహవచ్చిన రాయలకు తన గుఱ్ఱంఎలా తన ప్రాణ రక్షణ చేసిందని తెలిసినతర్వాత గుఱ్ఱానికి ఏవిధంగా కృతజ్ఞతను చూపాలన్నది తెలియక దాని మెడలో చాల వెలగలిగిన హారాన్ని వేసి దానిని తన ప్రియమిత్రునిలా చూసుకున్నాడు. ఆరోజునుంచీ రాయలు వేటకు ఒంటరిగా వెళ్ళడం లేదు.

రాయల పూర్వపు రాజులందరూ వేటాపడంలో చాలా ఆసక్తి చూపినవారే! ఇమ్మడిప్రౌఢ దేవరాయలకు "గజవేటకాడ"న్న బిరుదు వుండేది. అతనికి అడవిఏనుగులను వశపరచుకుని వున్న ఏనుగులమూలంగా గుంటలోకి త్రోసి, అక్కడ ఆహారము, నీరూ యివ్వక మదమణచి, వశపరచుకోవడంలో అపూర్వ కౌశలముండేది. అందువల్లనే అతని సైన్యంలో ఏనుగులసంఖ్య అపరిమితంగా వుండేది.

రాయలు తనపూర్వుల్లా "గజవేట" కాడు కాక "నరవేట" కాడయ్యాడు. అతనికి వన్యమృగాల వేటకంటే శత్రురాజుల

వేట ప్రియంగా వుండేది. అందువల్లనే గజపతులనిపించుకున్న ఉత్కళరాజుల గర్వాన్ని అణచాడు. అశ్వపతిన్లైన బిజాపుర సుల్తానును యుద్ధంలో ఓడించి, పరదేశిలా చేశాడు. అసద్ ఖాన్ పితూరీలను నమ్మి రాయలు సలబత్ ఖాన్‌ను హత్య చేసిన తర్వాత, సలబత్ ఖానుని హత్యాకారకుడైన అసద్ ఖాన్‌ను పట్టి తెచ్చి కఠినంగా శిక్షించాలని రాయలు బయలుదేరి అతణ్ణి వేటాడుతూ గుల్బర్గ్‌కు వచ్చాడు. దుర దృష్టంవల్ల చేతికి చిక్కిన వేట తప్పించుకుని పారిపోయింది. అతణ్ణి బంధించి తీసుకురావడానికి గోవిందరాజును పంపించి. అతడువచ్చేవరకూ రాయలు గుల్బర్గ్‌లోనే దండు విడిశాడు. ప్రొద్దు గడపడానికి అనేకరకాల , మనోల్లాసాలలోనూ, మృగయావినోద విలాసాలలోనూ మునిగిపోయాడు.

ఇలా వుండగా ఒకరోజు గుల్బర్గ్ దుర్గపు వెలుపలి ప్రదేశంలో విహారార్థమై వస్తుండగా, ఒక పల్లెవాని ఆర్త ధ్వని వినిపించింది. ఏమిటని విచారించగా అతనివద్దవున్న ఒకే ఒక్క పశువును – నిండుచూలాలైన పశువును పులి పట్టుకొనిపోయినదనీ, అందుకోసం అతడు రోదిస్తూవున్నాడనీ తెలిసింది. రాయలకుకుతూహలం కలిగింది. పులిని గురించి ఎక్కువవివరాలను తెలుసుకోవడానికాశించాడు.

ఆ ప్రదేశంలో చాలా రోజులనుంచీ ఒక పెద్దపులి నివసిస్తూ, చుట్టుపట్ల గ్రామాలలోనికి రాత్రికాలంలో వెళ్ళి గోవులను, దూడలను ఎత్తుకొని పోతుండేది. ఒకటి రెండు తూర్లు ఆవులను కాస్తున్న పిల్లవాళ్ళనుకూడా తినేసింది. అది తనవేటలో అరితేరిన పులి. దాన్ని చంపడానికి చేసిన

గ్రామస్థుల సాహసమంతా వ్యర్థమై, అది కాళికాదేవి వాహనమని, అందువల్లనే దాన్ని చంపడానికి మానవ మాత్రులనుంచీ సాధ్యంకావడంలేదనీ అనుకుని హతాశుల య్యారు.

ఇప్పుడా పులి తన ఆహారానికని నిండు చూలాలైన పశువును ఎత్తుకుని పోయింది. అదీ విచిత్ర విధానంలో!

ఆపల్లెవాడు ఆవును మేపుకునివచ్చి దానిని కొట్టంలో కట్టి అన్నంతిని పడుకున్నాడు. అర్ధరాత్రివేళలో శబ్దం కావడంచూసి, ఎక్కడో దూడనుయీనుతున్న వేదన వుండ వచ్చునని అనుకుని దీపపువెలుగులో కొట్టానికి వచ్చి చూసి, ఆవుశరీరాన్ని నిమిరి, గడ్డివేసి పడుకున్నాడు. మళ్ళీ ఆవు అరపు మేల్కొల్పగా గాబరాపడి పరుగెత్తి వెళ్ళి చూడగా ఆవు కనుపించలేదు. అది వున్నచోట రక్తప్రవాహం పారు తోంది. దానిని చూడగానే అది పెద్దపులి పనేనని ఊహించి, పులి వెళ్ళినస్థలానికి దాని అడుగుజాడల ననుసరించి వెళ్ళి చూడగా దాదాపు నూరు మూరల దూరంలో ఆవును చంపి రక్తం త్రాగుతున్న పులి కనిపించింది. ఇక తను దాని కళ్ళల్లో పడితే తన ఆయువు ముగిసినట్లేనని అనుకుని అతడు యింటికి తిరిగి వచ్చేశాడు.

అతడు తన సర్వస్వమైన ఆవు పులి నోటికి బలి అయి నందుకు ఆరోజంతా రోదించ సాగాడు. నిశ్శబ్ద నీరవతలో అతని ఆర్తనాదంవిని, బీదప్రజలను తొందరపెట్టి, గోడుపడ జేస్తున్న ఆపులిని చంపాలని రాయలు నిర్ణయించి తన భవ నానికి వెళ్ళాడు.

మరుసటిరోజు రాయలు తన ఆప్త మిత్రులకు తను పులివేటకు వెళ్ళనున్న విషయం చెప్పాడు. బహుకాలానంతరం వేటాడడానికి దొరికిన ఈఅవకాశం వాళ్ళకు సంతోషమై రాయల వేటకు కావలసిన ఏర్పాటులన్నీ చేశారు.

పులివేటలో సిద్ధహస్తులైన వేటగాళ్ళదండే చేరింది. వాళ్ళకంతా దుస్తులనూ, ఆయుధాలను సమకూర్చి యిచ్చి, మిత పరివారంతో రాయలే పులివేటకు వెళ్ళాడు.

పోతూవున్నట్టే ఆ పెద్దపులిని గురించి చిత్ర విచిత్రములైన కథలనేకం విన్నాడు.

ఒకసారి ఆ పులి గొర్రెలను కాస్తున్న ఒక బాలుణ్ణి ఎంతోమంది ఎదురుగానే ఎత్తుకుని వెళ్ళి అతని రక్తాన్నిపీల్చి అతణ్ణి అక్కడనే విడచి వెళ్ళిపోయింది.

మరొకతూరి ఇద్దరు ప్రయాణీకులు ఆ అడవి దారిలో మాట్లాడుకుంటూ వస్తున్నారు. సుమారు మధ్యాహ్నం రెండు గంటల సమయంలో మార్గాయాసం బాపుకోవడానికి ఒక చెట్టునీడన కూర్చున్నారు. సహజంగా ఆ సమయంలో వాళ్ళకు ఆ అడవిలో నివసిస్తున్న పులిమాట వచ్చింది. ఒకడు మరొకనికి తనకు తెలిసిన ఆ పులియొక్క చాతుర్యం, క్రూరత్వం, ధైర్యాలను గురించి వర్ణించి చెబుతున్నాడు. సరిగా ఆదేసమయానికి అతడు వర్ణిస్తున్న పులే ఎదురై వాళ్ళిద్దరు అక్కడే సమాధి అయ్యారు!

కృష్ణదేవరాయలు పులిని గురించిన విషయాలు కావలసినన్ని సంగ్రహించుకుని వుండడంవల్ల పులినుంచీ ఏ అపా

యమూ సంభవించకుండా ముందు జాగ్రత్త తీసుకుని పులి నివసిస్తూంటుందని చెప్పుకునే అడవి భాగానికి వచ్చి చేరాడు.

ఆ ప్రదేశంలో దట్టమైన వృక్షాలు పెరిగి వన్య మృగాల ప్రభుత్వానికి అనుకూల మేర్పరచాయి. ఎక్కడ చూసినా నిలువెత్తుకంటే ఎక్కువగా పెరిగిన కురుచటి చెట్లు, పొదలు. ఈ కురుచటి చెట్లనడుమ అడవి జంతువులు నివాస మేర్పరచుకుని వున్నాయి. పులి తన నివాసం కురుచటి చెట్ల నడుమనే ఏర్పరచుకుని వుండవచ్చునని నాలుగు దిక్కుల నుంచీ ఆ ప్రదేశాన్ని శోధిస్తూ వెళ్ళారు.

రాయలు ఒకవైపునుంచీ గుఱ్ఱాన్నధిరోహించి వ్యాఘ్రపు నివాసాన్ని వెతుక్కుంటూ వెళ్ళాడు. అతణ్ణి వెన్నంటి నాలుగువందల సశస్త్ర సైనికులు అతని రక్షణకోసం నడుస్తున్నారు. రాయల వేటకుక్కలు పులి వాసనపట్టి వెతుకుతూ వెళ్ళుతున్నాయి. వాటి ధ్వనిని పట్టి రాయలు జాగ్రత్తతో శరీరమంతా కళ్ళుచేసుకుని నడుస్తున్నాడు. ఇంతలో దూరంగా కుక్కల సంతతమైన అరుపులు వినిపించాయి. ఆ వైపుకు రాయలు తనగుఱ్ఱాన్ని వేగంగా పరుగెత్తించాడు. అందువల్ల అతణ్ణి వెన్నంటి వస్తున్న సైనికులు దూరంగా వుండిపోయారు. రాయలు గుఱ్ఱాన్ని వాయువేగంగా పరుగెత్తించుకుని కుక్కలున్న ప్రదేశానికి వచ్చాడు.

అక్కడ ఒక ఆవు మెడవిరిగి చచ్చి పడివుంది. దాన్ని చూసే కుక్కలు శబ్దంచేశాయి. ఆ దృశ్యాన్నిచూసి రాయలు అది పులిచేసినపనేనని నిశ్చయించాడు. అక్కడ రక్తపు కాలువ ప్రవహించివుంది. పులి గోవు రక్తాన్నిత్రాగి

దాని ఉదర భాగపు మాంసాన్ని తిని, తక్కినభాగాన్నలాగే విడచి వెళ్ళింది. కొన్ని రాబందులుతప్ప మరేమీ దానివద్ద లేకపోవడం చూసి, ఆ వ్యాఘ్రము గోవు రక్తమాంసాలతో తృప్తిపొంది సమీపంలోనే విశ్రాంతి తీసుకుంటూ వుండ వచ్చునని రాయలు అనుకున్నాడు. చుట్టూచూస్తూ పది మూరల దూరంరాగా ఒక చెట్టుక్రింద పులి పడుకుని వుండడం కనిపించింది.

అది చాలా పెద్ద ఆకృతి కలిగినది. బాగా తిని క్రొవ్విన శరీరం. అది ఆరోజుటి ఆహారంతో బాగా మదించి శరీరంమీద స్పృహలేకుండా పడివుంది. రాయలు నిశ్శబ్దంగా గుఱ్ఱంమీదనుంచి దిగివచ్చి భద్రమైనచోట కూర్చుని తుపాకి ప్రేల్చాడు. తుపాకి గుండు దురదృష్టవశాత్తు పులికి తగులకుండా పైన దూసుకుపోయింది. ఒక్కసారిగా గుండు దూసుకుపోవడంవల్ల పులిభయపడి అడవి తల్లక్రిందులయ్యేలా భీకరంగా గర్జించింది. అప్పుడు రాయలు మరొకగుండు ప్రేల్చాడు. ఈ తూరి గుండు పులికి తగిలింది కానీ - అది అపాయస్థలంలో పడకపోవడంవల్ల పులి ఒకతూరి నేలకు ఒ్రాల్లి, తనను గాయపరచినవానిమీద పడడానికి దూసుకు వచ్చింది. అప్పుడు మరొక గుండు వచ్చి పడింది. పులి నేలకు దొర్లింది. కానీ చావలేదు. తన శత్రువు తనకంటే బలవం తుడుగా వున్నాడని భావించి ప్రాణంమీది ఆశతో అది అక్కణ్ణుంచే పారిపోయింది.

రాయలు పులి తన తుపాకిదెబ్బలకు బలికాకుండా గాయపడినా చావకపోవడం చూసి ఆశ్చర్యపడ్డాడు. అంతే

కాదు; అది అతని కళ్ళుగప్పి పారిపోయింది. గాయపడిన పులిని అలాగే విడువకూడదనీ, అలా చెయ్యడంవల్ల అపాయమనీ, ఏమైనా కానీ పులిని చంపి యమసదనానికి పంపించే రావాలనీ యోచించి, అతను గుఱ్ఱమెక్కి పులిని తరుముకుని వెళ్ళాడు.

రాయలు పులిని తరుముకుని పదిమూరలు వెళ్ళలేదు. అతడు కూచునివున్న గుఱ్ఱం హఠాత్తుగా ముందుకు బోర్లా పడింది. రాయలు గుఱ్ఱంమీదనుంచీ ఎగిరి క్రిందపడ్డాడు. మళ్ళీ లేచి గుఱ్ఱంమీద ఎక్కడానికి ప్రయత్నిస్తున్నంతలో అతని చుట్టూ సరసర శబ్దమైంది. ఏమిటని తిరిగి చూడగానే పదిమంది బలిష్ఠులైన వ్యక్తులు రాయలమీదపడి అతణ్ణి నిరాయుధుణ్ణిగా జేసారు. అనంతరం అతని నోటికి గుడ్డలు తురికి కాళ్ళు చేతులను పగ్గాలతో బంధించారు. రాయలు హఠాత్తుగా సంభవించిన ఆక్రమణతో గాభరాపడి, తన శత్రువులు ఎవరని చూచునంతలోగా ఈ పనులన్నీ జరిగి పోయాయి. తనమీదపడిన శత్రువులెవరు? వాళ్ళ ఉద్దేశమేమిటి? అన్నది రాయలకు తెలియకపోయింది. వాళ్ళను క్షణకాలం తీక్ష్ణంగా చూసి కోపంతో మండుకు పోయాడు రాయల కోపాన్ని లెక్కచెయ్యనివాడిలా ఆ శత్రువుల యజమానిలా కనుపిస్తున్న, బలశాలి అయినవ్యక్తి రాయలవద్దకు వచ్చి, అతని ముఖంమీద బలంకొద్దీ ముష్టి బిగించి ఒక్క దెబ్బపెట్టి, ముఖానికి నల్లని గుడ్డను బిగించి కట్టాడు. రాయలకు ఒక్కసారిగా తగిలిన దెబ్బవల్ల ముక్కులో, నోటిలో రక్తం వచ్చింది బుద్ధి కుంఠితమై

పోయింది. ఆకాశం విచ్ఛిన్నమై తలమీద పడినంత సంవే దన అయింది. నక్షత్రాలు రాలిపోయినట్లుగా భాసమాన మైంది. దెబ్బ తగిలిన ముక్కు-భాగంలో భయంకరమైన బాధ కనిపించింది. రాయలు బాధను భరించలేక అరవడా నికి ప్రయత్నించాడు. కానీ - కంఠములో స్వరం వెలువడ లేదు. తన మిత్రులను చెయ్యెత్తి పిలువడానికి ప్రయత్నిం చాడు. చెయ్యి బంధించివేశారు. కనుచూపుతోనైనా సహాయం పొందడానికి చూశాడు. కళ్ళకుకూడా నల్లటి ముసుగు పడింది. రాయలిక ఏమి చెయ్యడానికీ తోచక తామసపు గాఢాంధకారంలో ప్రజ్ఞా శూన్యుడై ఊరకుండి పోయాడు.

ఆ శత్రునాయకుడు రాయలను మోపించుకుని త్వర త్వరగా వెళ్ళాడు. వాళ్ళు తమ ఉద్దేశం సాధించడంవల్ల, సంతోషంతో పొంగిపోతూ తాము రాయల సైనికుల కంట్లో పడకముందే తప్పించుకోవాలని గబగబ అడుగులు వేశారు. ఎక్కువగా శబ్దంచేస్తే శత్రువుల కెక్కడ తెలుస్తుందోనని, ఒక్కమాటకూడా మాట్లాడక త్వరత్వరగా రాయలను ఎత్తు కుని నడువసాగారు.

ఇలా వాళ్ళు సుమారు అర్ధగంటకాలం నడచి వుండ వచ్చు. అంతలో వాళ్ళ గమ్యస్థానం వచ్చింది.

ఆ ప్రదేశంలో నాలుగైదు పెద్దపెద్ద బండలు చిత్ర విచిత్రంగా ఒకటిమీద ఒకటి జోడించినట్టుగా వున్నాయి. వాటి నడుమ ఒక మనుష్యుడు కష్టంతో వెళ్ళగలిగినంత బిల

ద్వారముంది. ఆ ద్వారాన్ని ఒక పెద్ద గుండుతో మూసి వున్నారు.

రాయలను ఎత్తుకునివచ్చిన ఆ ముగ్గురు, నలుగురు తమ బలాన్నంతా ప్రయోగించి, ఆ బండను ప్రక్కకు జరిపారు. ఆ ప్రదేశంలో బిలద్వారం కనిపించింది. రాయలను ఎత్తుకుని ఒకొక్కరుగా చాలా కష్టపడుతూ గుహలోకి వెళ్ళిపోయారు.

ఆ గుహ ద్వారంవద్ద చిన్నదిగా వున్నా, పోనుపోనూ విశాలంగా వుంది. అంతేకాదు. అక్కడ గాలి, వెలుగు కావలసినంత పడుతోంది. ఒక్కతూరిగా ముప్ఫయి, నలభై మంది పడుకునేందుకు వీలైనంత విశాలంగా వుంది.

అక్కడికి రాయలను ఎత్తుకునివచ్చి ఒక ప్రక్కన పడ వేశారు. అనంతరం వాళ్ళ యజమాని ఏమిటో తన అనుచరులకు ఆజ్ఞాపించి గుహానుంచీ బయట పడ్డాడు. అతని వెనుక మరిద్దరు పెద్ద సంచులతో వెలుపలికి వెళ్ళారు.

గుహావద్దకు వచ్చేవరకూ ఊపిరి పట్టుకుని వచ్చిన ఆ శత్రువులు స్వస్థానం చేరారు. వాళ్ళు యిప్పుడు తమ యిష్టం వచ్చినట్టు మాట్లాడుకుని నవ్వుకోసాగారు. తమ సాహసాలను మెచ్చుకుని నృత్యం చెయ్యసాగారు. తాము చాలారోజులనుంచీ పొంచువేసిన కార్యం సులభంగా యశోవంతమైనందుకు వాళ్ళ సంతోషానికి మేరలేకపోయింది. వాళ్ళు సంతోషంతో పాడి, పండుగ చేశారన్నా సరిపోతుంది!

ఇదంతా జరిగే సమయానికి రాయలకు పోయిన జ్ఞానం మళ్ళీ రాసాగింది. చెవులకు కఠోరమైన శబ్దం, కేకలు, అసభ్యమైన మాటలు వినిపించాయి. రాయలు వాళ్ళ మాటలనుబట్టి వాళ్ళు అడవిలో నివాసంచేసే పగటి దొంగలని తెలుసుకున్నాడు. వాళ్ళు క్రితం ఒకతూరి బిజాపుర సుల్తానుని సైనికులుగా వుండి వుండవచ్చునని వాళ్ళ మాటలను బట్టి ఊహించాడు. అంతకంటే ఎక్కువ విషయాలు వాళ్ళ అస్పష్టపు మాటలవల్ల రాయలకు తెలియకపోయాయి. ఇప్పుడు రాయలు కళ్ళు తెరచి చూడడానికి వీలైంది. ముఖంమీది ముసుగును తీసేశారు. నోటిలో తురికిన గుడ్డలను తీసివెయ్యడంవల్ల ధారాళంగా ఊపిరాడసాగింది. కానీ అటు యిటు కదలకుండా కట్టిన బలమైన కట్లుమాత్రం బిగువుగా వున్నాయి.

రాయలు పడుకుని వున్నచోటనే పార్లి తనుఎక్కడున్నాడు? ఇక్కడికి తనెలా వచ్చాడు? తనను బంధించి తీసుకొచ్చినవాళ్ళెవరు? అని తెలుసుకోవడానికి ప్రయత్నించాడు. అతనికి. కొంతదూరంలో వాళ్లునేలమీద పరచిన చాపమీద కూర్చుని మద్యం సేవిస్తూ యిష్టంవచ్చినట్టు వాగుతున్నారు. వాళ్ళ కరాళ వదనాలు మండుతున్న పొయ్యి వెలుగులో స్పష్టంగా గోచరిస్తున్నాయి. రౌద్రంతో కూడిన ఆ మనుష్యులు యమకింకరుల్లా రాయలకు కనిపించారు.

వాళ్ళు చేతులకు కట్టిన బంధాలను విడిపించుకుని ఇక్కడనుంచీ తప్పించుకుని పోవడానికి వీలవుతుందేమోనని చూశాడు రాయలు. కానీ - వాళ్ళు చేతులను భద్రంగా

బిగించి కట్టారు. తనను వాళ్ళల్లోఎవరూ గమనిస్తూన్నట్టుగా కనిపించలేదు. రాయలు బొబ్బలు పెట్టసాగాడు. అతని నోరు మూయించడానికి వాళ్ళల్లో ఒకడువచ్చి తన ముష్టితో రాయల ముఖంమీద బలంగా గ్రుద్దాడు. ఆ దెబ్బకు రాయలు మళ్ళీ స్పృహతప్పి పడిపోయాడు.

# 14

ఇలా రాయలు స్పృహతప్పి అదెంతసేపు పడి వున్నాడో అతనికే తెలియదు. స్పృహవచ్చి చూడగా ఆ గుహలో ఎవరో ఒకడు తప్ప, తక్కినవారంతా వెలుపలికి వెళ్ళిపోయి వున్నారు. రాసులు రాసులు కందమూలాలను ఉడికిస్తూ అతడు పొయ్యిముందు కూర్చునివున్నాడు. అతని ప్రక్కనే వున్న మరొక పొయ్యిమీద వేడిచేసిన మద్యం వుంది. దానివాసన గాలిలో తేలివచ్చి రాయల ముక్కులలో ప్రవేశించి అతని ఘ్రాణేంద్రియాన్ని తట్టి మేల్కొలిపింది. రాయలు అరవడానికి చూశాడు. సాధ్యంకాలేదు. రాయల ముఖమంతా ఎరుపెక్కి అగ్గిలా కాలిపోతోంది. తల భారంగా గిర్రున తిరుగుతున్నట్టుగావుంది. హృదయాంతరాళంలో కళ వళంలేచి ఒకవిధమైన అశక్తత గూడుకట్టుకుంది. ఆస్థితిలోనే ఎక్కువసేపువుంటే తను మరణించడమే తథ్యమని రాయలు తల్లడిల్లాడు. పొయ్యిముందు కూర్చునివున్న ఆ మనుష్యుని

దృష్టితనవైపు తిరిగింది. రాయలు తనవద్దకు రమ్మని అతన్ని తలతో సంజ్ఞచేశాడు. అతనికి రాయల స్థితినిచూసి కరుణ కలిగివుండాలి. పరుగెత్తుకుని వచ్చి రాయలవద్ద నిలబడి, రాయలు ఊపిరాడక కష్టపడుతూ వుండటంచూసి కట్లను ఊపి రాడేమట్టుకు సడలించాడు. అందువల్ల రాయలకు పోయిన ప్రాణం మళ్ళీ వచ్చినట్టయింది. అలాంటి కటిక వాళ్ళ నడుమ కూడా ఒక కరుణావంతు డున్నాడుకదా అని అతని పట్ల రాయలకు కృతజ్ఞత కలిగింది. అతనితో మాట్లాడి తననెత్తుకుని వచ్చిన వాళ్ళెవరు? వాళ్ళ ఉద్దేశమేమిటి? అని తెలుసుకోవ డానికి రాయలు ప్రయత్నించాడు. కానీ—రాయలకు నిరాసే అయింది. అతడు మూగవాడని తెలియడానికి రాయల కెంతో సేపు పట్టలేదు. రాయలు మూగభాషలోనే మాటాడవలసి వచ్చింది. వీటిలో అతనికెన్ని సంగతులు తెలిసాయో చెప్పడం కష్టం! ఇంతకూ అతని నుంచి రాయలకు ఏ ఒక్క విషయమూ తెలియలేదు.

రాయలకు, పొయ్యిమీద వేగిపోతున్న అపదార్థాల దుర్వాసన పీల్చి వమనంచేసుకునేటప్పటికి సంవేదనను కలి గించింది. కాస్తనీరు త్రాగితే కళవళం తక్కువకావచ్చునని అనుకుని, నీళ్లుకావాలని సంజ్ఞచేశాడు. ఇది అతనికి అర్థమై, ఒక కుండలో వేడిమిగల కల్లును తెచ్చియిచ్చాడు. దానిని త్రాగి దాహం తీర్చుకొమ్మని. కానీ—ఆ కల్లు వాసనను చూడగానే రాయలకు మళ్ళీ తలతిరుగ నారంభించింది. మళ్లీ నీటికోసం రాయలు దైన్యంగా సంజ్ఞచేశాడు. అప్పుడా

మూగవాని కదేమనిపించిందో ఒక కుండను తీసుకుని గుహ బయటకు వెళ్ళిపోయాడు.

రాయలు చుట్టూ చూశాడు. గుహయొక్క ఏర్పాట్లు గల వైపు రాయల దృష్టి ప్రసరించింది. అది వాళ్ళ వాస స్థల మనడానికి దానిని శుభ్రంగా వుంచుకుని వుండడమే నిదర్శనం. ఒకమూలలో నిత్యావసర ఉపయోగానికి పనికి వచ్చే వస్తువులనేకం దాచివున్నారు. ఒక్కమాటతో ఆగుహ ఆ ముఠావాళ్ల ప్రపంచమే అయింది.

ఇంతసేపటికి వంటవాడు మట్టిపాత్రలో స్వచ్ఛమైన చల్లటి నీరును తెచ్చి రాయల నోటికందించాడు. రాయలతణ్ణి మనస్సులోనే మెచ్చుకుంటూ దప్పికను తీర్చుకున్నాడు. ఆతర్వాత వెలుపల ఎవరోవస్తున్న శబ్దమవగా అతడు గాభరా పడి తన వంటపని చూసుకోవడానికి పొయ్యివద్దకు వెళ్ళి కూర్చున్నాడు.

అతని నిరీక్ష వ్యర్థంకాలేదు. వెలుపలికి వెళ్ళినవాళ్ళంత దరూ ఒక్కొక్కరుగా గుహాలోకి రాసాగారు. వాళ్లందరి వెనుకా వాళ్లనాయకుడైన షంషీర్ ఖాన్ నడచి వస్తున్నాడు. అతని వెనుక, పెద్దమూటను ఎత్తుకుని యిద్దరు లోపలికి వచ్చారు. ఆతర్వాత వాళ్లు తాముతెచ్చిన మూటను వంట వానిముందు విప్పారు. దానిలో అడవికోళ్ళనూ, కంజులనూ, ఒక జింకనూ, ఆదినపుపండుగ విందుకోసం వేటాడితెచ్చారు. వాళ్ళ చిరకాలపు ఆశ — కృష్ణదేవరాయలను బంధించి శిక్షించడం — అప్పుడునెరవేరింది. అందువల్లనే ఆదినం వాళ్ళకు పండుగ. అందరూ రాయలను ఒకక్షణకాలం తీక్ష

ణంగా చూసి, తమలోనే ఏదోనిర్ణయించుకుని మళ్లీ తమ పనులలో నిమగ్నులయ్యారు.

ఆ మాంసాహారం సిద్ధమవుతున్నట్టే, ఆ దుర్వాసనను సేవించిన రాయలు మళ్లీ మూర్ఛపోయాడు.

మధ్యాహ్నం గడచి సంజఅయినది. అప్పటికి వంట కూడా పూర్తయింది. వాళ్లు చీకటిపడగానే గుహాద్వారాన్ని మూసివేసి, పండుగ భోజనం చెయ్యడానికి వృత్తాకారంగా కూర్చున్నారు. మధ్యన వేయించిన మాంసం, మసాలా పొడులనూ, కల్లునూ తదితర భక్ష్యభోజ్యాలనూ తెచ్చి వుంచుకుని తృప్తిఅయ్యేవరకూ తిని త్రేన్చారు. వాళ్లకు పూర్తిగా మద్యపు మైకమెక్కి, ఏదో పదాలు వాళ్లనోటి నుంచి వెలువడ నారంభించాయి. మధ్యమధ్య కేకలు, చప్పట్లు వాళ్లల్లో జగడాలుకూడా అయ్యాయి. పండుగ సంబరమంతా ముగిసేవేళకు దాదాపు అర్ధరాత్రి అయింది. వాళ్లు మద్యపు మైకంలోనే మైమరచి పడుకున్నారు. వాళ్ల నాయకుడు షంషీర్ ఖాన్ కూడా వాళ్లనుంచి వేరుకాలేదు.

వాళ్లందరిపైకీ అర్ధరాత్రిఅయినా యింకా నిద్రించకుండావున్నవాడెవడంటే ఆ మూగ వంటవాడుమాత్రమే! అతడు అందరూ పడుకుని వుండడం నిశ్చయించుకొని రాయలకు ఆకలిగా వుండవచ్చునని, కాలిన మాంసపుముక్కలను తినడానికిచ్చాడు. రాయలు తను వాటిని స్వీకరించడంలేదని సంజ్ఞచేసి తెలియజేశాడు. అతడు ఆకలిదప్పుల అవసరాన్ని గుర్తించలేని స్థితిలో వున్నాడు. రోజంతా కలిగిన బడలిక వల్లనూ, ఒకదానిమీద ఒకటిగాపడిన దెబ్బలవల్లనూ అతడు

సొమ్మసిల్లిపోయాడు. అలసటజెందిన శరీరానికి నిద్రకావలసి వచ్చింది. రాయలు అలాగే పడుకున్నాడు. అతనికి నిద్ర ఎప్పుడుపట్టిందోకూడా తెలియలేదు.

మరుసటిరోజు ఉదయమయ్యేవరకూ గుహలో పడుకున్నవాళ్లు లేవలేదు. అందరూ శరీరంమీద స్పృహలేకుండా గాఢమైన నిద్రపోయారు. అందరికంటే ముందు లేచినవాడు షంషీర్ ఖాన్. అతడు యితరులను లేపి, వెలుపలికివెళ్లి ముఖం కడుక్కొనివచ్చి క్రిందటిరోజు మిగిలిన చద్దిని తిని, రాయల విచారణకు ప్రారంభించాడు.

తక్కినవారు రాయలను అక్కడేవున్న ఒక కంబానికి బిగించికట్టి, తమ నాయకుడుచేసే విచారణను కుతూహలంతో వింటూ నిలబడ్డారు. షంషీర్ ఖాన్ మొదట మాట్లాడి తనెవరు? రాయలను పట్టితెచ్చి చంపాలనుకోవడంలో తన ఉద్దేశమేమిటి? అన్నది వివరంగా తెలియజేశాడు.

షంషీర్ ఖాన్ క్రితం ఒకతూరి బిజాపుర సైన్యంలోవున్న వాడే. అతడు ధైర్యంలో శక్తిలో పులిలావుండేవాడు. బిజాపుర సుల్తానునితో రాయచూరు యుద్ధంలో భాగంవహించాడు. అతడు స్వామినిష్ఠాసేవకుడు. అతని నాయకుడు-ప్రభువు మరెవరోకాదు సలబత్ ఖానే. సలబత్ ఖాన్ కు షంషీర్ ఖాన్ నుచూస్తే చాలా విశ్వాసముండేది. అతన్ని తన తమ్ముని లా చూస్తూండేవాడు. యుద్ధరంగంలో అతని ధైర్య సాహసాలనుచూసి అతన్ని ఒక సేనాధిపతినిగా చేశాడు. రాయచూరు యుద్ధంలోకూడా తన నాయకునికి కుడిభుజంలా నిల

బడి, ప్రాణంమీద ఆశవదలి పోరాడాడు. దురదృష్టవశాత్తు యుద్ధరంగంలో సలబత్‌ఖాన్ రాయలకు పట్టుబడిపోయాడు. షంషీర్‌ఖాన్ యుద్ధరంగంలో మరణించక, పట్టుబడకుండా తప్పించుకుని పారిపోయి, ఆ తర్వాత అతడు బిజాపుర సుల్తానుని రక్షణాసైనికులలో ఒకడుగా నిల్చాడు. కానీ, అదిల్ శహా బిజాపురంమీద దాడిజరపడానికి వచ్చిన రాయలను ఎదురించి యుద్ధంచెయ్యడానికిమారు, నగరాన్ని శత్రువుల పాలుచేసి పిరికిపందలా తన సైన్యసమేతంగా పారిపోవటం చూసి అతడు విసుగుపడి ఆ పిరికిపందతో బ్రతకడంకంటే ధీరుడుగా మరణించడమే మంచిదని అతనిని విడచిపెట్టి, తన ఆప్తమిత్రులను చేర్చుకుని సలబత్‌ఖానును చెఱనుంచి విడుదలచేసే ప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు. ఈసమయంలోనే రాయలు అసద్‌ఖానుని మాటలువిని చెఱసాలలోవున్న సలబత్‌ఖానును చిత్రహింసచేసి చంపాడు. ఈ విషయం విని షంషీర్‌ఖానుకు రాయలమీద చాలా కోపంవచ్చింది. తన ప్రభువును నిష్కారణంగా హింసించి, హత్యచేసిన రాయల మీద పగతీర్చుకోవడానికి నిశ్చయించి, తన నిశ్చయాన్ని కార్యగతం చెయ్యడానికి పొంచువేసి రాయలు వెళ్ళిన ప్రదేశమంతా అతణ్ణి వెన్నంటి వెళ్ళసాగాడు. ఇప్పుడు స్వల్ప సైన్యంతో వెళ్ళిన రాయలు ఒంటరిగా వాళ్ళచేతులలో పట్టుపడటం అతని దురదృష్టమనే చెప్పాలి.

రాయలు ఎలా సలబత్‌ఖానును చిత్రహింసచేసి చంపాడో అదేవిధంగా రాయలనూ చిత్రహింసచేసి చంపాలని షంషీర్‌ఖాన్ నిర్ణయించాడు.

ఈ విషయాలన్నీ విని రాయల శరీరం దహించుకు పోయింది. సలబత్‌ఖాన్ హత్యానుగరించిన పగను తీర్చు కోవడానికి ఆ తృతపడుతున్న షంషీర్‌ఖాన్ నుంచి తనకిక విముక్తిలేదు. ఇతని చేతులలో తనకు మృత్యువు తప్పదని రాయలు భీతిల్లాడు. ఆక్షణంలో అతనికి తన ప్రీతిపాత్రులైన వారిమీాద జ్ఞాపకం కలిగింది! తన మిత్రులు జ్ఞాపకానికి వచ్చారు! అప్పాజీ మనసులో మెదిలాడు. అప్పాజీ తనవద్ద వుంటే తనకు ఈ గండం సంభవించి వుండేదికాదు. ఒంట రిగా వేటాడడానికి అతడెప్పుడూ అవకాశ మిచ్చేవాడుకాదు. విజయోన్మత్తుడైన తను సరైన రక్షణలేక ఈ అడవికి వచ్చి శత్రువుల చేతుల్లో చిక్కుకున్నాను అని తన దౌర్భాగ్యాన్ని తలచుకుని పరితపించాడు. ఆసమయంలో తిమ్మరుసు చెప్పిన మాటలన్నీ—తలపుకు వచ్చాయి. తను అప్పాజీమాట విన కుండా బిజాపురసుల్తాను మీాద యుద్ధానికి వెళ్ళి దాని మూలంగా సలబత్‌ఖానును చెఱసాలలో వుంచవలసివచ్చి. అసద్‌ఖానునిపితూరీకి వశుడై సలబత్‌ఖానును చంపించవలసి వచ్చింది. ఈ హత్యవల్ల తను షంషీర్‌ఖాన్ చేతికిచిక్కి చావ వలసిన సమయం వచ్చింది—అని తన దుర్విధికి తనేనిందించు కున్నాడు.

సలబత్‌ఖానును తను ఎలా విచారణ లేకుండా క్రూరంగా శిక్షించి చంపాడో అదేవిధమైన శిక్షను తను అనుభవించవలసి వచ్చినదన్న సంగతిని తలచుకని రాయల ముఖం స్వేదమయమైంది. రక్తం గడ్డకట్టుకు పోయింది.

రాయలు చావడానికి భయపడలేదు. కానీ — తన కిప్పుడు రానున్న హీనమైన చావును తలచుకుని భయపడు తున్నాడు. చక్రేశ్వరుడైన తను, దక్షిణాపథపు ఏకైక సార్వభౌముడైన తను, అరిరాయ భయంకరుడని బిరుదుపొందిన తను, ఒక అనామధేయుని చేతిలో అనామధేయ ప్రదేశంలో క్రూరంగా చంపబడడం తలచుకుని రాయలు తల్లడిల్లాడు. తనలాంటి వీరునికి యుద్ధరంగంలో మరణంసంప్రాప్తించి వుంటే వీర స్వర్గమలంకరించి వుండవచ్చు. కానీ గుహలో చిత్రహింసకులోనై, కుక్క నక్కలకంటే హీనమైనచావు చస్తే తనకు వీరమరణమూలేదు; స్వర్గసౌఖ్యమూలేదు. తనకెంతటి కష్టం సంప్రాప్తించింది అని దుఃఖించాడు. పంపాపతి దయ వున్నట్టుకానీ అని చివరిసారి విరూపాక్షస్వామిని తలచుకుని భగవంతునిమీద భారంవేసి, నిశ్చింతతో నిశ్చలంగా నిలబడ్డాడు.

షంషీర్ ఖాన్ వచ్చి రాయలముందు నవ్వుతూ నిలబడ్డాడు. రాయల దురవస్థను చూచి అతనికి సంతోషమైంది. రాయలు మరణించడానికి ముందు సలబత్ ఖానుని చావు కోసం అతణ్ణి పశ్చాత్తాప పడేలా చెయ్యాడముకోసమే ఇది వరకూ అతణ్ణి వూరకవదిలిన ఉద్దేశ్యమైంది. రాయల నోటి నుంచి ఒక్క మాటకూడా రాకపోవడంచూసి, రాయలను విచారించడానికి అతని వద్దకువచ్చి నిలబడ్డాడు.

తనను తాకడానికి వస్తున్న షంషీర్ ఖాన్ను చూసి "నీచా! దూరంతొలగు!" అన్నాడు రాయలు.

ఈమాటలువిని మంషీక్‌ఖాన్‌ బిగ్గరగానవ్వి: "సార్వభౌములను తాకి నేనెందుకు నాచేతిని అపవిత్రం చేసుకోవాలి? సార్వభౌములను తాకడం చేతితోకాదు—ఈ కత్తితో" అని కత్తి కొసను రాయల హృదయంమీద మోపి అన్నాడు.

"పిరికివాడా, దూరంతొలగు. అసహాయుడై పట్టుబడినవాడి మీదనా నీశౌర్య ప్రదర్శన? నీధైర్యానికి ధిక్కారం! నువ్వు వీరుడవైతే నాచేతికి ఖడ్గమిచ్చిపోరాడు, పిరికిపందలా గొంతుపిసికి చంపే యోచన చెయ్యవద్దు."

"సార్వభౌములు మహా ప్రతాపశాలులు! మీ చేతికి కత్తినిచ్చి ధర్మయుద్ధం చెయ్యాలా, ధర్మయుద్ధం! సార్వభౌము లిదివినాలి. ఆరోజు చెఱసాలలో సలబత్‌ఖాన్‌ను చంపునప్పుడు ఈ ధర్మబుద్ధి ఎక్కడికి పోయింది? నిస్సహాయులైన వాళ్ళను చిత్రహింసలు పెట్టి చంపునప్పుడు ప్రభువుల బుద్ధి ఎక్కడికి వెళ్ళిందో తెలీదు" అని వ్యంగ్యంగా నవ్వుతూ అన్నాడు.

రాయలు ఈ మాటకు ఏమి జవాబివ్వాలన్నదీ తెలియకుండా క్షణకాలం వూరకుండి తర్వాత అన్నాడు.

"ఇదంతా అసద్‌ఖానుని పితూరివల్ల జరిగింది."

"అసద్‌ఖానుని పితూరీవల్లనా? పాపం, అప్పుడు సార్వభౌముల వివేకం, ధర్మబుద్ధి ఎక్కడికి వెళ్ళాయో! ఇదంతా కపటనాటకం! ఈనాటకాలు నాముందేమీ ప్రదర్శించనక్కరలేదు! మిమ్మల్ని త్వరలోనే సలబత్‌ఖాన్‌వద్దకు పంపబోతున్నాను. మీరే అతని వద్దకు వెళ్ళి ఏమి చెప్పు

కుంటావో చెప్పుకోండి!'' అని రాయల హృదయం మీద ఖడ్గపు మొనతో గాయంచేసి ఆతర్వాత ఖడ్గమెత్తి అతని వక్షస్థలానికి గురిపెట్టాడు. అదృష్టవశాత్తూ ఆ దెబ్బ జారి భుజం వద్ద బలమైన గాయాన్ని కలిగించిందే కానీ, రాయల ప్రాణాన్ని అపహరించలేదు.

రాయలు ఖడ్గపు దెబ్బకు "హా" అని తలను వాల్చి వేశాడు. షంషీర్ ఖాన్ రాయలను కత్తి కొనతో గుచ్చి చైతన్యం కలిగించాడు. ఆతర్వాత యిష్టంవచ్చినచోట గాయపరచి రక్తాభిషేకంచేసి చంపడానికి ఉరికంబంవద్దకు తీసుకుని పోయాడు.

మరొక నిమిషంలో రాయలను ఉరికంబానికెక్కించి అతని అవతారము సంతటితో పరిసమాప్తి చెయ్యాలనుకుంటున్నంతలో ఒక అద్భుతం జరిగింది. ఎక్కడ నుంచినో ఒక సన్యాసి హఠాత్తుగావచ్చి అక్కడ కనుపించి, తన త్రిశూలంతో రాయల కంఠానికి బిగించివున్న ఉరి త్రాటిని ఖండించాడు. దానిని చూచి దిగ్భ్రమచెందిన షంషీర్ ఖాన్ ఆ సన్యాసిమీద చెయ్యిచేసుకోవడానికి చూస్తున్నంతలో, ఆ సన్యాసి చేతిలోవున్న భస్మాన్ని 'ఉఫ్' న ఊది రాయలను ఎత్తుకుని వెళ్ళిపోయాడు. ఆబూది వల్ల దట్టమైన పొగ లేచి, ఆగుహ అంతా ఆవరించుకుంది. మరునిముషంలో భయంకరమైన ప్రేలుడు వినిపించి అక్కడున్నవాళ్ళంతా దాన్లో నే సమాధి అయ్యారు.

రాయలకు స్పృహవచ్చి కళ్ళు తెరచి చూడగా అతన్ని పర్ణకుటీరంలో పడుకోబెట్టి, ఒకసన్యాసి అతని

చేస్తూ నిలబడివున్నాడు. అతనికిదంతా కలలో జరుగుతూన్నట్లే అనిపించింది.

రాయలు కళ్ళు తెరచి చూడడం గమనించి, ఆసన్న్యాసికి తన ప్రయత్నం విఫలంకాలేదని సంతోషం కలిగింది. అతడు మృత్యుగహ్వరంలోనుంచి తప్పించుకున్నాడని హర్షించాడు. ఆ సన్న్యాసి నిరంతరోపచారాల వల్ల రాయలకు పోయిన ప్రాణం మళ్ళీవచ్చింది. అడవిలో లభించే మూలికలతో, ఆ సన్న్యాసి సంజీవినిలాంటి ఔషధాన్ని తయారించి రాయల గాయాలన్నిటికీ పట్టించాడు. అంతేకాక రాయలకు పోయిన ప్రజ్ఞమళ్ళీ రావడానికి, ఏదోరసాన్ని త్రాగించి, శరీరానికంతా బూదితో 'కావు' యిస్తూ కూర్చున్నాడు. రాయలు రక్తస్రావంతో చాలా ఆశక్తుడై, శరీరంమీద ప్రజ్ఞలేకుండా జీవచ్ఛవంలా పడివున్నాడు. అతని శరీరంలో ఒక్క-పిసరు ప్రాణం మాత్రమే మిగిలింది. ఇంతటి విషమ పరిస్థితిలో ఆ సన్న్యాసి రాయలకాప్తుడై వచ్చి, అతణ్ణి ఉరికంబంనుంచి తప్పించడమేకాక, అతనిగాయాలకు చికిత్సచేసి, రాయలప్రాణాలను మిగిలించాడు. ఇంతకూ రాయల ఆయుస్సు గట్టిది. అతనిమీద పంపాపతికృప అపారమైనది. అందువల్లనే అలాంటి విషమపరిస్థితిలోకూడా రాయలు తప్పించుకుని బయటపడ్డాడు. ఇది అతని పుణ్యంవల్ల మాత్రమేకాదు. సామ్రాజ్యపు ప్రజాకోటి పుణ్యంవల్ల బ్రతికాడు. అతడు చేసిన దానధర్మాలు సన్న్యాసి రూపంలోవచ్చి అతణ్ణి కాపాడాయి.

రాయలు తన సుషుప్తినుంచి మేలుకుని బాధను, నొప్పులనూ తెలుసుకోగలిగిన స్థితికి రావడానికి చాలాకాలం కావలసి వచ్చింది. రాయలను ఆస్థితికి తీసుకురావడానికి తన తపఃప్రభావాన్నంతా వ్యయపరచాడు. తన తపస్సును ధారబోసి రాయలను బ్రతికించాడు. ఆమహాత్ముని తపః ప్రభావం లేకపోయినట్టయితే రాయలు జీవించడం దుస్తర మయ్యేది. ఇలా సామ్రాజ్యపు దైవం అతన్ని రక్షించింది.

రాయలకు యిప్పుడు సంపూర్ణ ప్రజ్ఞవచ్చింది. అత నికి తనకుపచరిస్తున్న సన్యాసిఎవరు? తనిక్కడికి ఎలా వచ్చాడు? తనను హత్యచెయ్యడానికి తీసుకుపోయిన షంషీర్ ఖాన్ ఏమయ్యాడు. అతనికి తెలియకుండా దుర్భేద్యమైన ఆగుహనుంచి తప్పించుకున్నదెలాగ? ఇత్యాది ప్రశ్నలకు జవాబు తెలియక కుతూహలంతో, రెప్పవెయ్యకుండా తననే చూస్తూ కూర్చునివున్న ఆసన్యాసిని చూశాడు.

రాయల చూపుల్లోవున్న కుతూహలాన్ని గమనించి, సన్యాసి చిరునవ్వునవ్వాడు. ఆనవ్వు వెన్నెలలా ఆహ్లాద కరంగా వుంది.

"ప్రభూ! ఇప్పుడు శరీరంలో నొప్పిఎలావుంది? గాయాలు యింకా బాధిస్తూనేవున్నాయా?" అని ప్రీతితో మృదువుగా ప్రశ్నించి, రాయల తలను నిమిరాడు.

రాయలకు ఆసన్యాసిమీద అమితమైన గౌరవ, భయ భక్తులేర్పడ్డాయి. మృత్యుగహ్వారంలోవున్న తనను, ఇక జీవించడంలేదని అనుకున్న తనను మిగిలించి కాపాడిన

అతడు సామాన్య మానవుడు కాదు — అవతారపురుషుడని రాయల భావన. తనమీది కృపతో పంపాపతే ఈవేషంలో వచ్చి తనను షంషీర్‌ఖాన్ కబంధహస్తంనుంచి తప్పించాడన్న నమ్మిక ధృఢంగావుంది. ఎవరికీ తెలియని అగోచర స్థలంలో మరణించడానికి సిద్ధుడై ఉరికంబమెక్కిన తనను విపత్తునుంచి హఠాత్తుగా రక్షించాడంటే అతడు తప్పనిసరిగా త్రికాల జ్ఞానే. అందువల్లనే రాయలు చైతన్యం కలిగిన వెంటనే ఆసన్యాసికి మనస్సులోనే వెయ్యిసార్లు వందన లర్పించాడు.

రాయల కుతుహలాన్ని చూసి సన్యాసి మెల్లగా అన్నాడు: "పంపాపతి దివ్యానుగ్రహం వల్లనే మీరిప్పుడు బ్రతకడం. సామ్రాజ్యపు పుణ్యవిశేషం, మీరుచేసిన దాన ధర్మాలవల్ల ప్రాణాలతో మిగిలారు"అని రాయలు విపత్తునుంచి ఎలా బయటపడినదీ వివరంగా తెలియజేశాడు.

ఆతర్వాత గంభీర స్వరంలో సన్యాసి మళ్ళీఅన్నాడు.

"అప్పుడు విజయదశమిరోజు, ఆరోజు ప్రభువులు నా మాటను సామాన్య బైరాగి మాటగా ఉపేక్షచేశారు. శాంతి సందేశాన్ని విన్పించడానికి మారుగా బిజాపురంమీద యుద్ధాన్ని ఘోషించారు. ఆయుద్ధఘోష ప్రకారం ప్రజల కసమ్మతమైనా బిజాపుర సుల్తానులమీద దండెత్తివెళ్లారు. రాయచూరు యుద్ధంలో అతన్ని అణగద్రొక్కి ఓడించారు. ఆతర్వాతైనా ప్రభువులు లభించిన విజయంతో తృప్తిపొంది సుల్తానుతో గౌరవపూర్ణమైన ఒడంబడిక చేసుకుని ఉభయు

రాష్ట్రాల, స్నేహ, శాంతి, సౌహార్ద్రతలకు పునాదివేస్తారని సామ్రాజ్యపు జనత నమ్మింది. కానీ—ప్రజాభీష్టాన్ని త్రోసిపుచ్చి, ఓటమిపొంది శరణాగతుడై స్నేహాభిక్షకు వచ్చిన సుల్తాను నవమానించి పంపారు. అతణ్ని తిరస్కారభావంతో చూశారు. అది చాలదన్నట్టుగా, నిండుసభలో సుల్తానుని ఆత్మగౌరవానికి వాతపెట్టునంతటి వర్తనను అపేక్షించారు! ప్రభువులకోరికనునెరవేర్చని సుల్తానులమీదఆగ్రహపడి బలాత్కరించడానికి బిజాపురంమీద దండెత్తివెళ్ళి, ఆసుందర నగరాన్ని ధ్వంసంచేసి వచ్చారు. అసద్‌ఖానుని మోసపు మాటలను నమ్మి, వీరుడూ, నిర్దోషీ అయిన సలబత్‌ఖాన్‌ను విచారణ లేకనే చంపించారు. అసద్‌ఖాన్‌ని మోసం బయలైన తర్వాత పగతీర్చుకోవడానికి గుల్బర్గ్‌మీద దండెత్తారు. ఇప్పుడు సలబత్‌ఖానుని సేవకుని పగకు బలిఅయి, ప్రాణాలకే ముప్పు తెచ్చుకున్నారు! ఇవన్నీ దేనివల్ల? ఎందుకుగాకలిగాయి? ప్రభువులు అప్పుడు ప్రజాకోటికి శాంతి సందేశ మివ్వక, యుద్ధఘోష చెయ్యడమే ఈ విపత్తులన్నిటికీ నాందిఅయినది ప్రభువులు మొదటినుంచీ చివరివరకూ ఒకటి తర్వాత ఒకటిగా తప్పు చేస్తూనేవచ్చారు. ఒకదానిమీద ఒకటిగా లభించిన విజయాలు తమ వివేకాన్ని మరగుపరచాయి. తిమ్మరుసు వివేకవచనాలకు ప్రభువులు చెవియివ్వనంతటి అహంకార స్వప్రతిష్ఠలు పెరిగాయి. ఇవి [illegible] దృష్టిమీద పొరలనేర్పరచి, అనేకములైన అవివేకపు [illegible]లకు ప్రోద్బలమిచ్చాయి......ఇదివరకూ జరిగిన దానికి ఇప్పుడు చింతించి ప్రయోజనంలేదు. ఇకనైనా ప్రభువు[illegible]

యుద్ధాన్ని చాలించి, జనతకు శాంతిసందేశాన్ని దయ పాలించి, ఇదివరకు జరిపించిన మారణహోమానికి ముగింపు తెచ్చి ఉభయ రాష్ట్రాలకూ వున్న విరోధ ద్వేషాసూయలను, స్నేహ సౌహార్ద్రతలతో తుడిచివెయ్యండి. బిజాపుర సుల్తానుతో గౌరవయుతమైన ఒడంబడిక చేసుకోండి. ఇదే జీవన మార్గం! అలా చెయ్యడంవల్ల రెండు రాష్ట్రాల జనత బాగుపడుతుంది. జగత్కల్యాణ మౌతుంది. ప్రభువులు సామ్రాజ్య జనతకు అభయహస్తమిచ్చి శాంతిదూతలుగా చిరకాలం జీవించండి. భగవంతునికృప మీమీద సర్వదావుండుగాక" అని తన మాటలు ముగించాడు.

అనంతరం తనదనే, దండకమండలాలను చేతికెత్తు కుంటూ: "ప్రభూ, నేనింక వెళ్ళుతున్నాను. ఇకమీకు ప్రాణ భయంలేదు. మీమీద పంపాపతి కృప సంపూర్ణంగావుంది. మిమ్మల్ని వెతుక్కుంటూ మీమిత్రులు మరికొంత సేపటికో వచ్చితీసుకుపోతారు. ఈవిషయంలో మీకు సంసయమక్కరలేదు. మీరత్నసింహాసనానికి సంభవించిన రెండవగండంకూడా భగవంతుని దయవల్ల యిలా నివృత్తమైంది" అని చెప్పి ఆ సన్యాసి తన పాదాలవద్దనున్న రాయలను ఆశీర్వదించి అతని వద్ద వీడ్కోలు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

రాయలు దిగ్భ్రమతో అతడు వెళ్ళిపోవడాన్నే చూస్తూవుండి అనంతరం పర్ణకుటీరాన్ని చూశాడు. అది శూన్యంగా కనిపించింది. అలాగే అతనిమనస్సు, హృదయం శూన్యంగా కనిపించింది. అతడలాగే పడుకుని దూరపు దిగం

తాన్ని చూస్తూవుండగా ఎక్కడో గుఱ్ఱపు డెక్కలధ్వని విని పించింది. రాయలు చకితుడై ఆవైపుచూడగా ఆరౌతులు తనవైపుకే వస్తున్నట్టు కనిపించింది.

ఆసన్యాసి చెప్పిన మాటలు నిజమయ్యాయి. వాళ్ళు రాయలను వెతుక్కుంటూ వచ్చిన అతని మిత్రులే!

# 15

శాంతివాది సందేశం ప్రకారం కృష్ణదేవరాయలు బిజాపురసుల్తాను అదిల్‌శహానుతో గౌరవపూర్ణమైనఒప్పందం చేసుకోవడానికి తిమ్మరుసును అక్కడే విడచి తను రాజధానికి వెనుదిరిగాడు.

రాజధానిలో రాజవైద్యులు చేసిన నిరంతరౌషధోప చార, ఆరోగ్యవిధులవల్ల కృష్ణదేవరాయల గాయాలు నయ మయ్యాయి. అయినా రాయలకు మునుపటి ఆరోగ్యం కలుగ డానికి కొన్నిమాసాల విశ్రాంతి కావలసి వచ్చింది. రాయలు నాగలాపురంలో తన ప్రేమరాణి చిన్నాదేవికి కట్టించి యిచ్చిన అంతఃపురంలో విశ్రాంతి సుఖాన్ననుభవిస్తూ వున్నాడు. ఇలావుండగా ఒకరోజు గోవానుంచి వచ్చిన రాజ దూత సంతోషవార్తను తెచ్చాడు.

గోవాను ఆక్రమించుకుని ప్రబలుడవడానికి ప్రయత్నించిన ద్రోహి అసద్‌ఖాన్ మీాద దండెత్తివెళ్ళిన గోవిందరాజు సకాలంలోనే అతనిమీాద పడ్డాడు. గోవా, పోర్చుగీసుల సహాయానికి వచ్చిన రాయలసైన్యాన్నిచూసి అసద్‌ఖానుకు భయంకలిగి గోవాను విడచి చాలాదూరం పారిపోయాడు. అతణ్ణి వెన్నంటివెళ్ళిన గోవిందరాజు అసద్‌ఖాన్ సైన్యాన్ని ఆపి పొగరణచకపోయినా అతణ్ణి ప్రాణాలతో పట్టుకోవడానికి వీలులేకపోయింది. రణరంగంనుంచి పిరికిపందలా పారిపోయి తలదాచుకో ప్రయత్నించిన అసద్‌ఖాన్ గోవిందరాజు కత్తికి తన కంఠాన్నే అర్పించవలసి వచ్చింది. ఇలా ఆస్వామి ద్రోహి కథ పూర్తయింది.

ఈ విజయవార్తనువిని రాజధానిలో అందరికీసంతోషమైనా రాయలకుమాత్రం సంతోషంకాలేదు స్వామిద్రోహి అయిన అసద్‌ఖానుకు గోవిందరాజునుంచి తగిన శిక్షఅయినదని అతని మనస్సు సమాధానమైనా, అప్పుడు తను నాటిన ఈ హింసా ప్రతీకార బీజం మొలకెత్తి పెద్దవృక్షమైతే ముందుకు దానినుంచి ఎంతటి విషఫలాలు కలుగుతాయో నన్న—భవిష్యద్ గర్భంలో దాగివున్న—భీతిని తలచుకుని క్షణకాలం తల్లడిల్లాడు. ఆరోజు శాంతివాది చెప్పిన మాటలింకా రాయల చెవిలో మారుమ్రోగుతూనే వున్నాయి.

"ఏవ్యక్తేకానీ, రాష్ట్రమేకానీ జీవించడానికి మార్గం యుద్ధంకాదు, ప్రభూ! విరోధ ద్వేషాసూయలు వినాశానికి దారులు. యుద్ధంవల్ల వైరి నిర్నామంకావచ్చు. కానీ—

స్వైరత్వం దమనం కావడంలేదు ...... శాంతి, స్నేహ, సౌహార్ద్రితలే నిజమైన జీవనమార్గాలు.''

ఈ మాటలు తలచుకోగానే రాయల కళ్ళముందు 'శాంతివాది' మంగళ రూపం ఒక్కతూరి కనిపించి మాయమైంది.

రాయలు తనలోనే నవ్వుకున్నాడు. ఏమితలచుకుని నవ్వాడో ఎవరికి తెలుసు?

—: సంపూర్ణం :—

---